# శ్రీనివాసతేజము

తాళ్లపాక అన్నమాచార్యులు, తాళ్లపాక పెదతిరుమలా
చార్యులు, తాళ్లపాక చినతిరుమలాచార్యులు రచించిన

## అధ్యాత్మ సంకీర్తనలకు

సీసపద్యానుసరణము




కర్త :

ముదివర్తి కొండమాచార్యులు

ఉపసంపాదకులు : పుస్తక ప్రచురణ విభాగము



సప్తగిరి సంపాదక కార్యాలయము

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

1982

SRINIVASA TEJAMU

Adaptation of Tallapaka Poets' Adhyatma Sankirtanalu into Telugu 'Sisam' Verses

By

Mudivarti Kondamacharyulu



First Edition : June, 1992
Copies : 1000

Price : Rs. 40-00

*This book is Published with the Financial assistance of*

**TIRUMALA TIRUPATI DEVASTHANAMS**

Under their Scheme

"AID TO PUBLISH RELIGIOUS BOOKS."

*Copeis Can be bad from :*

**M. Kondamacharyulu,**
18-1-214, K. T. Quarters, K. T. Road,
TIRUPATI - 517 501.

&

EMESCO Book CLUB
Andhra Pradesh Book Distributors
Eluru Road : VIJAYAWADA - 520 002.

*Printed at* :

Sri Vijayalakshmi Power Press,
BHATNAVILLI - 533 222
Amalapuram Mandal, E. G. Dt, (A. P.)
Phone : 21088 Amalapuram

*proprietors* : **Bulusu Veerabhadram & Suryanarayana.**

# విజ్ఞప్తి

అపూర్వపదభూషలతో ఆంధ్రవాగ్దేవత నలంకరించిన తాళ్ళ పాక అన్నమాచార్యులు (1408-1503), వారికుమారుడు పెదతిరుమ లాచార్యులు (1468-1553), వారిపుత్రుడు చినతిరుమలాచార్యులు (1493-1553) శ్రీనివాసునకు విన్నపముచేసిన కొన్ని అధ్యాత్మ సంకీర్తనలు- వాటికి నాచేసిన సీసపద్యానువాదం త్రివేణీసంగమంగా శ్రీనివాసతేజమనే నామంతో నేటికి గ్రంథరూపం ధరించింది.

ఇందులో పదకవితాపితామహ, హరికీర్తనాచార్యబిరుదాంకితు లైన అన్నమాచార్యులవారి అధ్యాత్మసంకీర్తనలు 120 ఉన్నాయి. 121, 122,123 పుటలలోని మూడుపాటలు అన్నమయ్యవి కావు. అన్న మయ్యకుమారుడు పెదతిరుమలాచార్యులో, ఆయనపుత్రుడు చినతిరు మలాచార్యులో చెప్పినవి. కాని అవి ఎట్లో అన్నమయ్యఅధ్యాత్మ సంకీర్తనలరేకులలోనికి ఎక్కినవి.

కవితార్కికసింహుడనీ, శ్రీరామానుజసిద్ధాంతస్థాపనాచార్యుడనీ ఎన్నికగన్న పెదతిరుమలాచార్యులవారి కీర్తనలు ఇందులో 108 కలవు.

అష్టభాషాకవిచక్రవర్తిగా పొగడొందిన చినతిరుమలాచార్యుల వారిపదము లిందు 23 కుదురుకొన్నవి. వెరసి 25 పాటలు, వాటి పద్యానువాదంతో శ్రీనివాసతేజం శ్రీనివాసానుగ్రహంతో వెలువడు తున్నది.

150 సంవత్సరములు అవిచ్ఛిన్నముగ శ్రీవేంకటేశ్వరభక్తి సామ్రాజ్యము పాలించినవారూ, ఏకకుటుంబస్థులూ, పదకవితలకు ఆద్యులూ అయిన ఈ కవిత్రయంవారి సంకీర్తనల శబ్దార్థరామణీయక మెట్టిదో పాఠకులు శ్రీనివాసతేజంలో అనుభవించగలరు.

సహజకవితామాధుర్యం తుంపెసలారు పరమభాగవతోత్తము లైన ఆ మహామహుల పాటలను పద్యీకరించుటలో నా భక్తిశ్రద్ధ లేపాటివో చదువరులే గుర్తింపగలరు.

తిరుమలతిరుపతిదేవస్థానంవారి పుస్తకప్రచురణశాఖలో పని చేస్తూ తీరుబడిలభించినపుడెల్ల భగవత్కైంకర్యరూపమైన శ్రీతాళ్లపాక కవుల పదసాహిత్యం పరిశీలిస్తూ, నాకు రుచించిన పాటలకు ఇలా పద్యరూపం కల్పించాను. ఆ పరంపరలో ఇది ఐదవప్రబంధం.

తండ్రి తనయుడు మనుమడు రచించిన కేవల అధ్యాత్మ సంకీర్తనలే రమారమి మూడువేలవర కున్నవి. ఐదేండ్లుగా పరిశ్ర మిస్తున్నప్పటికీ సగంపాటలకైన పద్యరూపం కల్పించలేకుంటినే అన్న చింత పీడకున్నది.

ధార్మికగ్రంథప్రకాశనంపట్ల పరమశ్రద్ధాళువులై రచయిత లకు మిక్కిలి తోడ్పడుతున్న ఉదారచరితులు, తి. తి. దేవస్థానముల శ్రీకార్యనిర్వాహకులు మాన్యశ్రీ యం.వి.యస్.ప్రసాద్, ఐ.ఏ.ఎస్ గారు నాకు నిత్యస్మరణీయులు. వారికి నాహృదయపూర్వకములైన ధన్యవాదము లర్పించుకొనుచున్నాను.

సొంతముగ ప్రూపులు చదువుచు తమ విజయలక్ష్మీపవర్ ప్రెస్సులో శ్రీనివాసతేజమును సర్వాంగసుందరముగ ముద్రించి ఇచ్చిన బ్రహ్మశ్రీ బులుసు వీరభద్రశర్మగారికిని, వారిపుత్రులు శ్రీసూర్యనారాయణగారికిని కృతజ్ఞతాభివందనములు.

తిరుపతి
12-6-1992

ముదివర్తి కొండమాచార్యులు.

స్వస్తి శ్రీ జయాభ్యుదయ శాలివాహనశక వరుషంబులు
౧౩౪౬ అగు నేఁటి క్రోధిసంవత్సరమందు తాళ్ళపాక
అన్నమాచార్యులు అవతరించిన పదారు యేండ్లకు
తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతేను అదిమొదలు
గాను శాలివాహనశక వరుషంబులు ౧౪౨౪
అగు నేఁటి దుందుభిసంవత్సర ఫాల్గుణ బ
౧౨ నిరుధానకు (నిరోధానకు ? తిరో
ధానకు) తిరువేంగళ నాథుని
మీఁదను అంకితముగాను
తాళ్లపాక అన్నమాచార్యులు విన్నపముచేసిన

# అధ్యాత్మ సంకీర్తనలు.

# శ్రీ నివాసతేజము

లలిత

ఘనుఁ డాతఁడె మముఁ గాచుఁగాక హరి
అనిశము నే మిఁక నతనికె శరణు ॥పల్లవి॥

యెవ్వని నాభిని యీ బ్రహ్మాదులు
యెవ్వఁడు రక్షకుఁ డిన్నిటికి
యెవ్వనిమూలము యీ సచరాచర
మవ్వల నివ్వల నతనికె శరణు ॥ఘను॥

పురుషోత్తముఁ డని పొగడి రెవ్వరిని
కరి నెవ్వఁడు గక్కునఁ గాచె
ధర యెవ్వఁ డెత్తె దనుజులఁ బొరిగొనె
అరుదుగ మే మిఁక నతనికె శరణు ॥ఘను॥

శ్రీసతి యెవ్వనిఁజేరి వురమునను
భాసిలె నెవ్వఁడు పరమం బై
దాసులకొరకై తగు శ్రీవేంకట
మాస చూపు నితఁ డతనికె శరణు ॥ఘను॥

రేకు 304 సంఖ్య 22 సంపు 10 పుట 15

సీ. ఎవనినాభి జనించి రీ చతుర్ముఖముఖ్యు
లెవ్వండు రక్షకుం డిన్నిటికిని;
ఎవ్వండు మూలమౌ యీ చరాచరసృష్టి
కతని శరణుఁజొత్తు మవల నివల;
పురుషోత్తముం డని పొగడెద రెవ్వని;
గ్రక్కునఁ గాపాడె కరి నెవండు;
ధర నెవ్వఁ డెత్తెను; దైత్యులఁ బోరిగొనె;
యనిశ మా నారాయణునకె శరణు;

గీ. ఎవ్వనియురమ్మునంజేరి యెసఁగు లక్ష్మి;
పరముఁ డెవ్వండు; నిజదాసపటలికొఱకు
నానతో వేంకటాద్రినివాసుఁ డయ్యెఁ;
వరదుఁ డలమేలుమంగమ్మపతికి శరణు.

భూపాళం

కన్నవారివద్దనెల్లఁ గావంగ నేమిగద్దు
యిన్నిటికి నియ్యఁగొన నీతఁడే స్వతంత్రుఁడు ॥పల్లవి॥
పరమేష్ఠిఁ గన్నతండ్రిఁ బాటించి కొలువరో
అరుదై లోకాల కెల్ల నతఁడే తండ్రి
సిరిమగఁడై నవానిఁ జేపట్టి తలఁచరో
సిరు లిచ్చే మేఁటిదాత సృష్టి కెల్ల నతఁడే ॥కన్న॥
అంబరీషుఁగావఁ జక్ర మంపినవానిఁ జేరరో
అంబుజభాండాన కతఁడే రక్ష
పంచిన భూకాంతపతిఁ బాయక సేవించరో
వుంబళ్లు పూళ్లు నిచ్చే వున్నతుఁడు నతఁడే ॥కన్న॥
మూలమంటేఁ గరిఁగాచే ముఖ్యునికి మొక్కరో
మూలధనమై యుండీ ముందర నిట్టె
యీ లీలఁ జిత్తజుతండ్రి నెదలోనఁ గొలువరో
పాలించ శ్రీవెంకటాద్రిపతి యాయె నితఁడే ॥కన్న॥

రేకు 841. సంఖ్య 238. సంపు 10. పుట 159

సీ. పరమేష్ఠితండ్రిని పాటించి కొలువరో
అన్ని జగమ్ముల కతఁడె తండ్రి
సిరిమగండగువానిఁ జేపట్టి తలఁచరో
సిరులిచ్చు నెఱదాత సృష్టి నితఁడె
అంబరీషునిఁగావ నటు చక్రమంపిన
యతనిఁ జేరరొ సృష్టి కతఁడె రక్ష
భూవనితాపతి సేవించరో యతఁ
డుంబళియూళ్లిచ్చు నున్నతుండు

గీ. "ఆదిమూలము" యన హస్తి నాదుకొన్న
ముఖ్యునకు మ్రొక్కరయ్య! మీ ముందు నిలుచు
మదనజనకునిఁ గొలువరో మనలఁ బ్రోవ
వంజనగిరీంద్రనాయకుం డాయె నితఁడె.

దేసాళం

తల్లియుఁ దండ్రియు మరి దైవము నాతఁడెకాక
యెల్లజీవులకు మరి యెవ్వరింక దిక్కు ॥పల్లవి॥

యీ సంసారమునకు యితఁడె దిక్కు నేఁ
జేసేటి చేఁతలకెల్ల శ్రీపతేలోను
పాసిపోఁ డెప్పుడు నన్ను, బంధువుఁ డితఁడె నాకు
దాసుఁడైనవాడు హరిఁ దగదు దూరఁగను ॥తల్లి॥

చావుఁబుట్టుగులవేళ సతము నీతఁడే
సావి భోగములకు నిచ్చకుఁ డీతఁడే
భావములోపలనుండు ప్రాణ మీతఁడె నాకు
దైవము దూరఁగనేల తనకేమి వచ్చినా ॥తల్లి॥

తలఁపులోపలికి యీ దైవమె తోడు
యిలఁ గలిమిలేముల కీతఁడె తోడు
పలుకులోపలనుండు భాగ్య మీతఁడె నాకు
కొలిచి శ్రీవెంకటేశుఁ గొసరఁగ నేఁటికి ॥తల్లి॥

రేకు 335. సంఖ్య 205, సంపు 10. పుట 137

సీ. తల్లియుఁ దండ్రియు దైవ మీతఁడె గాక
యెల్లజీవులకు దిక్కెవ్వ రింక?
ఈ కాఁపురమునకు నీతండె దిక్కు; నేఁ
గావించుపనుల కీ ఘనుఁడె దిక్కు;
పాయఁ డెప్పుడు నన్ను; బంధు వీతఁడు నాకు;
దాసునికిన్ దూఱఁదగదు హరిని;
చావుపుట్టులవేళ జంటయీతఁడె; సర్వ
సౌఖ్యంబులకును నిచ్చకుఁ డితండె;
భావంబులోపలిప్రాణ మీతఁడె, దూఱఁ
దగ దేమివచ్చిన దనుజహరుఁ;
గీ. తలఁపులోపలి కీ దైవతంబె తోడు
ఇలఁ గలిమిలేములకు నెల్ల నితఁడె తోడు
పలుకులోపలనుండెడు భాగ్య మితఁడె
కొలిచి శ్రీవేంకటేశ్వరుఁ గొసరనేల?

శంకరాభరణం

కలడి యీ మూర్తి వల్ల గతి గనవలెను
యిం నిందు నమ్మకుంటే యెందు మరిలేదు ॥పల్లవి॥

కంటిమా బ్రహ్మము వేంకటపతిఁ గనినట్టు
కంటిమా అవతారాలు కతలె కాక
కంటిమా హృదయములోఁ గలిగిన దైవమును
కంటిమా వైకుంఠము కడవారైనాను ॥క౦॥

తెలిసీనా జ్ఞానము యీదేవుని మహిమవలె
తెలిసీనా వేదాలు సందేహమే కాక
తెలిసీనా మాయ యిది యెంత చదివినా
తెలిసీనా ముందరితెరువు వెదకితే ॥క౦॥

చిక్కీనా మనసు యీ శ్రీవేంకటేశ్వరువలె
చిక్కీనా ధ్యానము వట్టిచింతలే కాక
చిక్కీనా అనాదినుండి చిగిరించేకాలము
చిక్కీనా పెద్దలుచెప్పే జీతమైనశాంతి ॥క౦॥

రేకు 146 సంఖ్య 206 సంపు 2 పుట 138

సీ. కలిగిన యీ మూర్తివలన సద్గతి గన
వలె నమ్మకున్న నేవలన లేదు;
కంటిమా? బ్రహ్మమున్ గరుడాచలాధీశుఁ
గనినట్టు లవతారకథలె గాక
కంటిమా? యెదలోనఁ గలిగిన దైవమ్ము
కంటిమా? వైకుంఠుకంటితోడ;
తెలియునా? జ్ఞాన మీ దేవు మహిమవలె
తెలియునా? శ్రుతులు సందియమె గాక;
తెలియునా? యెంత చదివినప్పటికి మాయ
తెలియునా? ముందటితెరువు వెదుక;

గీ. చిక్కునా చిత్త? మీ కృపాశీలుకరణి
చిక్కునా ధ్యాన? మది వట్టిచింతగాక
చిక్కునె? అనాదినుండియు చిగుర్చువేయు
కాలమది? చిక్కునే? సుఖమూలశాంతి.

దేసాళం

వారిదేపో జన్మము వడి నిన్నుఁ దెచ్చిరి
భారతరామాయణాలై పరగె నీకథలు ||పల్లవి||

భువిమీఁద రావణుఁడు పుట్టఁగాఁగా రాముఁడవై
తవిలి యిందరికిఁ బ్రత్యక్షమైతివి
వివరింప నంతవాఁడు వెలసితేఁగా నీవు
అవతార మందితే నిన్నందరునుఁ జూతురు ||వారి||

ఠవణఁ గంసాదియసురలు లాటసేయఁగాఁగా
తమిఁ గృష్ణావతార మిందరికైతివి
గములై యంతటివారు గలిగితేఁగా నీవు నేఁడు
అమర జనించి మాటలాడుదు విందరితో ||వారి||

యెంత వుపకారియో హిరణ్యకశిపుఁడు
చెంత నరసింహుఁడ నీ సేవయిచ్చెను
యింతట శ్రీవేంకటేశ యిన్నిరూపులును నీవే
పంతాన నీ శరణని బ్రదికితి మిదివో ||వారి||

రేకు 138 సంఖ్య 160 సంపు 2 పుట 107

సీ. జనియింప పాపి రావణుఁడు, రాముండవై
యవని నిందఱకుఁ బ్రత్యక్షమైతి
తలఁప నంతటివాఁడు వెలసినఁగాదె ని
న్నందఱుఁ జూతు రీ వవతరింప
ఖలులు కంసాదిదైత్యులు లూటిసేయఁగాఁ
గాదె కృష్ణుండవై కనులఁ బడితి
తెలియ నంతటివారు గలిగినప్పుడె తోఁచి
యందఱితోడ మాటాడె దీవు

గీ. ఎంత యుపకారియో మది నెంచఁ గనక
కశిపుఁడు నృసింహమూర్తి ని న్గాంచు భాగ్య
మిడియె- నిన్నిరూపులు నీవె వృషగిరీంద్ర!
భక్తి మై నీకు శరణని బ్రదికినాము.

ధన్నాసి

సామాన్యమా పూర్వసంగ్రహం బగు ఫలము
నేమమునఁ బెనగొనియె నేఁడు నీ వనక ॥పల్లవి॥

జగతిఁ బ్రాణుల కెల్ల సంసారబంధంబు
తగుల బంధించు దురితంపుఁ గర్మమున
మగుడ మారుకు మారు మగువ నీ వురముపై
తెగికట్టి రెవ్వరో దేవుండ పనక ॥సామా॥

పనిలేక జీవులను భవసాగరంబులో
మునుఁగ లేవఁగఁజేయు మోహదోషమున
పనిపూని జలధిలోఁ బండఁబెట్టిరి నిన్ను
పెన కెవ్వరో మొదలివేలు పనక ॥సామా॥

పుండనియ్యక జీవనోపాయమున మమ్ము
కొండలను గొబల తలిగొని తిప్పు ఫలము
కొండంను నెలకొన్న కోనేటిపతి పనఁగ
నుండవలసెను నీకు నోపలే నవక ॥సామా॥

రేకు 32 సంఖ్య 200 సంపు 1 పుట 133

సీ. సామాన్యమా పూర్వసంగ్రహ ఫలమిది
నేమానఁ బెనఁగొనె నేఁడు నిన్ను
జగతిఁ బ్రాణులకెల్ల సంసారబంధమ్ము
తగులఁజేసిన దురితమ్ము వలన
మగుడ మారుకు మారు మగువ నీయురముపైఁ
దెగికట్టి రెవ్వరో దేవుఁ డనక
పని లేక జీవుల భవసాగరమ్ములో
మునుఁగ లేవఁగఁజేయు మోహవిధిని
పనిపూని జలధిలోఁ బండఁబెట్టిరి నిన్ను
పెను కెవ్వరో తొలివేలు పనక

గీ. జీవనోపాయమున మమ్ముఁ జెలఁగనీక
కొండగొబలందుఁ ద్రిప్పిన కొలఫలముగ
పాటిగా కొండకోనేటిపతి వనంగ
నోపలేనన కిట్లు నీ కుండవలసె.

శంకరాభరణం

అంగనలాల మనచే వాదించుకొనెఁ గాని
సంగతెఱిఁగిన నెరజాణఁ డితఁడే ॥పల్లవి॥

పొడలులేనివాని కొక్కఁడే తండ్రియఁ గాని
తడయక పురుషోత్తముఁ డితఁడే
బడబాగ్ని జలధికిఁ బాయ కల్లుఁడాయఁ గాని
వెడలించె నమృతము విష్ణుఁ డితఁడే ॥అంగ॥

పులిగూడు దిన్నవానిపొం దొక్కఁడే సేసెఁగాని
నలువంక లక్ష్మీనాథుఁ డితఁడే
చలికిఁ గోవరివానిసరుస బావాయఁ గాని
పలుదేవతల కెల్ల ప్రాణబంధుఁ డితఁడే ॥అంగ॥

యెక్కడో గొల్లసతుల కింటిమగఁ డాయఁ గాని
తక్కక వెదకే పరతత్వ మితఁడే
మిక్కిలి శ్రీవేంకటాద్రిమీఁద మమ్ము నేలెఁ గాని
తక్కక వేదముచెప్పే దైవ మీతఁడే. ॥అంగ॥

రేకు 92 సంఖ్య 454 సంపు 1 పుట 304

తగ ననంగునకును తండ్రి యయ్యెనె గాని
మోదింపఁ బురుషోత్తముం డితండె
బడబాగ్ని జలధి కల్లుఁడెగాని యమృతము
వెడలించు శ్రీమహావిష్ణు వితఁడె
పులికూడు తినువాని పొందు సేసెనె గాని
నలువంక నిందిరానాథుఁ డితఁడె
వావి జాబిల్లికి బావయయ్యెనె గాని
పలువేల్పులకుఁ బ్రాణబంధు వితఁడె

గీ. ఏడనో గొల్లెతల కయ్యె నింటిమగఁడు
తాపసులు వెదకెడి పరతత్త్వ మితఁడె
వృషగిరీంద్రముమీఁద మమ్మేలెఁ గాని
శ్రుతులుచెప్పెడి పరమదైవత మితండె.

లలిత

మాకెల్ల 'రాజానుమతో ధర్మ' యిది నీ
యాకడఁ గలుగుట కే మరుదు ॥పల్లవి॥

అలగరుడగమన మహిశయనంబును
కలిసి నీయందె కలిగెనటా
పొలసినపాపముఁ బుణ్యము నరులకు
యెలమిఁ గలుగుటది నే మరుదు ॥మాకె॥

యిదె నీడకన్ను యెండకన్ను మరి
కదిసి నీయందె కలిగె నట
సదరపునరులకు జననమరణములు
యెదురనె కలుగుట కే మరుదు ॥మాకె॥

శ్రీకాంత వొకదెస భూకాంత వొకదెస
కైకొని నీ కిటు గలిగెనట
యీకడ శ్రీవేంకటేశ యిహపరము
యేకమై మా కగు టేమరుదు ॥మాకె॥

రేకు 85 సంఖ్య 415 సంపు 1 పుట 278

సీ. అలగరుడగమన మహిశయనమ్మును
గలసి నీయందునఁ గలిసె నంట
పొరిఁబొరి పాపంబు పుణ్యంబు నరులకు
నేకమ్ముగాఁ గల్గు టేమియరుదు ?
ఒక నీడకన్ను నింకొక యెండకన్నును
గదిసి నీయందునఁ గలిగె నంట
జనులకు భావింప జననమ్ము మరణమ్ము
నెదురనే గలుగుట యేమియరుదు ?
గీ. శ్రీవనిత యొక్కదెసను భూదేవి యొక్క
దెస గలిగిరంట నీకు నో తిరుమలేశ !
ఇహపరమ్ములు మా కగు టేమియరుదు
మహిని రాజానుమతమె ధర్మమనునట్లు.

## రా మ క్రి య

ఏలమమ్ము గాసిసేసే రింకా మీరు
కాలముతో నిలిచెను కైవల్యపదవి ॥పల్లవి॥

పాపములు హరినామపఠనచేఁ బాపుకొంటి
కైపుగఁ జిత్రగుప్తుఁడా కవిలె గట్టు
కోపులఁ బుణ్యము లెల్ల గోవిందుని కిచ్చితిమి
పూఁపలస్వర్గముత్రోవ భుజవేయరో ॥ఏల॥

ఆతుమలో నజ్ఞాన మాచార్యుఁడే పాపె
ఆతల జన్మాలవాకి లటు ముయ్యరో
చేత హరిదాస్యమున జీవన్ముక్తుఁడ నైతి
జాతియధర్మములాల సంబంధము విడరో ॥ఏల॥

పరమాత్మచింతచేత బదుకు నిశ్చయ మాయె
ధరఁ గైవసముగావో తగు చిత్తమా
యిరవైన శ్రీవేంకటేశుఁ డేలుకొనె మమ్ము
పరదేవతలు మాకుఁ బనిలేదు మీరు ॥ఏల॥

రేకు 135 సంఖ్య 145 సంపు 2 పుట 97

సీ. పాపముల్ హరినామపఠన మాయించితి
కలిలెగట్టుము యమగణికవర్య !
నారాయణున కిచ్చినారము పుణ్యముల్
బుజవేయరో స్వర్గపురము త్రోవ
ఆత్మయం దజ్ఞాన మాచార్యుఁడే పాపె
వడిమూయరో పుట్టువాకిళులను
వైకుంఠుసేవ జీవన్ముక్తుఁ డైతి దూ
రముగండు జాతిధర్మమ్ములార !
గీ. నిశ్చయం బాయె బ్రతు కబ్జనేత్రుచింత
చంచలస్వాంతమా ! కైవసమ్ముగావొ
ఏలుకొనెమమ్ము శ్రీవేంకటేశ్వరుండు
వలదు మీరు మా కన్యదైవతములార !

గుండక్రియ

కోటికిఁ బడగయెత్తి కొంకనేల
యీటులేని పదమెక్కి యింకనేల చింత ॥పల్లవి॥

పెట్టినది నొసలను పెద్దపెద్ద తిరుమణి
కట్టినది మొలఁ జిన్నకౌపీనము
పట్టినది శ్రీహరిపాదపద్మమూలము
యెట్టయినా మాకు మేలే యింక నేలచింత ॥కోటి॥

చిక్కి నాలోనైనది శ్రీవైష్ణవధర్మము
తొక్కినది భవముల తుదిపదము
యెక్కినది హరిభక్తి యిది పట్టపేనుఁగ
యెక్కువ కెక్కువే కాక యింకనేల చింత ॥కోటి॥

చిత్తములో నిండినది శ్రీపతిరూపము
హత్తినది వైరాగ్య మాత్మధనము
యెత్తలఁ జూచిన మాకు నిదివో శ్రీవెంకటేశుఁ
డెత్తి మముఁ గావఁగాను యింకనేల చింత ॥కోటి॥

తేకు 307 సంఖ్య 40 సంపు 10 పుట 27

సీ. పెట్టినవి నొసట పెదపెద్ద తిరుమణి
మొలఁగట్టినది చిన్న ముదుకగోచి
పట్టినది మురారి పాదపద్మద్వయి
యెట్టైన మేలు మా కేల చింత?
వడిఁ జిక్కినట్టిది వైష్ణవధర్మంబు
తొక్కినది భవంపుతుదిపదంబు
ఎక్కువ హరిభక్తి యిది పట్టపేనిక
యెక్కువ కెక్కువే యేల చింత?

గీ. చిత్తమున నిండినట్టిది శ్రీశురూపు
హత్తినట్టిది వైరాగ్య మాత్మధనము
ఏడుకొండలవాఁ డేల యేలచింత?
కోటికిం బడగెత్తియుఁ గొంకనేల?

సా రం గ నా ట

వైష్ణవులసొమ్ము నేను వారు నీ సొమ్ము లింతే
విష్ణుఁడ నీ వెరైన వివరించుకో వయ్యా ॥పల్లవి॥

నెఱి నీ బంటనా హరి నీకంటె బలువులైన
తఱి నీ దాసులకే నే దాసుఁడఁగాక
గుఱు తెరుఁగుదునా నేఁ గోరి యింతక తొల్లి
గుఱుతు చూపిన మా గురువునే కాక ॥వైష్ణ॥

ముంచి నీకు మొక్కేఁగాక ముందె నీశరణులు
పెంచి పాదాలు నానెత్తిఁ బెట్టిరయ్యా
పొంచి నీ వేడ నేనేడ భుజముల ముద్రవెట్టి
సంచితమై సేసినట్టి సంబంధమే కాక ॥వైష్ణ॥

శ్రీవెంకటేశ నీ సేవే సేసేఁగాక నేఁడీ
సేవకుఁ దెచ్చెను వారిసేవే కాదా
భావ మొక్కటిగా నాకుఁ బట్టిచ్చిరి నిన్ను వారు
ఆపలివలికిఁ బరమార్థమేకాక ॥వైష్ణ॥

రేకు 332 సంఖ్య 185 సంపు 10 పుట 124

సీ. నీ బంటునా నేను ? నీకంటె బలియురౌ
నీదుదాసులఁగొల్చి నెగడువాఁడ
గుఱు తెఱుంగుదునె నేఁ గోరి యింతకుఁదొల్లి ?
గుఱుతుసూపిన నాదుగురునిఁగాక
నీకు మ్రొక్కెదఁగాక నీ ప్రపన్నులు ముందె
పాదాలు నానెత్తిపయిని బెట్టి;
రిరుభుజమ్ముల ముద్రలిడి చేయు సంబంధ
మింతెకా కే నేడ ? యీ వదేడ ?

గీ. చేసెదనుగాక నీ సేవ శ్రీశ ! యిట్టి
సేవకుం దెచ్చినది వారి సేవగాదె ?
వైష్ణవులసొమ్ము నే నౌదు; వారు నీదు
సొమ్ము; లిచ్చిరి నిను నాకు సొరిది వారు.

బౌళి

కనకము కసకమ్మే కడు నిను మిసుమే
వెనక సరిదూఁగితే వెలుపకు రాదు ॥పల్లవి॥

హరిఁ గొలిచినవారి కమరు నన్ని సుఖాలు
గరిమతో వారలభాగ్యమే భాగ్యము
తెరమరఁగుల కర్మదేహులెల్ల వీరితోడ
పురుఁడు వెట్టుకోఁబోతే పోలికలు రావు ॥కన॥

భాగవతులైనవారు పట్టినదెల్లా నీడేను
చేగదేర వారలు సేసినదే చేఁత
తీగెసంసారమత్తులు తెలియక వీరివలె
వేగినంతా నయ్యేమంటే వెరవులఁ బదవు (?) ॥కన॥

శ్రీవేంకటేశుదాసులు చేసినదెల్లా సృష్టి
యేపంటా ధ్రువపట్టమే ఇటు వారికి
కావరపుమనుజులు గతిగనే మని వారి
తోవల నడవఁబోతేఁ దూఁగదు తమకును ॥కన॥

తేకు 221 సంఖ్య 119 సంపు 3 పుట 80

సీ. హరిగొలిచినవారి కమరు నన్ని సుఖాలు
వారలభాగ్యమే భాగ్యముగద !
తెరమఱుఁగుల కర్మదేహులు వీరితో
పోలికలకురారు పురుడుగారు
భాగవతులు తాముపట్టిన దీడేలు
సిరిమించ వారు చేసినదె చేఁత
సంసారమత్తులు సరిప్రొద్దు పెనఁగిన
నములు వారలకుఁ గాఁజాల రెపుడు

గీ. శ్రీనివాసునిబంట్లు చేసినదె సృష్టి
వారలకు ధ్రువపట్టమే వంకఁ గనిన
కావరపుమానవులు గతిగందు మనుచు
వారితోవఁబడువ నవ్వారు గారు.

## శ్రీ రా గ ం

ఇదియే కావలెనని తాఁ గైకొని యిచ్చగించువాఁడే మనుఁడు
పదలకురో హరిదాసులమత మిది వర్ణించెద నో వివేకులాలా ॥పల్లవి॥

దేవుఁడు గలఁడని మదిలోఁ దెలియుటే జన్మఫలంబు
తావుగ నాతనినెప్పుడుఁ దలఁచుటే తన భాగ్యము
శ్రీవైష్ణవధర్మము దప్పక చెలఁగుటయే వైభవము
దేవతాంతరంబు లన్నియు మానినదియే సుకృతంబు ॥ఇది॥

కామక్రోధము లుజ్జగించుటయే కల్యాణానుభవము
చేముంచి పాపముసేయక మానుటే చెప్పఁగ లాభము
నేమముతోడుత విరక్తుఁ డగుటే నిర్మలానందము
వేమరు నాచార్యసేవసేయుటే విచారింపఁగ దాఁచినధనము ॥ఇది॥

ప్రకృతివికారములకుఁ జొరకుండుటే పరమమైన సాత్వికము
సకలబంధములఁ బెడఁబాసినదే సామ్రాజ్యపదము
ప్రకటింపఁగ నలమేలుమంగకుమ పతియగు శ్రీవేంకటవిభుని
అకలంకుఁడై కొలిచి యుండుటే యనంతమహిమాతిశయంబు ॥ఇది॥

తేకు 146 సంఖ్య 209 సంపు 2 పుట 140

సీ. దేవుండు గలఁడను తెలివి జన్మఫలంబు
తన భాగ్య మాతనిఁ దలఁచుచుంట
వైష్ణవధర్మంబు వదలమి విభవమ్ము
పాపమ్ము సలుపమి పరమలాభ;
మాచార్యుఁ గొలుచుట దాచినధనము; ని
ర్మలహర్ష మనఁగ విరక్తుఁ డగుట;
ప్రకృతివికారాలపాలుగా కుండుట
పరమసాత్త్వికత; మెల్ల బంధములను
బాయుట సామ్రాజ్యపదము; కామక్రోధ
ముల నుజ్జగించుట ముఖ్యశుభము;

గీ. దేవతాంతరములదెసఁ బోవ కుంట
సుకృత; మలమేలుమంగేశు శుద్ధబుద్ధి
ప్రీతి భజియించుటే మహిమాతిశయము
విష్ణుదాసులమత మిది విజ్ఞులార!

శ్రీ రా గం

నిర్మలులు వీరు నిత్యసుఖులు
కర్మదూరులు విష్ణుకైంకర్యపరులు ॥పల్లవి॥

పరమజ్ఞానసంపన్నులగు వారికిని
అరుదుగా దిచటి మహదైశ్వర్యము
హరికృపాధనము చే నబ్బిన మహాత్ములకు
సరకుగాకుండు పంచల నిధానములు ॥నిర్మ॥

బలిమిని వేదాంతపట్టభద్రులకు నిల
బలురాజ్యపదపు లిరుగడ బంట్లు
లలిమీరి హరిచక్రలాంఛనపుశూరులకు
యెలమి విజయము లెల్ల నింటిలో నుంతు ॥నిర్మ॥

యీవలను శ్రీవేంకటేశశరణాగతుల
కావటించిన పుణ్య మరువుగాదు
దైవజ్ఞులయిన యా ధర్మస్వరూపులకు
వేవేలు భోగములు వెనుతగులుచుండు ॥నిర్మ॥

తేకు 119 సంఖ్య 114 సంపు 2 పుట 77

సీ. కర్మదూరులు విష్ణుకైంకర్యపరులన
నిర్మలహృదయులు నిత్యసుఖులు
పరమసుజ్ఞానసంపన్నులౌ వారికి
నిచటి మహైశ్వర్య మేమి యరుదు ?
హరికృపాధనమబ్బి న మ్మహాత్ములకును
సరకుగాకుండు పంచలను నిధులు;
భావింప వేదాంతపట్టభద్రులకు రా
జ్యపదవు లుభయపార్శ్వముల బంట్లు;
లలి మీఱు హరిచక్రలాంఛనశూరుల
కింటిలోపలనుండు నెలమి జయము;

గీ. లహిమహీధరవిభు శరణాగతులకు
నఖిలపుణ్యోత్కరం బది యరువుగాదు
దైవవిదులై యెసంగు నా ధార్మికులకు
నగణితసుభోగములు వెనుదగులుచుండు.

ధ న్నా సి

హరిదాసులతోడ నల్పులు సరెన రాదు
గురుఁడు శిష్యుఁడు ననే గుఱిదప్పుఁగానా ॥పల్లవి॥

కోరి ముత్యపుఁజిప్పలఁ గురిసిన వానయు
సారెఁ బెంకులలోవాన సరియౌనా
శ్రీరమణుఁ డిన్నిటానుఁ జేరియుంటే నుండెఁగాక
సారెకుఁ బాత్రాపాత్రసంగ తిఁకాలేదా ॥హరి॥

మలయాద్రిమాఁకులును మహిమీఁదిమాఁకులును
చలమున నెంచిచూడ సరియౌనా
అలరి దేవుఁడు అంతర్యామియైతే నాయఁగాక
తెలియఁగ క్షేత్రవాసి దిక్కులందు లేదా ॥హరి॥

అమరులజన్మములు నసురలజన్మములు
జమళిఁ బుట్టినంతలో సరియౌనా
అమరి శ్రీవేంకటేశుఁ డాతుమైతే నాయఁగాక
తమితో నధికారిభేదములు లేవా ॥హరి॥

తేకు 108 సంఖ్య 44 సంపు 2 పుట 30

సీ. హరిదాసులకు నెప్పు డల్పులు సరిరారు
గురుఁడు శిష్యుండన్న గుఱియె తప్పు;
సరియౌనె పెంకులోఁ గురిసెడు వానయు
పోరి ముత్తియపుఁజిప్పఁ గురియువాన ?
జగతి పాత్రాపాత్రసంగతిలేదె ? య
చ్యుతుఁ డున్న నంతటు నుఁడుఁగాక
మలయాద్రిమ్రాఁకులు మహిమీఁదిమ్రాఁకు లొ
క్కించుక సరియౌనె యెంచిచూడ
అతఁ డంతర్యామియైన నాయెను గాక
తలపోయ లేదె ? క్షేత్రంపువాసి ?
గీ. జమలిఁ బుట్టినమాత్ర రాక్షసులజన్మ
మమరజన్మంబు సరియౌనె ? అంజనాచ
లాధిపుం డాత్మ తానైన నాయెఁగాక
తత్త్వమున నధికారిభేదములు లేవె !

ఆహి రి

మాకు నేమీఁ బనిగాదు మరి యేమిగలిగినా
శ్రీకాంతు నడుగరో చిత్రగుప్తులాల ॥పల్లవి॥

ధరణీశుపసులకుఁ దగు బందె లేదట
హరిదాసులకుఁ బాప మంటునా మరి
సరిఁ జక్రపుఁదాగు లిచ్చుటఁ జూచుకోరో మీరు
అరసి మీఁదటిమాట లాతని నడుగరో ॥మాకు॥

లావరి మన్ననపాత్రులకు వెట్టి లేదట
కావింప వైష్ణవులకుఁ గర్మ మున్నదా
దేవునిలాంఛన మిదె తిరుమణి చూచుకోరో
ఆవల నేమిగల్లాను అతని నడుగరో ॥మాకు॥

సతి రాణివాసమైతే జాతికుల మెంచరట
హితశరణాగతుల కేది జాతి
తతి శ్రీవెంకటపతిదాస్య మిది చూచుకోరో
యితవై మరేమిగల్లా నీతని నడుగరో ॥మాకు॥

రేకు 342 సంఖ్య 245 సంపు 10 పుట 164

సీ. ధరణీశుపసులకు తగుబందె లేదంట
హరిదాసులకు పాప మంటునేమి ?
చక్రపుడాగు లిచ్చుటఁ జూచికొనుఁడు; మీ
రరసి మీఁదటిమాట హరి నడుగుఁడు;
లావరిమెచ్చువారలకు లేదఁట వెట్టి
సలుపఁగర్మము వైష్ణవులకుఁ గలదె ?
దేవునిచిహ్న మీ తిరుమణిగనుఁ డేమి
కలిగిన నడుగరో యవల నతని;

గీ. తడవ రఁట రాణివాసంపుఁదరుణికులము
హితులు శరణాగతుల కెందు నేదిజాతి ?
వృషగిరీశుదాస్యము గని పిదప ధర్మ
గోప్త నడుగరొ ఓ చిత్రగుప్తులార !

ఆ హి రి

ఇతరధర్మము లందునిందుఁ గలదా
మతిఁ దలఁప పరము నీ మతముననే కలిగె ॥పల్లవి॥

విదురునకుఁ బరలోకవిధి చేసెనట తొల్లి
అదె ధర్మసుతుఁడు వర్ణాశ్రమంబులు విడిచి
కదిసి నీ దాసుఁడైన కతముననే కాదె యీ
యెదురనే తుదిపదం బిహముననే కలిగె ॥ఇత॥

అంటరాని గద్దకులమంటి జటాయువుకు నీ
వంటి పరలోకకృత్యములు సేసితివి మును
వెంట నీ కైంకర్యవిధి కలిమినే కాదె
వొంటి నీ హస్తమున నో (యో)గ్యమై నిలిచె ॥ఇత॥

యిరవైన శబరిరుచు లివియె నైవేద్యమై
పరగెనట శేషమును బహునిషేధము లనక
ధరఁ దదీయప్రసాదపువిశేషమే కాదె
సిరుల శ్రీవేంకటేశ చెల్లుబడు లాయ ॥ఇత॥

రేకు 88 సంఖ్య 399 సంపు 1 పుట 267

సీ. పరలోకవిధులు నిర్వర్తించె విదురున
కల ధర్మసుతుఁడు వర్ణాశ్రమాది
ధర్మముల్ విడిచి; నీ దాసుఁడౌ కతమున
నితనికి తుదిపదం బిందె కలిగె;
నీకు కింకరుఁడైన నియతిచేఁగాదె యం
టంగ రానట్టి జటాయువునకు
నౌర్ధ్వదైహికకృత్య మాచరించితి; భుక్త
శేషంబు తలఁప నిషిద్ధ మనక

గీ. శబరిం విం దారగించితి; చర్చ సేయ
పరము నీ మతమునవె యేర్పడెనుగాక
యితరధర్మమ్ము లన నందునిందుఁ గలవె ?
పాటికెక్కె నీ సేవయే పరమపురుష !

మాళవి

నిత్యులు ముక్తులు నిర్మలచిత్తులు నిగమాంతవిదులు వైష్ణవులు
సత్యము వీరల శరణని బ్రదుకరో సాటికిఁ బెనఁగక జనులాల ॥పల్లవి॥
సకలోపాయశూన్యులు సమ్యగ్ జ్ఞానపూర్ణులు
అకలంకులు శంఖచక్రలాంఛను లన్నిటఁ బూజ్యులు వైష్ణవులు
వొకటిఁ గోరరు వోరులఁ గొలువరు వొల్లరు బ్రహ్మాదిపట్టములు
అకటా వీరల సరియనఁ బాపం బారుమతంబుల పూఁతకోకలన్ ॥నిత్యు॥
మంత్రాంతర సాధనాంతరంబులు మానిన పుణ్యులు విరక్తులు
యంత్రపుమాయలఁ జొరలు పరులకు యెంతైనా మొక్కరు వైష్ణవులు
తంత్రపు కామక్రోధవిదూరులు తమ నిజధర్మము వదలరు
జంత్రపుసంసారులతో వీరల సరియని యెంచఁగఁ బాపమయ్యా ॥నిత్యు॥
తప్పరు తమ పట్టినవ్రత మెప్పుడు దైవ మొక్కఁడే గతి యనుచు
వొప్పుగు తమ పాతివ్రత్యంబున నుందురు సుఖమున వైష్ణవులు
కప్పిన శ్రీవేంకటపతిదాసులు కర్మవిదూరులు సాత్వికులు
చెప్పకుఁ డితరుల సరిగా వీరికి సేవించఁగ నే ధన్యుఁడ నైతి ॥నిత్యు॥
రేకు 85 సంఖ్య 414 సంపు 1 పుట 277

సీ. సకలమంత్రాంతర సాధనాంతరములు
మానిన పుణ్యులు, జ్ఞానపూర్ణు,
లకలంకులు, విరక్తు, లన్యులఁ గొలువరు;
యంత్రపుమాయలయందుఁ జొరలు
పరులకు మ్రొక్కరు; పాయరు నిజధర్మ;
మొకటియు వాంఛింప రుల్లమందు;
నిత్యులు, ముక్తులు, నిగమాంతవేత్తలు,
సాత్త్వికుల్, నిర్మలస్వాంతు లెపుడు
కామాదిదూరు, లీ ఘనవైష్ణవులతోడ
షణ్మతంబులవారు సాటిరారు;
గీ. శంఖచక్రలాంఛనులు శేషగిరిసార్వ
భౌముదాసులు; హరిపాదపద్మయుగము
పరమగతిగా పతివ్రతాశక్తి నొప్పు
పావనులు; వీరి కితరులు సాటిగారు.

రామక్రియ

మహి నింతటివారువో మనవారు
బహుమహిమలవీరు ప్రపన్నులు ॥పల్లవి॥

జయమంది జననపుజరామరణముల
భయములేనివారు ప్రపన్నులు
క్రియలెల్ల నుడిగి మూఁగిన కర్మపుటడవి
బయలుచేసినవారు ప్రపన్నులు ॥మహి॥

ధీరులై మాయాంధకారంబు నెదిరించి
పారఁదోలినవారు ప్రపన్నులు
సారమయ్యీన సంసారసాగరము
పారముగన్నవారు ప్రపన్నులు ॥మహి॥

అంద నిన్నిటాఁ దనిసి యాసలెల్లాఁ దెగఁగోసి
పండినమనసువారు ప్రపన్నులు
దండిగా శ్రీవేంకటేశుదాసులై పరముతోప
బండిబాటచేసినారు ప్రపన్నులు ॥మహి॥

రేకు 98 సంఖ్య 462 సంపు 1 పుట 310

సీ. జన్మజరామృత్యుసాధ్వసం బెఱుఁగని
వార లేనాఁడు ప్రపన్నజనులు
క్రియ లెల్ల నుడిగి మూగిన కర్మవని పగ
దున్నినవారు ప్రపన్నజనులు
ధీరులై మాయాంధకారంబు మాయించి
ప్రబలినవారు ప్రపన్నజనులు
సారమౌ సంసారసాగరపారమ్ము
గన్నట్టివారు ప్రపన్నజనులు
గీ. ఆస లన్నింటి మొదలంటఁ గోసి తనిసి
పండిన మనస్సువారు ప్రపన్నజనులు
బండిబాటచేసినవారు పరముత్రోవ
ఫణిగిరీంద్రుని సేవఁ బ్రపన్నజనులు.

ముఖారి

కంటే సులభ మిది; కానకయుంటే దుర్లభ;
యింటిలోననే వున్న దిహముఁ బరమును ||పల్లవి||

హరిదాసులు మెట్టినక్కడే పరమపద
మరయ నిందుకంటె నవల లేదు
తిరమై వీరిపాదతీర్థమే విరజానది
సొరిది నన్నిచోట్ల జూచినట్టే వున్నది ||కంటే||

మచ్చిక వైష్ణవులమాటలెల్లా వేదములు
యిచ్చ ల నిందుకంటే నింక లేదు
అచ్చట వీరిప్రసాద మమృతపానములు
అచ్చమై తెలిసేవారి కఁచేత నున్నది ||కంటే||

వెలఁగి ప్రపన్నులసేవే విజ్ఞానము
ఫల మిందుకంటె మటి పైపై లేదు
తలఁప శ్రీవేంకటేశుదాసులే యాతనిరూపు
వెలమి నెదుటనున్నా రెఱిఁగినవారికి ||కంటే||

రేకు 96 సంఖ్య 479 సంపు 1 పుట 321

సీ. హరిసేవకులు మెట్టినదియె శ్రీవైకుంఠ
మన్య మింతకు మించి యవల లేదు
తగ వీరి పాదతీర్థమె విరజానది
యెల్లతావులయందు వెల్లివిరియు
వైష్ణవప్రవరులవచనముల్ వేదమ్ము
లింతకుమించిన వింక లేవు
అరయ వీరిప్రసాద మమృత మతకరించు
నడుగువారలకుండు హస్తమందె

గీ. సర్వవిజ్ఞానము ప్రపన్నజనులసేవ
యింతకంటె ఫలమ్ము పై నెందులేదు
అంజనగిరీశ్వరునిదాసు లతనిరూపు
తెలిఁగిన మహాత్ములకుఁ గల రెట్టయెదుట

# శ్రీ ని వా స తే జ ము




## వ రా శి

అదివో నిత్యశూ (సూ)రులు అచ్యుత నీదాసులు
యెదురులేనివారు యేకాంగవీరులు

రచ్చల సంసారమనే రణరంగములోన
తచ్చి కామక్రోధాలతలలు గొట్టి
అచ్చపుతిరుమంత్రపు టారుపు బొబ్బలతోడ
యిచ్చలనే తిరిగేరు యేకాంగవీరులు ॥అది॥

మొరసి పుట్టుగులనే ముచ్చుఁబొఁజుల కురికి
తెరలి నడుములకుఁ దెగవేసి
పొరిఁ గర్మముఁ బొడిచి పోటుగఁటులఁ దూరి
యెరగొని తిరిగేరు యేకాంగవీరులు ॥అది॥

వొడ్డిన దేహములనే వూళ్ళలోపల చొచ్చి
చెడ్డ యహంకార మను చెఱలువట్టి
అడ్డమై శ్రీవేంకటేశునండనుండి లోకులనే
యెడ్డలఁజూచి నవ్వేరు యేకాంగవీరులు ॥అది॥

రేకు 105 సంఖ్య 25 సంపు 2 పుట 17

సీ. సంసార మనియెడి సమరరంగములోనఁ
గామాదిరిపుమస్తకములఁ గొట్టి
అల తిరుమంత్రంపుటార్పు బొబ్బలతోడ
విహరింతురీ నీ దాసవీరవరులు;
భవము లనెడు ముచ్చుపొఁజుల కుఱికి నె
న్నడుములకున్ దెగనఱికి వేసి
పొడిచి కర్మమ్ము నా పోటుగంటుల దూఱి
యెరగొని తిరిగెద రేకవీరు;

గీ. లుదుటునన్ మేను లనియెడు నూళ్ళుసొచ్చి
చెడు నహంకారమును ముట్టి చెఱలువట్టి
ఎడ్డియలఁ జూచి నవ్వెద రీశ! నీదు
దాసు లేకైకవీరులు ధర్మరతులు.

పాడి

అనుచు లోకము లెల్ల నదె జయవెట్టేరు
నినుఁ గొల్చితిఁ గావవే నీరజాక్షుఁడా ॥పల్లవి॥

అదివో కోనేటిలోన నదివో సర్వతీర్థములు
అదివో పైఁడిమేడలహరినగరు
పొదలి పరుష లెల్లా పొదిగి సేవించేరు
యిదివో వరము లిచ్చె నిందిరానాథుఁడు ॥అను॥

అదివో వేదఘోషము అదివో సురలమూఁక
అదివో విశ్వరూపము అద్భుత మందె
గుదిగొనెఁ బుణ్యములు కోట్లసంఖ్యలు చేరె
యిదివో దయదలఁచె నీశ్వరేశ్వరుఁడు ॥అను॥

అదివో శ్రీవేంకటేశుఁ దక్కన నలమేల్ మంగ
అదివో నిత్యసూరులు ఆళువారలు
నిదుల శేషాచలము నిక్కి పైపైఁ బొడచూపె
యిదివో కొలువున్నాఁడు హృదయాంతరాత్ముఁడు ॥అను॥

రేకు 119 సంఖ్య 111 సంపు 2 పుట 75

సీ. అవె పుష్కరిణిలోన నఖిలతీర్థమ్ములు
అదె పైఁడిమేడలహరిపురంబు
పొదలి పరసలెల్ల ముదమున సేవింతు;
రిదె వరమ్ము లొసంగె నిందిరేశుఁ;
డదె వేదఘోష; మల్లదె వేలుపులమూక;
యదె విశ్వరూప మత్యద్భుతంబు;
గుదిగొనె పుణ్యముల్ కోట్లసంఖ్యలుచేరె;
యిదె దయదలఁచె సర్వేశ్వరుండు

గీ. అతఁడె శ్రీవేంకటేశ్వరుం డక్కనందు
మంగ యదె; నిత్యసూరులు మఱియు నాళు
వార లవ్వారె; పొడసూపె పన్నగాద్రి;
కొలు వమరియుండె పరమాత్మ కొదలుడీల.

హిందోళవసంతం

ఎన్ని మహిమలవాఁడె యీ దేవుఁడు
కన్నులపండువులెల్లాఁ గదిసిన ట్టుండెను ॥పల్లవి॥

పోలింప కర్పూరకాపు పురుషోత్తమునికి
యే లీల నుండెనని యెంచి చూచితే
పాలజలనిధిలోనఁ బవళింపఁగా మేన
మేలిమి పీఁగఁదంటిన మెలుపుతో నుండెను ॥ఎన్ని॥

తట్టుపునుఁగుకాపు దైవశిఖామణికి
యెట్టుండె నని పరి చూచితే
చిట్టకానరేపల్లెలో చీఁకటితప్పు సేయఁగా
అట్టిరాత్రిలు మేన నంటిన ట్టుండెను ॥ఎన్ని॥

అలమేలుమంగతోడ నట్టె సొమ్ము ధరించఁగ
యెలమి శ్రీవెంకటేశు నెంచి చూచితే
కలిమిగల యీ కాంత కౌఁగిటఁ బెనఁగఁ గాను
నిలువెల్లా సిరులై నిండిన ట్టుండెను ॥ఎన్ని॥

రేకు 180 సంఖ్య 177 సంపు 10 పుట 118

సీ. కమ్మని కప్రపుకాపు గోవిందున
కెటు లుండెనని మది నెంచిచూడ
పాలకడలిలోనఁ బవళింపఁగా మేన
మీఁగడయంటిన మేల్మి నుండె
తట్టుపునుఁగుకాపు దైవశిఖామణి
కెట్టుండె నని మఱి యెంచినపుడు
చెలఁగి వ్రేపల్లెలోఁ జేయఁ జీఁకటితప్పు
రేలు మైనంటిన లీల నుండె

గీ. మంగతోడుతసొమ్ములు మయి ధరించు
వేంకటేశ్వరురూపు భావించి చూడఁ
గలిమిచెలి కౌఁగిటఁ బెనంగ దళముకొన్న
సిరులు నిల్లువెల్ల నిండిన కరణి నుండె.

ఆ హి రి

ఏమీ నెఱఁగని మమ్ము నెక్కువసేసి
పామరుల దొడ్డఁజేసె భాష్యకారులు ॥పల్లవి॥

గతచన్న వేదాలు కమలజునకు నిచ్చి
ఆతనికరుణచేత నన్నియుఁ గని
గతిలేకపోయిన కలియుగమున వచ్చి
ప్రతిపాలించఁ గలిగె భాష్యకారులు ॥ఏమీ॥

లోకమెల్ల వెల్లిఁబోఁగా లోననే సురలఁగాచి
ఆకుమీఁదఁ దేలినయతనికృప
కాకరిమతముల్లెల్ల గాలిఁబుచ్చి పర మిట్టే
పైకొనఁగఁ గరుణించె భాష్యకారులు ॥ఏమీ॥

పంకజపుఁజేయి చాఁచి పాదపుఁబర మిచ్చిన
వేంకటేశుకృపతోడ వెలయఁ దానే
తెంకనే వొడయవరై తిరుమంత్రద్వయాన
పంకమెల్లఁ బోఁగడిగె భాష్యకారులు ॥ఏమీ॥

రేకు 27 సంఖ్య 162 సంపు 1 పుట 109

సీ. ఏమియు నెఱుఁగని పామరులను మమ్ముఁ
గడుదొడ్డగావించి రుడయవరులు
గతమైన వేదాలు కమలసంభవునకు
నిడినయాతనికృప నిన్నియుఁ గని
గతిలేకపోయిన కలియుగమ్మున వచ్చి
ప్రతిపాలనముచేసె యతివిభుండు
వెల్లిఁబోఁగా లోకమెల్ల, వేల్పులఁ గాచి
యాకుపైఁదేలినయతని కరుణఁ
గాకరిమతముల గాలిఁబుచ్చి పరమ్ము
పైకొనఁ గృపసేసె భాష్యకారు;
గీ. లభయహస్తంబు చాచి నిజాంఘ్రిఁజూపి
పర మొసంగెడి వేంకటపతి భజించి
ద్వయము తిరుమంత్రమున పాపపంకమెల్లఁ
బోఁగడిగె లక్ష్మణాహ్వయ పుణ్యయోగి.

## లలిత

నీవేకా చెప్పఁజూప నీవె నీవెకా
శ్రీవిభుప్రతినిధివి సేన మొదలారి ॥పల్లవి॥

నీవేకా కట్టెదుర నిలుచుండి హరివద్ద
దేవతలఁ గనిపించే దేవుఁడవు
యేవంక విచ్చేసినాను యిందిరాపతికి నిజ
సేవకుఁడవు నీవెకా సేనమొదలారి ॥నీవే॥

పసిఁడిబద్దలవారు పదికోట్లు గొలువ
దెసలఁ బంపులు వంపే ధీరుఁడవు
వసముగా ముజ్జగాలవారి నిందరిని నీ
సిసువులఁగా నేలిన సేన మొదలారి ॥నీవే॥

దొరలైన యసురుల తుత్తుమురుసేసి జగ
మిరవుగా నేలితి వేకరాజ్యమై
పరగుసూత్రవతీపతివై వేంకటవిభు
సిరులపెన్నిధి నీవే సేన మొదలారి ॥నీవే॥

రేకు 42 సంఖ్య 255 సంపు 1 పుట 171

సీ. నీవెకా వైకుంఠనిలయుని ప్రతినిధి
పీవెకా సూత్రవతీవిభుఁడవు
కట్టెదుటను నిల్చి కమలాక్షుదర్శన
మిప్పింతు వమరుల కీవెకావె
పసిఁడిబద్దలవారు పదికోట్లు గొలువంగ
దెసలఁ బంపులుసేయు ధీరుఁ డీవె
ముల్లోకములవారి నెల్ల నీశిశువుల
భంగి నేలెడి సైన్యపతివి నీవె
గీ. దుష్టదానవకోటిఁ దుత్తుమురు సేసి
యేకరాజ్యమ్ముగా జగమేలువాఁడ
వీవెకా యిందిరాధీశు సేవకుఁడవు
నిక్కముగ వేంకటేశు పెన్నిధివి నీవె.

## గుండక్రియ

జగతి వైశాఖశుద్ధచతుర్దశి మందవార
మగణితముగఁ గూడె నది స్వాతియోగము ॥పల్లవి॥

పక్కన నుక్కుఁగంభము పగిలించుక వెడలి
తొక్కి హిరణ్యకసిపుఁ దొడికిపట్టి
చక్కఁగాఁ గడపమీఁద సంధ్యాకాలమున
వక్కలుసేసె నురవడి నరసింహుఁడు ॥జగ॥

పిప్పిగాఁగఁ జప్పరించి పేగులు జందేలు వేసి
తొప్పఁదోఁగుచు నెత్తురు దోసిటఁ జల్లి
రొప్పుచుఁ గోపముతోఁ గేరుచుఁ బకపక నవ్వి
తప్పక చూచె వాని నుదగ్రనరసింహుఁడు ॥జగ॥

యెదుటఁ బ్రహ్లాదుఁజూచి యిందిరఁ దొడపైనుంచె
అదన నందరికి నభయ మిచ్చె
కదసి శ్రీవెంకటాద్రిగద్దెమీఁదఁ గూచుండె
వెదచల్లెఁ గృపయెల్ల వీరనరసింహుఁడు ॥జగ॥

రేకు 849 సంఖ్య 285 సంపు 10 పుట 191

సీ. క్షోణిలో వైశాఖశుద్ధ చతుర్దశీ
శనివాసరమ్మున స్వాతియందు
ఉక్కుకంబమునుండి యుదుటున వెలువడి
త్రొక్కి హేమకశిపుఁ దొడికి పట్టి
చక్కగ గడపపై సంజపొద్దున ముక్క
చెక్కలు చేసె నృసింహమూర్తి;
పిప్పిగా రక్కసుఁ జప్పరింపుచు నెత్రు
నల్లి తాలిచె ప్రేవుజన్నిదముల
తొప్పుచుఁ గినుకఁ గేరుచు నవ్వి పకపక
దనుజారిఁ జూచె నుదగ్రనృహరి
గీ. ఎదుటఁ బ్రహ్లాదుఁ గని, తొడ నిందిర నిడి
యభయ మిచ్చుచు నందఱి, కంజనాద్రి
గద్దెపైఁ గూరుచున్నాఁడు ఘనులువొగడఁ
జెలువ మొప్పార వీరనృసింహమూర్తి.

ఆహిరి

సులభుఁ డీతఁ డిదివో సుగ్రీవనారసింహుఁడు
చెలఁగి మొక్కులు మొక్కి సేవించరో ॥పల్లవి॥
నవ్వులమోమువాఁడు నానామహిమలవాఁడు
దవ్వులుగా దేవతల రక్షించేవాఁడు
పువ్విళ్లూర కంభములో నుదయించినవాఁడు
నివ్వటిల్లు ప్రతాపాన నెగడినవాఁడు ॥సుల॥
హేమపుచాయలవాఁడు యెదుటఁ గొల్వున్నవాఁడు
కోమలిఁ దొడపై నిడుకొన్నవాఁడు
కోమలపుమేనివాఁడు గొప్పకిరీటమువాఁడు
చేముంచి హిరణ్యదైత్యుఁ జించినవాఁడు ॥సుల॥
వాలుకగోళ్లవాఁడు వాఁడికోరలవాఁడు
మేలిమికరుణతోడ మించినవాఁడు
వోలిఁ దుంగభద్రకాడనుండి శ్రీవెంకటాద్రిని
లీలతోఁ బ్రహ్లాదుని కేలిమైనవాఁడు ॥సుల॥

రేకు 347 సంఖ్య 275 సంపు 10 పుట 184

సీ. నగుమోమువాఁడు నానామహిమలవాఁడు
చెలఁగి దేవతల రక్షించువాఁడు
ఉక్కుకంబమునుండి యుదయమందినవాఁడు
జగమగంటిమితోడ నెగడువాఁడు
ఎదుటఁ గొల్వున్న వాఁ డుసిరిచాయలవాఁడు
కోమలిఁ దొడనిడుకొన్న వాఁడు
వాఁడికోఱలవాఁడు వాలికగోళ్ళవాఁ
డతిక్రూపాపరుఁడౌచు నడరువాఁడు

ఆ. కోమలంపుమేను గొప్పకిరీటంబు
గలుగువాఁడు కనకకశిపుఁ జీల్చి
బాలభక్తుఁడైన ప్రహ్లాదుఁ గాచిన
వేంకటాద్రివిభుహరి వేడుకొనరొ!

సామంతం

కొలువై తా నల్లవాఁడె కూచున్నాఁడు గద్దెమీఁద
బలవంతుఁ డితఁడు ప్రహ్లాదవరదుఁడు ॥పల్లవి॥
చిడుముడిగోళ్లతోడ సింహపుమోముతోడ
తొడమీఁదఁ గూచున్న తొయ్యలితోడ
కడలేని నవ్వుతోడ కడురాజసముతోడ
అడరించీఁ బంతము ప్రహ్లాదవరదుఁడు ॥కొలు॥
సంకుఁజక్రములతోడ చాయలమేనితోడ
వంకె దేర్చే యభయహస్తముతోడ
బింకపుమీసాలతోడ పెనువదనముతోడ
అంకె వరము లిచ్చీఁ బ్రహ్లాదవరదుఁడు ॥కొలు॥
వనితకౌఁగిటితోడ వామకరముతోడ
ననుపైన తమలో నానందముతోడ
యెనయుచు శ్రీవెంకటేశుఁడై యీడా నాడా
అనిశము వెలసెఁ బ్రహ్లాదవరదుఁడు ॥కొలు॥

రేకు 328 సంఖ్య 168 సంపు 10 పుట 109

సీ. చిడిముడిగోళ్ళతో సింగపుమోముతో
తొడమీఁదఁ గూర్చున్న పడఁతితోడ
కడలేని నవ్వుతో కడురాజసముతోడ
ప్రహ్లాదవరదుండు ప్రజ్వలించె;
చాయలమేనితో
శంక వాపు నభయశయముతోడ
బింకపుమీసాల పెనువదనమ్ముతో
ప్రహ్లాదవరదుండు బయలుమెఱసె
గీ. గరితఁ గౌఁగిట గదియించు కరముతోడ
స్వాంతమునఁ బొంగు పరమహర్షమ్ముతోడ
ఫణినగమ్మునఁ బ్రహ్లాదవరదుఁ డొప్పె
వరము లొసఁగుచు వేంకటేశ్వరుఁ డనంగ.

పాట

సుగ్రీవనారసింహునిఁ జూడరో వాఁడె
అగ్రపూజ గొన్న వాఁడు ఆదిసింహము ॥పల్లవి॥
దేవతలు జయవెట్టి దివినుండి పొగడఁగ
దేవులతోఁ గూడున్నాఁడు దివ్యసింహము
భావింప నెట్టనెదుట ప్రహ్లాదుఁ డుండఁగాను
వేవేలు నవ్వులు నవ్వీ విజయసింహము ॥సుగ్రీ॥
అసురలను గెలిచి అదె సింహాసనముపై
వెసఁ గొలువున్నాఁడు వీరసింహము
పసిఁడివర్ణముతోడ బహుదివ్యాయుధాలతో
దెసల వెలుఁగొందీని ధీరసింహము ॥సుగ్రీ॥
నానాభరణాలువెట్టి నమ్మిన దాసుల నెల్ల
ఆనుకొని రక్షించీ బ్రత్యక్షసింహము
పూని శ్రీవెంకటాద్రిని బుధు లెల్లాఁ గొలువఁగా
నానావరము లొసఁగీ మానవసింహము ॥సుగ్రీ॥

రేకు 825 సంఖ్య 146 సంపు 10 పుట 98

సీ. దేవతల్ జయపెట్టి దివినుండి పొగడంగ
దేవులతోనుండె దివ్యనృహరి
భావింపఁ దనముందు ప్రహ్లాదుఁ డుండఁగా
వింతనవ్వులు నవ్వు విజయనృహరి
అసురులను జయించి అదె సింహపీఠిపై
వెసఁ గొలువున్నాఁడు వీరనృహరి
పసిఁడివర్ణముతోడ బహుళాయుధాలతో
దెసలను వెలుఁగొందు ధీరనృహరి
గీ. దాల్చి సొమ్ములు, నమ్మినదాసకోటి
నానుకొని రక్షసల్పు ప్రత్యక్షనృహరి
పూని శ్రీవేంకటాద్రిపై బుధులు గొలువ
మంచిమంచివరా లిచ్చు మానవహరి.

# శ్రీ నివాస తేజము

## సామంతనాటి

జయజయ నృసింహ సర్వేశ
భయహర వీర ప్రహ్లాదవరద ॥పల్లవి॥
మిహిరశశినయన మృగనరవేష
బహిరంతస్థ్సలపరిపూర్ణ
అహినాయకసింహాసనరాజిత
బహుళగుణగణ ప్రహ్లాదవరద ॥జయ॥
చటులపరాక్రమ సమఘనవిరహిత
నిటలనేత్ర మౌనిప్రణుత
కుటిలదైత్యతతి కుక్షివిదారణ
పటువజ్రనఖ ప్రహ్లాదవరద ॥జయ॥
శ్రీవనితా సంశ్రిత వామాంక
భావజకోటిప్రతిమాన
శ్రీవేంకటగిరి శిఖర నివాస
పావనచరిత ప్రహ్లాదవరద ! ॥జయ॥

రేకు 160 సంఖ్య 289 సంపు 2 పుట 193

సీ. జయజయ నరసింహ ! సర్వేశ్వరా ! భయ
హరణ ముకుంద ప్రహ్లాదవరద !
మిహిరశశినయన ! మృగనరవిగ్రహ !
అంతర్బహిర్వ్యాప్త ! ఆదిపురుష !
అహికులాధీశసింహాసనరాజిత !
అతులగుణగణ ! ప్రహ్లాదవరద !
చటులపరాక్రమ ! సమఘనవిరహిత :
నిఖిలమౌనివినుత ! నిటలనేత్ర !
కుటిలదైత్యానీక కుక్షివిదారణ !
అతిశితనఖర ! ప్రహ్లాదవరద !
గీ. శ్రీసతీశ్రితవామాంక ! చిత్తజాత
కోటిసంకాశ ! వేంకటకుధరశిఖర
వాస ! పావనచరిత ! దైవాలరాయ !
అఖిలలోకశరణ్య ! ప్రహ్లాదవరద !

గౌళిరామక్రియ

నమో నమో లక్ష్మినరసింహా
నమో నమో సుగ్రీవనరసింహా ॥పల్లవి॥
వరద సులభ భక్తవత్సల నరసింహా
నరమృగవేష శ్రీనరసింహా
పరమపురుష సర్వపరిపూర్ణ నరసింహా
గిరిగుహావాస సుగ్రీవనరసింహా ॥నమో॥
భయహర ప్రహ్లాదపాలన నరసింహా
నయనత్రియారవింద నరసింహా
జయజయ సురమునిసంస్తుత నరసింహా
క్రియాకలాప సుగ్రీవనరసింహా ॥నమో॥
అతికృపానిలయ మోహనరూప నరసింహా
నతపితామహముఖ్య నరసింహా
సతత శ్రీవేంకటేశ్వర దివ్యనరసింహా
కితవారిభంజన సుగ్రీవనరసింహా ॥నమో॥

రేకు 171 సంఖ్య 848 సంపు 2 పుట 284

సీ. వరద సులభ భక్తవత్సల నరసింహ
నరమృగవేష శ్రీనారసింహ
పరమపురుష సర్వపరిపూర్ణ నరసింహ !
గిరిగుహావాస లక్ష్మీనృసింహ
భయహర ప్రహ్లాదపాలన నరసింహ
నతపితామహముఖ్య నారసింహ !
అతికృపానిలయ మోహనరూప నరసింహ
నరసురమునివంద్య నారసింహ !
గీ. మిహిరశశినేత్ర నరసింహ అహిగిరీంద్ర
నారసింహ పరాత్పర నారసింహ !
అరివిభంజవనరసింహ ! దురితహరణ
నారసింహ ! నమో నమో నారసింహ !

సాళంగనాట

నరుఁడా యీతఁడు ఆదినారాయణుఁడు గాక
ధరణిఁ గిరితి కెక్కె దశరథసుతుఁడు ॥పల్లవి॥

యీతఁడా తాటకిఁ జంపె నీ మారీచసుబాహుల
నీతఁడా మదమణఁచె నిందరుఁ జూడ
స్తుతులకు హరువిల్లు యీతఁడా విరిచి యట్టె
సీతఁ బెండ్లియాడెను యీ చిన్నరాముఁడా ॥నరుఁ॥

చుప్పనాతి ముక్కుగోసి సోదించి దైత్యులఁ జంపి
అప్పు డట్టె వాలినేసినాతఁ డీతఁడా
గుప్పించి కోఁతుల నేలి కొండల జలధిగట్టి
రప్పి లంక సాధించె నీ కౌసల్యానందనుఁడా ॥నరుఁ॥

రావణాదులను జంపి రక్షించి విభీషణుని
భావించయోధ్య నీతఁడు పట్ట మేలెను
శ్రీవేంకటేశుఁ డితఁడే సృష్టి రక్షించె నితఁడే
యీవల మాపాలనున్న యీ రామచంద్రుఁడా ॥నరుఁ॥

రేకు 197 సంఖ్య 497 సంపు 2 పుట 336

సీ. నరుఁడా యితం డాదినారాయణుఁడు గాక
ధరణి కీరితి కెక్కె దశరథసుతుఁ
డితఁడు తాటకఁ జంపె; నితఁడు ద్రుంచె సుబాహు;
మారీచదైత్యుని మద మణంచె;
హరువిల్లు ఫెళ్లున విఱిచి వేడుక మీఱ
సీతఁ బెండ్లాడె నీ చిన్నవాఁడె;
సోణ మంటుగఁ గోసె శూర్పణఖానాస;
వాలి నొక్కమ్మునఁ గూలనేసె;
కోఁతుల నేలి పెన్గొండలతో వార్ధి
గట్టి సాధించె లంకను నితండె;
గీ. రావణాదులఁ గెడపి లంకావిభుత్వ
మొసఁగెను విభీషణునకు; నయోధ్య నేలెఁ;
రామచంద్రుండు వేంకటరమణమూర్తి
సృష్టి రక్షించు కారుణ్యచిత్తుఁ డితఁడె.

బౌళి

ఇతఁడు తారకబ్రహ్మ మీతఁడు సర్వేశ్వరుఁడు
రతి కెక్కఁ గొలిచిన రక్షించు నితఁడు
తరణివంశజుఁడై తాటకను హరియించి
అరుదుగ విశ్వామిత్రియాగము గాచి
హరునివిల్లు విరిచి యట్టె సీతఁ బెండ్లియాడి
పరశురాముని నిజబలిమి చేకొనెను ॥ఇత॥

మునుల కభయ మిచ్చి మొగి నసురులఁ ద్రుంచి
ఘనమైన మాయామృగముఁ జంపి
కినిసి వాలిఁగొట్టి సుగ్రీవునిఁ బట్టముగట్టి
వనధి బంధించి లంక వడిఁ జుట్టుముట్టెను ॥ఇత॥

బలురావణునిఁ జంపి పుష్పకముపైఁ దాఁ జేకొని
లలి విభీషణునకు లంక యిచ్చి
చెలఁగి యయోధ్య యేలి శ్రీవెంకటాద్రిమీఁద
వెలయ రాముఁడు దానై విశ్వమెల్లా నేలెను ॥ఇత॥

రేకు 327 సంఖ్య 159 సంపు 10 పుట 106

సీ. తరణివంశజుఁడయి తాటక హరియించి
కౌశికమౌని యాగమ్ము గాచి
హరునివిల్లు విఱిచి యవనిజఁ బెండ్లాడి
పరశురాముని నిజబలము గొనియె;
మునుల కభయ మిచ్చి మొగి నసురులఁ ద్రుంచి
ఘనమైన మాయామృగమ్ముఁ జంపి
ఆ వాలిఁ గొట్టి సుగ్రీవుపట్టముగట్టి
కంధి బంధించి లంక వడిముట్టె;
గీ. విమతు రావణుఁ గూల్చి విభీషణునకు
లంక నిచ్చి యయోధ్య నిశ్శంక నేలె
తారకబ్రహ్మ మీ శేషధరణిధరము
రాముఁ గొల్చిన నతఁడె శ్రీరాముఁ డోము.

సాళంగనాట

హరికి లంకిణీహంత కంతర మిట్టున్నది
కరుణ నింత మన్నించె కమలావిభుఁడు ॥పల్లవి॥

విశ్వరూపు చూపినాఁడు విష్ణుఁడు దొల్లి యట్టె
విశ్వరూపాంజనేయుఁడు వీఁడె చూపెను
శాశ్వతుఁడై యున్నవాఁడు సర్వేశ్వరుఁడు వీఁడె
శాశ్వతుఁడై యున్నాఁడు జగములో నితఁడు ॥హరి॥

ప్రాణవాయుసంబంధి పరమాత్ముఁడు అట్టె
ప్రాణవాయుసుతుఁడు పవనజుఁడు
రాణింప రవివంశుఁడు రామచంద్రుఁడు తాను
నాణెపురవిసుతుని సమ్మిన ప్రధాని ॥హరి॥

దేవహితార్థము సేసెఁ ద్రివిక్రముఁడు అట్టె
దేవహితార్థమే జలధిలంఘనుఁడు
శ్రీవెంకటేశుఁడు చిన్మయమూర్తి తాను
కోవిదుఁడు జ్ఞానమూర్తి గొప్పహనుమంతుఁడు ॥హరి॥

తేకు 825 సంఖ్య 145 సంపు 10 పుట 97

సీ. విశ్వరూపము చూపె విష్ణుండు తొలి, నట్టె
విశ్వరూపముఁ జూపె వీఁడు హనుమ
శాశ్వతుండై యుండు సర్వేశ్వరుఁడు తాను
శాశ్వతుండై యుండు జగతి నితఁడు
పరమాత్ముఁ డతు ప్రాణవాయుసంబంధి యా
ప్రాణవాయుసుతుండు పరఁగ నితఁడు
రవివంశజాతుండు రామచంద్రుండు తా
నినజున కితఁడు నమ్మినప్రధాని

గీ. అమరహితమునకై త్రిలోకాక్రమణము
నబ్ధిలంఘన మొనరించి రతఁడు నితఁడుఁ;
చిన్మయజ్ఞానమూర్తు లీ శ్రీశ వాన
రేశుఁ లిరువురున్న దంతర మిద్వరకును.

సాశంగనాట

శరణు శరణు వేదశాస్త్రనిపుణ నీకు
అరుదైన రామకార్యధురంధరా ॥పల్లవి॥

హనుమంతరాయ అంజనాతనయా
ఘనవాయుసుత దివ్యకామరూప
అనుపమలంకాదహన వార్ధిలంఘన
జనసురనుత కలశాపురనివాస ॥శర॥

రవితనయసచివ రావణవనాపహార
పవనవేగబలాఢ్య భక్తసులభ
భువనపూర్ణదేహా బుద్ధివిశారద
జవసత్వవేగ కలశాపురనివాస ॥శర॥

సీతాశోకనాశన సంజీవశైలాకర్షణ
అతతప్రతాపశౌర్య అసురాంతక
కౌతుక శ్రీవేంకటేశకరుణాసమేత
శాతకుంభవర్ణ కలశాపురనివాస ॥శర॥

రేకు 171 సంఖ్య 847 సంపు 2 పుట 233

సీ. శరణు శరణు వేదశాస్త్రనిపుణ ! నీకు
రామకార్యధురంధరా ! నమస్సు
అంజనానందనా ! హనుమంత ! కపినాథ !
ఘనవాయుసుత ! దివ్యకామరూప !
అనుపమలంకాదహన ! వార్ధిలంఘన !
జనసురనుత ! కలశాపురీశ !
రవితనయసచివ ! రావణవననాశ !
పవనవేగబలాఢ్య ! భక్తసులభ !
భువనపూర్ణశరీర ! బుద్ధివిశారద !
జవసత్త్వయుత ! కలశాపురీశ !

గీ. జానకీశోకనాశన ! శాతకుంభ
వర్ణ ! దనుజారి ! లక్ష్మణప్రాణదాత !
పన్నగగిరీశ పరమకృపాసమేత !
హనుమ ! సంజీవనాచలాహర ! శరణు.

## మాళవశ్రీ

శ్రావణ బహుళాష్టమి నవరేత్రికాదను
శ్రీవిభుఁ డుదయించెఁ జెలులాల వినరె ॥పల్లవి॥

అసురుల శిక్షించ నమరుల రక్షించ
వసుధభార మెల్లా నివారింపను
వసుదేవునికిని దేవకిదేవికిని
అసదృశమగు కృష్ణుఁ డవతార మందెను ॥శ్రావ॥

గోపికల మన్నించ గొల్లలనెల్లాఁ గావఁగ
దాపై మునులనెల్లా దయసేయను
దీపించ నందునికి దేవియైన యశోదకు
యేపున సుతుఁడై కృష్ణుఁ డిన్నిటాఁ బెరిఁగెను ॥శ్రావ॥

పాండవుల మనుపఁగ పదారువేలఁ బెండ్లాడఁగ
నిండి శ్రీవెంకటాద్రిపై నిలుచుండఁగా
అండ నలమేల్మంగ నక్కునఁ గౌఁగలించఁగ
దండియై యుండఁ గృష్ణుఁడు తగ నుతి కెక్కెను ॥శ్రావ॥

రేకు 349 సంఖ్య 287 సంపు 10 పుట 192

సీ. అసురుల శిక్షించ నమరుల రక్షించ
బహుదుస్సహమ్ము భూభార మణఁచ
వసుదేవునకును దేవకికి శ్రావణబహు
ళాష్టమీతిథిఁ గృష్ణుఁ డవతరించె;
వ్రేతల మనుప గోపికల మన్నించంగ
దాపయి మునులను దయ గనంగ
నందునకు యశోద కందాల కొమరుఁడై
పెరిఁగె శ్రీకృష్ణుండు పేర్మితోడ

గీ. పడఁతులఁ బదారువేలచేపట్టి, గొంతి
కొడుకులం బ్రోవ, మంగ నక్కున గదింప
నెమ్మి శ్రీవేంకటాద్రిపై నిలచియుండఁ
గృష్ణుఁ డుదయించె రోహిణీఋక్షమందు.

## సాళంగనాట

శ్రావణబహుళాష్టమి జయంతి నేఁడు
సేవించరో నరులాల శ్రీకృష్ణుఁ డితఁడు ॥పల్లవి॥

భావింప వసుదేవునిపాలిటి భాగ్యదేవత
దేవకి గనినయట్టి దివ్యరత్నము
చేవమీర సురల రక్షించే కల్పతరువు
యీ వేళ జన్మించినాఁడు యిదె కృష్ణుఁడు ॥శ్రావ॥

హరవిరించాదులకు నాదిమూలకారణము
పరమమునుల తపఃఫలసారము
గరుడోరగేంద్రులకుఁ గలిగిన నిధానము
యిరవుగా నుదయించె నిదె కృష్ణుఁడు ॥శ్రావ॥

బలుయోగీశ్వరుల బ్రహ్మానందము
చెలఁగు భాగవతుల చింతామణి
అలమేల్మంగకుఁ బతి యట్టె శ్రీవెంకటాద్రి
నిలపై జన్మించినాఁడు యిదె కృష్ణుఁడు ॥శ్రావ॥

తేకు 8.24 సంఖ్య 189 సంపు 10 పుట 93

సీ. భావింప వసుదేవుపాలిటి భాగ్యమ్ము
దేవకిగన్నట్టి దివ్యరత్న
మమరుల రక్షించు నల కల్పతరువు శ్రా
వణబహుళాష్టమి జనన మందె;
పరమమౌనుల తవఃఫలసార మీశ్వర
కమలభవుల కాదికారణమ్ము
ఉరగేంద్రగరుడుల కొదవిన నిధి నేఁటి
యర్ధమరాతిరి నవతరించె;
గీ. యోగులకును బ్రహ్మనంద; మొగి సురమణి
భాగవతులకు; మంగకు ప్రాణవిభుఁడు
వేంకటాద్రికృష్ణుఁడు ప్రభవించినట్టి
శ్రీజయంతి సేవించి తరింప రయ్య!

ధన్నాసి

అంతవాని కింతసేయ నమరునటే
వింతలు యీ సుద్దులకే వెరగయ్యా మాకు ॥పల్లవి॥
కదిసి బ్రహ్మాండములు గర్భములో నున్న దేవుఁ
డిదె దేవకిగర్భాన నెట్టుపుట్టెనే
అదె మఱ్ఱాకుమీఁదట నటు పవ్వళించువాఁడు
యెదుట యశోదచేత నెట్టు వినోదించీనే ॥అంత॥
అడుగులుమూఁట లోకా లటుగొలచినవాఁడు
బడిబడి రేపల్లెఁ బారాడీని
అడరి యజ్ఞభాగము లారగించే దేవుఁడు
సడితో వెన్న ముచ్చిలి చవిగొనీ నిదివో ॥అంత॥
వేదపల్లవములందు విహరించే దేవుఁడు
సాదుగొల్లెతల రతిసంగతిఁ జిక్కె
మోదపువైకుంఠాన ముదమందే కృష్ణుఁడు
యీ దెస శ్రీవేంకటాద్రి నిరవాయ నిదివో ॥అంత॥

రేకు 220 సంఖ్య 118 సంపు 8 పుట 76

సీ. బ్రహ్మాండపటలి గర్భమునందుఁ గలదేవుఁ
డింత దేవకిపొట్ట నెట్లు పుట్టె ?
వటపత్రపుటమునఁ బవళించువాఁ డెట్టు
లల యశోదయెదుట నాటలాడె ?
భువనమ్ము లడుగులుమూటఁ గొల్చినవాఁడు
పాఱాడె నెట్లు వ్రేపల్లెలోన ?
యజ్ఞభాగమ్ముల నారగించెడిఁ దేవుఁ
డెటు వెన్నముచ్చిలి యెలమి మెసవె ?
ఆ. వేదపల్లవముల విహరించుదేవుండు
గొల్లసకులతోడఁ గూడిమాడె
శ్రీవికుంఠనగరిఁ జెలఁగెడు కృష్ణుండు
శేషశిఖరియందుఁ జెలువుమీఱె.

ముఖారి

ఆడరమ్మ పాడరమ్మ అందరు మీరు
వేడుక సంతసములు వెల్లివిరియాయను ॥పల్లవి॥
కమలనాభుఁడు పుట్టె గంసుని మద మణఁచ
తిమిరి దేవకిదేవి దేహమందును
అమరులకు మునుల కభయమిచ్చె నితఁడు
కొమరె గొల్లెతలపైఁ గోరికలు నిలిపె ॥ఆడ॥
రేయిఁబగలుగాఁ జేసి రేపల్లెఁ జెపగఁ జొచ్చె
ఆ యెడ నావులఁ గాచె నాదిమూలము
యీ యెడ లోకాలుచూపె నిట్టే తన కడుపులో
మాయసేసి యిందరిలో మనుజుఁడై నిలిచె ॥ఆడ॥
బాలలీలలు నటించి బహుదైవికము మించె
పాలువెన్నలు దొంగిలెఁ బరమమూర్తి
తాళి భూభార మణఁచె ధర్మము పరిపాలించె
మేలిమి శ్రీవేంకటాద్రిమీఁద నిట్టె నిలిచె ॥ఆడ॥

రేకు 220 సంఖ్య 112 సంపు 3 పుట 75

సీ. కమలనాభుఁడుపుట్టె కంసుగర్వ మణఁచ
తిమిరి దేవకిదేవి దేహమందు
అమరులకు మునుల కభయ మిచ్చె నితండు
గొల్లచేడియలపై కోర్కె నిలిపె
రేయి పవలుగాఁగ వ్రేపల్లియఁ బెరింగె
నాదిమూలము గాచె నాలమంద
లోకాలు గర్భమ్ములోఁ జూపె మాయతో
మసలె నందఱిలోన మనుజుఁ డగుచు

గీ. బాలలీలల్ నటించి దివ్యతను జూపె
పాలు వెన్నలు దొంగిలెఁ బరమమూర్తి
పాదుకొల్పె ధర్మంబుఁ, భూభార ముడిపె
నెలమి శ్రీవేంకటాద్రిపై నిట్టె నిలిచె.

శుద్ధవసంతం

ఈడ నిందరికి నేలికై వున్నాఁడు
వాడల రేపల్లె వాఁడా వీఁడు ॥పల్లవి॥
భారపుపుట్లపాలుఁ బెరుగులు
వారలు వట్టినవాఁడా వీఁడు
కోరి గొల్లెతల కొలనిలోపల
చీరలు దీసిన శిశువా వీఁడు ॥ఈడ॥
ఆవులఁ బేయల నందరియిండ్ల
వావిరిఁ గాచిన వాఁడా వీఁడు
వావు లొక్కటిగా వనితలఁ గూడి
వేవేలు నేర్చిన విటుఁడా వీఁడు ॥ఈడ॥
అడుదై శ్రీవెంకటాద్రిమీఁద నుండి
వరము లిచ్చేటి వాఁడా వీఁడు
మరిగలమేల్మంగతో మమ్మేలె
సరసుఁడై వుండే జాణా వీఁడు ॥ఈడ॥

రేకు 349 సంఖ్య 289 సంపు 10 పుట 194

సీ. భారంపుటుట్లలో పాలును బెరుఁగులు
వారలు వట్టిన వాఁ డితండ ?
కొలనిలోపలి గొల్లెతల కోకలను దీసి
చెట్టుపైఁ జేరిన శిశు వితండ ?
అందఱిగృహముల యావులఁ బేయల
వావిరిగాచినవాఁ డితండ ?
వావు లొక్కటిగాఁగ వనితలఁ గూడుచు
వేవేలు నేర్చిన విటుఁ డితండ ?

గీ. అదరమ్మైన శేషాద్రిమీఁదనుండి
వరము లాశ్రితులకు నిచ్చు వాఁ డితండ ?
యింతి యలమేలుమంగతో నెల్లవేళ
సరసుఁడై మమ్ముఁ బాలించు జాణ యితఁడ ?

పా డి

అసుచు( బొగడ( జొచ్చేరదె బ్రహ్మాదులు మింట
మొనసి యీ బాలునికే మొక్కేము నేము ॥పల్లవి॥
వున్న తపు లోకములు వుదరాన నున్నవాఁడు
అన్నువ నీదేవకి గర్భమందు వుట్టెను
మన్నించి యోగీంద్రుల మదిలో నుండెదువాఁడు
పన్నినపొత్తులలోన బాలుఁడై వున్నాఁడు
పాలజలధిలోన పాయని గోవిందుఁడు
పాలు వెన్న లారగించె పైఁడి కోరను
వోలిఁ దనవిష్ణుమాయ నోలలాడినట్టివాఁడు
చాలి మంత్రసానులచే జలకమాడీని ॥అసు॥
ముగురువేల్పులకు మూలమైన యిట్టివాఁడు
తగు బలభద్రునికి తమ్ముఁ డాయను
నిగిడి వైకుంఠమున నిలిచి రేపల్లెనుండి
యెగువ శ్రీవెంకటాద్రి నిరవాయ వీఁడె ॥అసు॥

రేకు 340 ససంఖ్య 284 సంపు 10 పుట 157

సీ. ఉన్నతలోకమ్ము లుదరమం దున్నవాఁ
డన్ను దేవకిగర్భమందుఁ బుట్టె;
మన్ననయోగీంద్రమతుల నుండెడువాఁడు
పన్నిక( బొత్తుల బాలుఁడాయె;
పాలసముద్రంబు వాయని శ్రీపతి
పాలువెన్నలు జుట్టె పైఁడికోర
తనమాయ నోలలాడినవాఁడు గైకొనె
మంత్రసానులచేత మజ్జనంబు
ఆ. ముగురు వేల్పులకును మూలమైనట్టివాఁ
డనుఁగుఁ దమ్ముఁ డాయె హలధరునకు
శ్రీవికుంఠపురము వ్రేపల్లె తిరుమల
వరుస నిరవుగాఁగ వఱలె వీఁడు.

ఆ హి రి

కొలిచితే రక్షించే గోవిందుఁ డితఁడు
యింత లక్ష్మికి మగఁడీ గోవిందుఁ డితఁడు ॥పలవి॥

గోవర్ధన మెత్తినట్టి గోవిందుఁ డితఁడు
వేవేలు గొల్లెతల గోవిందుఁ డితఁడు
కోవిదుఁడై ఆలఁగాచే గోవిందుఁ డితఁడు
ఆవలఁ గంసుఁ జంపిన ఆ గోవిందుఁ డితఁడు ॥కొలి॥

ఘోరకాళింగమర్దన గోవిందుఁ డితఁడు
వీరవకాగ్రియుధపు గోవిందుఁ డితఁడు
కోరి సముద్రాలుదాఁటే గోవిందుఁ డితఁడు
ఆ రీతి బాలురఁ దెచ్చే యా గోవిందుఁ డితఁడు ॥కొలి॥

కుందనపుకాశతోడి గోవిందుఁ డితఁడు
విందుల రేపల్లె గోవిందుఁ డితఁడు
పొంది శ్రీవెంకటాద్రిపై పొసఁగఁ దిరుపతిలో
అందమై పవ్వళించిన ఆ గోవిందుఁ డితఁడు ॥కొలి॥

రేకు 331 సంఖ్య 180 సంపు 10 పుట 120

సీ. గోవర్ధన మ్మెత్తె గోవిందుఁ డీతండు
వేగ్రితలనేలె గోవిందుఁ డితఁడు
కుమతి కంసునిఁజంపె గోవిందుఁ డితఁ డాల
మందలఁగాచె గోవిందుఁ డితఁడు
ఘోరుకాళియుఁదొగ్రిక్కె గోవిందుఁ డీతండు
వీరచక్రింపుగోవిందుఁ డితఁడు
కోరి వార్ధులుదాఁటె గోవిందుఁ డితఁ డొజ్జ
పిల్లలఁదెచ్చె గోవిందుఁ డితఁడు

గీ. కుందనపుకాసెతోడి గోవిందుఁ డితఁడు
వినుతభూరమావిభుఁడు గోవిందుఁ డితఁడు
భక్తులకు తిరుమలతిరుపతులయందు
వేడ్క వరములనిచ్చు గోవిందుఁ డితఁడు.

దే శా క్షి

కన్నవిన్నవారెల్లా కాకుసేయరా
వున్నతుఁడవైన నీ కీవొచ్చెము లేలయ్యా ॥పల్లవి॥
దేవతలఁగాచినట్టి దేవుఁడ నీకుఁ బసుల
నీవలఁ గాచితివనే హీనమేలా
కావించి పాలజలధిఁ గాఁపురముండినయట్టి
నీవు పాలదొంగవనే నింద నీ కేలయ్యా ॥కన్న॥
కాలమందు బలిదైత్యుఁ గట్టివేసినట్టి నీకు
రోలఁ గట్టువడినట్టి రోఁత నీ కేల
పోలించి లోకాలకెల్ల పొడవైన దేవుఁడవు
బాలుఁడవై రేపల్లెలోఁ బారాడనేలయ్యా ॥కన్న॥
పాముమీఁదఁ బవ్వళించి పాయకుండినట్టి నీకు
పాముతల దొక్కినట్టి పగరేలా
కామించి శ్రీవేంకటాద్రికడపరాయఁడ నీవు
భూమి మాయ లణఁచి నేర్పులమాయ లేలయ్యా ॥కన్న॥

రేకు 217 సంఖ్య 90 సంపు 3 పుట 61

కాకుసేయరె విన్న కన్నవారెల్ల రీ
యొచ్చెమ్ము నీ కేల యున్నతునకు ?
దేవతలం గాచు దేవుండ వగు నీకు
నాలఁగాచితి వన్న హైన్యమేల ?
కలశవారాశిలోఁ గాపురించెడి నీకు
క్షీరచోరుఁ డటన్న దూఱదేల ?
క్రచ్చఱ బలిదైత్యుఁ గట్టివేసిన నీకు
రోలఁ గట్టువడెడు రోఁతయేల ?
భువనంబులకు నెల్ల పొడవైన వేల్పవు
పాఱాడనేల రేపల్లెవాడ ?
గీ. పాముపైఁ బండుకొను నీకు పాముతలను
త్రొక్కు పగయేల ? వేంకటోత్తుంగశైల
వాసుఁడవు మంగపతి వీవు వసుధలోని
మాయ లడఁచుచు నేర్పుల మాయలేల ?

శంకరాభరణం

ఎవ్వరుఁ గాననివాఁడు యశోద గనె నట్టె
పవ్వళించే బ్రహ్మతండ్రి బాలుఁడయ్యె నట్టె ॥పల్లవి॥
ఘనయోగీంద్రులమతిఁ గట్టువడనట్టివాఁడు
పనిలేక రోలఁ గట్టుపడినాఁ డట్టె
తనియ సురలకు పాదము చూపనట్టివాఁడు
మొనసి బండిమీఁద మోపినాఁ డట్టె ॥ఎవ్వ॥
అమృతము చేతఁదచ్చి అందరి కిచ్చినవాఁడు
తమితో వెన్న దొంగిలెఁ దానె యట్టె
గుములై దేవదానవకోటికిఁ జిక్కనివాఁడు
భ్రమసి గోపికలపాలఁ జిక్కినాఁ డట్టె ॥ఎవ్వ॥
యిందుఁగలఁ డిందులేఁ డనెంచి చూపరానివాఁడు
అందమై రేపల్లెవాడ నాడీనట్టె
అంది కృష్ణావతార మయినట్టి దేవుఁడే
యిఁదున శ్రీవేంకటాద్రి యెక్కి నిలిచె నట్టె ॥ఎవ్వ॥
రేకు 255 సంఖ్య 316 సంపు 3 పుట 213

సీ. ఎవరుఁ గాననివాని నెలమి గాంచె యశోద
బ్రహ్మదేవునితండ్రి బాలుఁ డాయె
ఘనయోగిహృదయాలఁ గట్టువడనివాఁడు
కడఁగి తా నొకరోలఁ గట్టువడియె
తనియ వేల్పులకు పాదమ్ము జూపనివాఁడు
పనిగొని మోపెను బండిమీఁద
అందఱికిని దెచ్చి యమృత మిచ్చినవాఁడు
తమితోడ వెన్నలు తస్కరించె
దానవామరకోటికేని చిక్కనివాఁడు
చిక్కినాఁడట గొల్లచేడియలకు
గీ. ఇందుఁగల డందులేఁడని యెంచిచూడ
రానివాఁ డాడె వ్రేపల్లె రక్తితోడ
అపుడు కృష్ణావతారమైనట్టి దేవుఁ
డిపుడు వేంకటశైలమ్ము నెక్కి నిలిచె.

బౌళి

పరమపురుషుఁ డీ బాలుఁ డఁట
హరివిరించులు మొక్కే రదివో వాకిటను ॥పల్లవి॥

దేవుఁ డితఁడు సర్వదేవతల కొరయఁడు
వేవేలు వేదములచే వేద్యుఁ డితఁడు
దేవకీదేవికి వసుదేవునికిఁ గొడుకాయ
యీ విధము నోఁచిరి వీ రెంత భాగ్యవంతులో ॥పర॥

అంతటాఁ దా నున్న వాఁడు అరయ స్వతంత్రుఁడు
అంతము నాదియు లేని ఆదిమూరితి
పంతుకు యశోదకు నవ్వల నందగోపునికి
దొంతరకొడుకైనాఁడు తొల్లి వీరే పుణ్యులో ॥పర॥

ఇందిరావల్లభుఁడు ఇహపరనాయకుఁడు
కందువ శ్రీవేంకటాద్రిఁ గాపున్నవాఁడు
మందగొల్లెతల కెల్ల మరఁది దా నైనాఁడు
ఇందరు నిందరే వీరి కెన్నటి సంబంధమో ॥పర॥

తేకు 199 సంఖ్య 509 సంపు 2 పుట 844

౧. దేవుఁ డీతఁడు సర్వదేవతలకు భర్త
వేదశాస్త్రపురాణవేద్యుఁ డీతఁడు
దేవకికిన్ వసుదేవునకున్ పుత్త్రుఁ
డెంతపుణ్యులొ వార లెంచిచూడ
అంతటనున్న వాఁ డంత మాదియు లేని
యాదిమూర్తి స్వతంత్రుఁ డంబుజాక్షుఁ
డల నందగోపున కా యశోదకు పట్టి
తలపోయ వా రెంత ధన్యతములొ

గీ. ఇందిరాప్రాణవల్లభుం డిహపరేశుఁ
డురగగిరిరాజమందుఁ గాఁపున్న వాఁడు
మందగొల్లెతలకు నెల్ల మఱఁది, పరమ
పురుషుఁ డీతఁడు శ్రితసులభుం డితండు.

లలిత

ఎన్నఁడు గలుగు మరి యీ భాగ్యము
సన్నిధాయె నితనికి శరణనరే ॥పల్లవి॥

అదె చంద్రుఁ డుదయించె నచ్యుతుఁడు జనియించె
అదనఁ గంసునిజన్మ మస్తమించెను
పొదలిరి దివిజులు పొలిసిరి రాక్షసులు
సదర మీ శిశువుకు శరణనరే ॥ఎన్న॥

పాండవకులము హెచ్చె బాలకృష్ణుఁ డిదె వచ్చె
చండి దుర్యోధనుమూఁక జల్లన విచ్చె
గండిగోకులము నిండె ద్రౌపదితపము పండె
చండప్రతాపున కిట్టె శరణనరే ॥ఎన్న॥

రేపల్లె పుణ్యముసేసె శ్రీవేంకటేశుఁడు డాసె
గోపికలమనసుల కోరిక వాసె
కోపుల ధర్మముదక్కె గోవర్ధనగిరి నిక్కె
చాపల మేఁటి కితని శరణనరే ॥ఎన్న॥

రేకు 199 సంఖ్య 510 సంపు 2 పుట 345

సీ. అదె చంద్రుఁ డుదయించె నచ్యుతుండు జనించె
నంత కంసునిజన్మ మస్తమించె
పొదలిరి దివిజులు పొసిలిరి రాక్షసుల్
సరి నీ శిశువునకు శరణ మనరొ
పాండుకులము హెచ్చె బాలకృష్ణుఁడు వచ్చె
మొండి సుయోధను మూఁక విచ్చె
నిండె గోకులమెల్ల పండె ద్రౌపదినోము
చండవిక్రమునకు శరణ మనరొ

గీ. చేసె పుణ్యము వ్రేపల్లె; డాసె శౌరి;
గోపికలమానసమ్ముల కోరిక వాసె;
నిక్కె గోవర్ధనాద్రియు; దక్కె ధర్మ;
మరసి తిరుమలవిభునకు శరణ మనరొ!

నా ట

వొద్దు నీవు నా కెదురా వోరి కంసుఁడా
కొద్దిగాదు పెనఁగఁగ గోవిందుతోఁ గంసుఁడా ॥పల్లవి॥
పెరిఁగీ రేపల్లె నదె బిరుదు నీ వైరివాఁడే
వొరసి నన్నేల పట్టేవోరి కంసుఁడా
విరసాన వెరపను విష్ణునిమాయను నీ
గొరబైన వెడబుద్ధి గొలుపదు వోరా ॥వొద్దు॥
వెదకీ నీ వైరివాఁడె వీరదానవుల నదె
వుదుటు నాతోనేల వోరి కంసుఁడా
చిదుమనా నిన్నిపుడే సెలవీఁడుగా కతఁడు
పెదవులచేటింతే పేదవానికోపము
వెన్నలుఁ బాలారగించి పెస వాఁడె సత్వగూర
నున్నవాఁడు నిన్ను గెల్వ నోరి కంసుఁడా
వెన్నుఁడు శ్రీవెంకటాద్రివిభుఁడు లోకలఁ గాచె
నన్నిటాఁ గృష్ణావతార మందఁబట్టి నేఁడు ॥వొద్దు॥

తేకు 319 సంఖ్య 110 సంపు 10 పుట 74

సీ. పెరిఁగెడి వ్రేపల్లె బిరుదైన నీ వైరి
నన్నేలపట్టెదో నాలి కంస !
వెఱవనురా నేను విష్ణుమాయను; నీదు
వెడబుద్ధి గొలుపదు వెఱ్ఱికంస !
వీరదానవకోటి వెదకెడి నీ వైరి
ఉదుటు నాతోఁజెల్ల దోరి కంస !
చిదుమనే నిన్నిప్డు సెల వొసంగఁడుగాక
పేదహాని కినుక పెదవిచేటు
గీ. పాలు వెన్నారగించి నత్త్వరబు గూడ
నిన్నుఁ బోరిగొన సిద్ధమైయున్నవాఁడు
వేంకటాద్రివిభుండగు వెన్నుఁ డేతె
నవనిఁ గృష్ణావతారంబు నందఁబట్టి.

నాట

దానవారితోడి పగ ధరించరాదు మీకు
కాపు కిచ్చి శరణని కప్పము లియ్యరో ॥పల్లవి॥
భ్రమసి వార్ధిఁబడ్డాను పాతాళము దూరినాను
సమయింపక మానఁడు శత్రులార
రమణ భూమిఁ జొచ్చిన బ్రహ్మచే వరముగొన్న
తమిఁ జంపకమానఁడు దైతేయులాల ॥దాన॥
రాసి మిన్నులో దాఁగిన రాచమూకలలో నున్న
కోసివేసీఁ దల లరికుమతులాల
ఆసఁ ద్రికూట మెక్కినా ఆ చక్రవాళ మందినా
తోసి సాధించకపోఁడు దుర్మతులాల ॥దాన॥
సతులమాఁటున నున్నా సరి నెందెందు వోయినా
రతి మెట్టకమానఁడు రాకాసులాల
యితఁడు శ్రీవేంకటేశుఁ డెదురులే దితనికి
గతియని మొక్కరో వో కపటులాల ॥దాన॥

తేకు 150 సంఖ్య 229 సంపు 2 పుట 153

సీ. తగ వార్ధిఁబడినఁ బాతాళమ్ము దూఱిన
నంహరింపకపోఁడు శత్రులార !
క్షితిఁ జొచ్చినను బ్రహ్మచే వరమ్ములుగొన్న
నుసురులతో వీఁడ దసురులార !
మింట డాఁగిన రాచమేటులలో నున్నఁ
గోసివేయును తలల్ కుమతులార !
అటు త్రికూటాచలం బిటు చక్రవాళమ్ముఁ
జేరిన వదలఁడు చెనఁటులార !
గీ. సతులమాటున నుండిన సారె కెందుఁ
జనిన మెట్టకమానఁడు దనుజులార !
ఇతఁడు వేంకటపతి వీని కెదురులేదు
కప్పము లొసంగి మ్రొక్కరో కపటులార !

ల లి త

పట్టిన దెల్లా బ్రహ్మము
దట్టపుజడునికి దైవం బేలా ॥పల్లవి॥

ఘనయాచకునకు కనకమే బ్రహ్మము
తనువే బ్రహ్మము తరువలికి
యెనయఁ గాముకున కింతులే బ్రహ్మము
తనలో వెలిఁగేటి తత్వం బేలా ॥పట్టి॥

ఆఁకటివానికి నన్నమే బ్రహ్మము
లోకమే బ్రహ్మము లోలునికి
కైకొని కర్మికి కాలమే బ్రహ్మము
శ్రీకాంతునిపైఁ జింతది యేలా ॥పట్టి॥

భువి సంసారికి పుత్రులె బ్రహ్మము
నవ మిందరి కిది నడచేది
యివలను శ్రీవేంకటేశుదాసులకు
శివ మతనికృపే బ్రహ్మము ॥పట్టి॥

తేకు 92 సంఖ్య 457 సంపు 1 పుట 806

సీ. ఘనయాచకునకును కనకమే బ్రహ్మము
తనువగు బ్రహ్మమ్ము తఱుసలికిని
ఎంచఁ గాముకునకు నింతులే బ్రహ్మము
తనలోన వెలిఁగెడి తత్త్వమేల ?
ఆఁకటివానికి నన్నమే బ్రహ్మము
లోకమే బ్రహ్మము లోలుపునికి
కర్మికిఁ దలపోయఁ గాలమే బ్రహ్మము
శ్రీకాంతుపై మఱి చింతయేల ?

గీ. అవని సంసారులకు బ్రహ్మ మాత్మసుతులె
పామరుల కెల్ల బ్రహ్మ మీ పగిదినుండుఁ
దలఁప శ్రీవేంకటేశ్వరదాసులకును
బ్రహ్మ మా దేవదేవునిపరమకృపయె.

ము ఖా రి

అసమానపు|బదు కది రోఁతా తన
మన సెనయని కూటమి మరి రోఁతా ॥పల్లవి॥

అపకీర్తులఁబడి అకికె లోనై
అపవాదిఁబూట అది రోఁత
వుపమ గెలిచేనని వొరుఁ జెరుచుటలు
విపరీతపుగుణవిధ మొకరోఁతా ॥అను॥

తనుగుట్టిలా నెరిఁగినవారల ముందట
తన యెమ్మెలు చెప్పుకొనుట రోఁత
వనితలముందట వదరుచు వదరుచు
కనుఁగవఁగానని గర్వము రోఁత ॥అను॥

భువి హరి గతియని బుద్ధిఁ దలంచని
యవమానపుమన సది రోఁత
భవసంహరుఁడై పరగు వేంకటపతి
నవిరళముగఁ గొలువని దది రోఁత ॥అను॥

రేకు 4 సంఖ్య 26 సంపు 1 పుట 17

సీ. అదిక కగ్గమై యపకీర్తులంబడి
యపవాది తానౌట యదియ రోఁత
ఉపమ గెల్చెద నంచు నొరులను జెఱచెడి
విపరీతగుణముల విధము రోఁత
తన గుట్టెఱింగిన జనులముందటఁ దన
యెమ్మెలు చెప్పుట యెంతొ రోఁత
కనులుగానని గర్వమున స్త్రీల ముందట
వదరుట పదరుట యదియు రోఁత

గీ. తనకు విష్ణుండె గతియని తలఁపనట్టి
కట్టడిమనస్సు కడురోఁత కమలమగఁడు
భవహరుఁడైన వేంకటపర్వతేంద్రుని
నవిరళమ్ముగఁ గొలువని దదియు రోఁత.

## శ్రీ ని వా స తే జ ము

### శం క రా భ ర ణం

పట్టిలంపటాలఁబడి పడఁ బొరలుటకంటే
వొట్టిన విరతి నూరకుండుటే సుఖము
　పాపము మానినయట్టి బదు కొక్కటె సుఖము
　కోపము విడిచినట్టి గుణ మొక్కటి సుఖము
　చేపట్టి గురుబుద్ధి సేసేటిదే సుఖము శ్రీ
　దీపులఁ బడనియట్టి దినమే సుఖము ॥పట్టి॥

మహిఁ జంచలములేని మనసొక్కటి సుఖము
సహజాచారముతోడి జన్మ మొక్కటి సుఖము
యిహపరసాధనపు యెన్ని కొక్కటి సుఖము
బహుళపుటాసకంటె పరిపాటి సుఖము ॥పట్టి॥

　పరులఁ బీకించితేని పసిఁ డొక్కటి సుఖము
　గరిమ నిజముతోడఁగలమాటలే సుఖము
　ధరలో శ్రీవేంకటేశు దాసానుదాసుఁ డయి
　సరవితో నడచేటి శాంతమే సుఖము ॥పట్టి॥

రేకు 137　　సంఖ్య 159　　సంపు 2　　పుట 107

. పాపంబుమానిన బ్రదు కొక్కటె సుఖంబు
　　కోపంబు విడిచిన గుణమె సుఖము
చేపట్టి గురుబుద్ధి చేయుటె సుఖము శ్రీ
　　దీపులఁ బడనట్టి దినమె సుఖము
పరమాశకంటెను పరిపాటియె సుఖమ్ము
　　మహిఁ జంచలతలేని మనసె సుఖము
సహజంపుటాచారజన్మమె సుఖ మిహ
　　పరసాధనం బెంచు టరిదిసుఖము
గీ. పరులఁ బీడించి తేనట్టి పసిఁడి సుఖము
　నిజము మాటాడుచుంటయే నిండుసుఖము
　తామరసనేత్రుదాసానుదాసుఁ డగుచు
　సరవి నడచెడి శాంతమే సర్వసుఖము.

లలిత

నిత్యసుఖానంద మిదె నీదాస్యము
సత్యములేని సుఖాలు చాలుఁజాలు నయ్యా ॥పల్లవి॥
కన్నుచూపులసుఖము కడు నీ చక్రనిరూపె
యెన్నఁగ వీనులసుఖ మిదె నీ పేరు
పన్ని నాలుకసుఖము పాదపునీతులసి
వున్న సుఖములతెరు వొదఁబడ మయ్యా ॥నిత్య॥
తనువుతోడిసుఖము తగు నీ కైంకర్యము
మనసులో సుఖము నీ మంచిధ్యానము
పనివి యూర్పుసుఖము పాదపద్మమువాసన
యెనయని పెరసుఖ మేమిసేసే మయ్యా ॥నిత్య॥
పుట్టుగుకెల్లసుఖము పొల్లులేని నీ భక్తి
తొట్టి కాళ్లసుఖము పాతురలాడుట
జట్టి శ్రీవెంకటేశ మాచనవోలిచెన్నుఁడవై
వొట్టుకొని మమ్మేలితి వోహో మేలయ్యా ॥నిత్య॥
రేకు 214 సంఖ్య 78 సంపు 10 పుట 52

సీ. నీదుచక్రనిరూపె నేత్రాలకు సుఖమ్ము
లలి నీదుపేరు వీనులకు సుఖము
జిహ్వకు సుఖము నీ శ్రీపాదతులసియే
సుఖములతెరువులఁ జొరముగాని
నీ మంచిధ్యానమ్ము నెమ్మదికి సుఖంబు
తనువుకు సుఖము నీ దాస్యవృత్తి
మఱి నాసకు సుఖంబు చరణాబ్జవాసన
యెనయని పెరసుఖ మేమిసేయ ?
గీ. పొల్లులేనిభక్తి సుఖంబు పుట్టువునకు;
కనఁగఁ బాతరలాడుట కాళ్లసుఖము;
నీదుకైంకర్య మొక్కండె నిత్యసత్య
సుఖము సకలేంద్రియములకు శ్రీనివాస !

## దేవగాంధారి

తలఁచిన విన్నియుఁ దనకొరకే వెలిఁ
దెలియుట దనలోఁ దెలియుటకొరకే ॥పల్లవి॥

ఉదయ మందుట భవ ముడుగుటకొరకే
చదువుట మేలు విచారించుకొరకే
బ్రిదుకుట పురుషార్థపరుఁడౌట కొరకే
యెదిరిఁ గనుట త న్నెఱుఁగుట కొరకే ॥తల॥

తగుఌట విడివడఁ దలఁచుటకొరకే
నొగులుట కర్మ మనుభవించుకొరకే
చిగురౌట కొమ్మయి చెలఁగుటకొరకే
బెగడుట దురితము పెడఁబాయుకొరకే ॥తల॥

యీవలఁజేయుట ఆవలికొరకే
ఆవలనుండుట యీవలికొరకే
యీవల నావల నెనయఁ దిరుగువెల్ల
శ్రీవేంకటేశ్వరుఁ జేరుట కొరకే ॥తల॥

రేకు 11 సంఖ్య 70 సంపు 1 పుట 48

సీ. తలఁచిన వన్నియుఁ దనకొఱకే వెలిఁ
దెలియుట తనలోనఁ దెలియుకొఱకె
చదువుట మేలు విచారించుట కొఱకె
ఉదయ మందుట భవ ముడుగుకొఱకె
బ్రదుకుట పురుషార్థపరుఁ డగుట కొఱకె
యెదిరిని గనుట త న్నెఱుఁగు కొఱకె
నొగులుట కర్మ మనుభవించుట కొఱకె
తగులుట విడివడఁ దలఁచుకొఱకె
బెగడుట దురితముఁ బెడఁబాయుట కొఱకె
చిగురౌట కొమ్మయి చెలఁగుకొఱకె

గీ. ఇవలఁ గావించుటెల్లను నవలికొఱకె
యవల నుండుట యెల్లను నివలికొఱకె
ఇవల నావలఁ దిరుగుటయెల్లఁ దలఁప
శ్రీనివాసమహాప్రభుఁ జేరుకొఱకె.

గు జ్జ రి

త్రికరణశుద్ధిగఁ జేసిన పనులకు దేవుఁడు మెచ్చును లోకము మెచ్చును
వొకటి కోటిగుణితంబగు మార్గము లుండఁగఁ బ్రయాసపడనేలా ॥పల్లవి॥
తనమనసే పరిపూర్ణమైన గోదావరి గంగా కావేరి
కనకబిందు యమునాగయాది ముఖ్యక్షేత్రంబుల సంతతమున్
దినకర సోమగ్రహణకాలముల తీర్థాచరణలు సేసిన ఫలములు
తనుఁదానే సిద్ధించును పూరకే దవ్వులు దిరుగఁగ మఱియేలా ॥త్రిక॥
హరి యను రెండక్షరములు నుడివిన సకిలవేదములు మంత్రములు
గరిమ ధర్మశాస్త్రపురాణాదులు క్రమమునఁ జదివిన పుణ్యములు
పరమతపోయోగంబులు మొదలగు బహుసాధనముల సారంబు
పరిపక్వంబై ఫలియించఁగా బట్టబయలు వెదకఁగ నేలా ॥త్రిక॥
మొదల శ్రీవేంకటపతికినిఁ జేయెత్తి మొక్కిన మాత్రము లోపలనే
పదిలపుషోడశదానయాగములు పంచమహాయజ్ఞంబులును
వదలక సాంగంబులుఁగాఁ జేసినవాఁడే కాఁడా పలుమారు
మదిమదినుండే కాయక్లేశము మాఁటికి మాఁటికిఁ దనకేలా ॥త్రిక॥

రేకు 151 సంఖ్య 236 సంపు 2 పుట 158

సీ. దినకర సోమగ్రహణకాలముల సింధు
గోదావరీయమునాదితీర్థ
ములయందు స్నానమ్ము సలిపిన పుణ్యమ్ము
తనుదాన సిద్ధించుఁ దనమనస్సు
పరిపూర్ణ మైనచోఁ; బరమతపోయోగ
సాధనాదికములసార, మఖిల
వేదపురాణశాస్త్రాదులు సదివిన
ఫలము చేకూరు సద్భక్తితోడ
హరినామవర్ణద్వయం బుచ్చరించిన;
షోడశదానముల్ సొరిది పంచ
యజ్ఞముల్ గావింప నగు మేలు వృషగిరీ
శునకుఁ జేయెత్తి మ్రొక్కిన లభించు;
గీ. ఒకటికిన్ కోటిగుణితమై యొప్పు తెరువు
లుండ మదిమది నుండక యురక దవ్వు
దవ్వులకుఁ బాఱనేల ? వ్యర్థముం బట్ట
బయలు వెదకనేల ? ప్రయాసపడఁగ నేల ?

లలిత

ఎన్నటికి జీవుఁ డింక నీడేరేది
పన్నుకొనేటి చింతలే బలిసీఁగాని ॥పల్లవి॥

కలరు వివేకులు కలదిటు ధర్మము
కలఁడు దైవము నేఁడు గావలెనంటే
వలవని సందేహాన వట్టిజాలిఁ బొరలేది
తలపోఁత లేమిటికో తడఁబడీఁగాని ॥ఎన్న॥

వున్నవి వేదశాస్త్రాలు వున్నది విశ్వాసము
వున్నవా డాచార్యుఁడు వుపదేశించ
తన్నుఁ దానే మోసపోయి తత్త్వము నిశ్చయించక
మిన్నక చంచలమే లో మెరసీఁగాని ॥ఎన్న॥

యివిగో పుణ్యనిధులు యిదిగో సంకీర్తన
వివరించ వీఁడిగో శ్రీవేంకటేశుఁడు
భవములచే భ్రమసి బహుసంగతులచేత
యివల నా మనసిప్పు డెలిఁగీఁగాని ॥ఎన్న॥

రేకు 142 సంఖ్య 188 సంపు 2 పుట 126

సీ. కలరు వివేకులు కలదిటు ధర్మంబు
కావలెనన నేఁడు కలఁడు స్వామి
వలవని సంశయమ్ముల జాలిఁ బొరలెదు
తలఁపోఁత లేటికో తడఁబడునివి;
వేదశాస్త్రము లుండె విశ్వాస మున్నది
యున్నవాఁ డాచార్యుఁ డుగ్గడింప
తా మోసపోయి తత్త్వము నిశ్చయింపక
యురక చంచలబుద్ధి నుండుఁగాని
గీ. ఇదియె సంకీర్తనము పుణ్యనిధులు నివియె
వీఁడుగో వివరింప శ్రీవేంకటపతి
యెన్నటికి జీవుఁ డీడేఱు; నెల్లవేళ
పన్నుకొనియెడి చింతలే బలిసెఁగాని.

ము ఖా రి

ఎవ్వరికి యెవ్వ రయ్యేరు యిందరికి నీవే దిక్కు
అవ్వల నివ్వల నీ వనాథనాథుఁడవు ॥పల్లవి॥

కాయకము అందరునుఁ గార్యవశపరులే
పాయని నీ వకారణబంధుఁడవు
దాయగాండ్లెవ్వరినైనాఁ దప్పించుకొనేవారే
బాయటనున్నా నీ వాపన్నశరణ్యుఁడవు ॥ఎవ్వ॥

అట్టె లోకమువారు అర్థకామపరులే
జట్టిగాని నీవైతే సర్వదాతవు
పొట్టఁ బొరుగుచుట్టాలు భోజనసహాయులే
వెట్టన నీ వైతే మాకు నిర్వాహకుఁడవు ॥ఎవ్వ॥

అంతటా వారికి వారు ఆత్మపోషకులే
రంతుల నీ వైతే నానారక్షకుఁడవు
సంతతము శ్రీవేంకటేశా మమ్ము నేలితివి
పంతమున నీవు భక్తపరిపాలకుఁడవు ॥ఎవ్వ॥

రేకు 164 సంఖ్య 306 సంపు 2 పుట 205

సీ. గణుతింప నందఱుఁ గార్యార్థులే తలం
పఁగ నీ వకారణబాంధవుఁడవు;
తప్పించుకొనువారె దాయగాండ్రెల్ల నా
పన్నశరణ్యుండ వన్న నీవె;
అట్టె లోకమువార లర్థకామపరులె
త్రైలోక్యమున సర్వదాత నీవె;
కనఁగఁ జుట్టములు భోజనసహాయులె మఱి
నిర్వాహకుండవు నీవె మాకు

గీ. ఆత్మపోషకులే భువి నఖిలజనులు
సకలసముఁడైన భూతరక్షకుఁడ వీవె;
నతము మమ్మేలు వేంకటశైలనాథ!
భక్తపరిపాలనముసేయు ప్రభుఁడ వీవె.

గుండక్రియ

ధరలో "నెద్భావం తద్భవ" తనెఁ గాన
హరిమయమే జగమంతాను ॥పల్లవి॥

మహి నెదిటివారందు మలినము దలఁచిన
తహతహ మనసే తా మలినము
వహి నెదిటందు భావనము భావించిన
బహువిధములఁ దానూ భావనమే ॥ధర॥

యెక్కువ నెదిటిపాపా లెంచి నిందించేటి
నిక్కపునాలుక తానే నిందితము
వొక్కటై యెదిటిపుణ్యా లుగ్గడించి ఘన మంటే
దక్కిన పుణ్యపుజిహ్వ తానూ ఘనమే ॥ధర॥

సారె శ్రీవేంకటపతి సుగుణము దలఁచిన
సారపుజీవుఁడు దాను సగుణమే
నేరుపుల నాతని నిర్గుణము దలఁచిన
తారతమ్యములు లేని తానూ నిర్గుణమే ॥ధర॥

రేకు 186 సంఖ్య 485 సంపు 2 పు 298

సీ. ఎదుటివారలయందు నెంచఁగ మలినమ్ము
నెంచెడి నిజమతియే మలినము
ఎదిరి మంచితనంబు నెల్లప్పు డెంచిన
నెంచెడి నిజమతి మంచి దగును;
ఎదిరిపాపంబుల నెంచి నిందించెడి
నిజజిహ్వయే కడు నిందితమ్ము
ఎదిరిపుణ్యంబుల నెంచి ఘన మటన్న
... పుణ్యజిహ్వయుఁ దానె ఘనము

గీ. సగుణుగఁ దలంప వేంకటశైలనాథు
తాను సగుణుండె జీవుఁ; డాతనిఁ దలంప
నిర్గుణుగ జీవుఁడుం గూడ నిర్గుణుండె;
యెట్టిదో భావము ఫలంబు నట్టి దగును.

## మ ల హ రి

కంచూఁగాదు పెంచూఁగాదు కడుఁబెలుచు మనసు
యెంచరాదు పంచరాదు యెట్టిదో యీ మనసు ॥పల్లవి॥

పట్టఁబసలేదు చూడ బయలుగా దీ మనసు
నెట్టనఁ బారుచునుండు నీరూఁగా దీ మనసు
చుట్టిచుట్టి పాయకుండుఁ జుట్టమూఁగా దీ మనసు
యెట్టనెదుటనే వుండు నేఁటిదో యీ మనసు ॥కంచూఁ॥

రుచులెల్లాఁ గానుపించు రూపులేదు మనసు
పచరించు నాసలెల్లాఁ బసిఁడిగా దీ మనసు
యెచటాఁ గరఁగదు రాయీఁగాదు మనసు
యిచటా నచటాఁ దానే యేఁటిదో యీ మనసు ॥కంచూఁ॥

తప్పక నాలోనుండు దైవముఁగాదు మనసు
కప్పి మూఁటగట్టరాదు గాలీఁగాదు మనసు
చెప్పరాని మహిమల శ్రీవేంకటేశుఁ దలఁచి
యిప్పు డిన్నిటా గెలిచె నేఁటిదో యీ మనసు ॥కంచూఁ॥

రేకు 104 సంఖ్య 21 సంపు 2 పుట 15

సీ. పట్టఁగ పసలేదు బయలును గాదు; తా
నెట్టనఁ బ్రవహించు నీరుగాదు;
చుట్టిపాయకయుండు చుట్టముగాఁ దెట్టు
యెదుటనేయుండు నేటిదో మనస్సు ?
రుచులఁదోఁపఁగఁజేయు; రూపించుకయు లేదు;
పచరించునానలఁ బసిఁడి కాదు;
ఎచటఁ గరఁగదు; రాయియు నప్పయుం గాదు;
ఇటునటుఁ దానె యేమిటిదొ మనసు ?

గీ. తమ్మి లోపలనుండు, దైవమ్ముగాదు;
కట్టరాదు మూటగఁగాని గాలిగాదు;
వింతమహిమల వేంకటవిభుఁ దలంచి
యన్నిటను గెల్చె నేటిదో యీ మనస్సు ?

## మ ల హ రి

అతిసులభం బిది యందరిపాలికి
గతియిది శ్రీపతికైంకర్యంబు ॥పల్లవి॥

పాలసముద్రము బలిమిఁ ద్రచ్చికొని
రాలరిదేవత లమృతమును
నాలుక నిదె హరినామపుటమృతము
యేల కానరో యిహపరసుఖము ॥అతి॥

అదరి బాఁతిపడి యపనిదేవతలు
బడివాయరు యజ్ఞభాగాలకు
విడువక చేతిలో విష్ణుప్రసాదము
కడిగఁడి యైనది కానరుగాని ॥అతి॥

యెక్కుదురు దిగుదు రేడులోకములు
పక్కనఁ దపముల బడలుచును
చిక్కినాఁడు మతి శ్రీవేంకటేశ్వరుఁ
డిక్కడి తుదిపద వెఱఁగరుగాని ॥అతి॥

రేకు 102 సంఖ్య 10 సంపు 2 పుట 7

. అతిసులభం బిది యందఱి పాలికి
గతియిది శౌరికైంకర్యలక్ష్మి
పాలసముద్రంబు బలిమిని మథియించి
యమరులు గైకొని రమృతరసము
నాలుక నిదె హరి నామామృతము గల
దిహపరసౌఖ్యద మేల కనరొ ॥
పుడమివేల్పులు బ్రాంతిపడి బడివాయరు
యజ్ఞభాగములకు నహరహమ్ము
విడువక చేతిలో విష్ణుప్రసాదము
కడిగడియైనది కనరు గాని

గీ. ఎక్కుచుందురు దిగుచుందు రేడుజగము
లుగ్రతపముల బడలుచు నున్న రనుచు
చిక్కినాఁడుగద్దా మతి శ్రీనివాసుఁ
డిక్కడి తుదిపదమ్ము దా నెఱుఁగ రకటు ॥

ధా యా నా ట

తలఁప వెనక నుయ్యి తగరు ముందట (?) దీనఁ
దొలఁగ నాకుఁ దెరువుదోప దేమిసేతు ॥పల్లవి॥

మమకార(ము) విముక్తిమార్గదూరము నీపై
మమతసేయక నాకు పనరాదు
మమత మేలో నిర్మమత మేలో దీని
క్రియము నక్రియము నేఁ గాన నేమిసేతుఁ ॥తల॥

కర్మమార్గము జన్మగతికిఁ జేరువ ని
ష్కర్మము పాతకమునకుఁ దొడవు
కర్మి గావలెనో నిష్కర్మి గావలెనో యీ
మర్మంపుమదము మాన దేమిసేతు ॥తల॥

శరణాగతరక్షకుఁడ వైనయట్టి
తిరువేంకటగిరిదేవుఁడా
పరిపూర్ణుఁడవో నీవు పరిచ్ఛిన్నుఁడవో ని
న్నరసి భజింప లేనైతి నేమిసేతు ॥తల॥

రేకు 61 సంఖ్య 310 సంపు 1 పుట 207

సీ. మమకారము విముక్తిమార్గదూరము నాకు
మమత నీపై వీడి మనఁగ రాదు
మమతయే మేలో నిర్మమత మేలో దీని
క్రియము నక్రియము నేఁ గానఁజాల;
కర్మమార్గము జన్మగతికిఁ జేరు వఁట ని
ష్కర్మము దొడవు దుష్కలుషమునకు
కర్మిగావలెనొ నిష్కర్మిగావలెనొ యీ
మర్మంపుటజ్ఞత మానేఁ బోదు

గీ. వెనుక నుయ్యి తగరు ముందు వేంకటేశ!
తొలఁగ తెరువుదోఁపదు నాకుఁ దెలియఁజాల
పూర్ణుఁడవొ పరిచ్ఛిన్నుఁడవో యొకింత
యేమిసేయుదు నిను భజియింప నయితి.

ము ఖా రి

సదు లొల్లవు నాస్నానము కడు
సదరము నా కీస్నానము ॥పల్లవి॥

ఇరువంకల నీ యేచినముద్రిలు
ధరియించుటె నా స్నానము
ధరపై నీ నిజదాసులదాసుల
చరణధూళి నా స్నానము ॥సదు॥

తలఁపులోన నిన్నుఁ దలఁచిన వారలఁ
దలఁచుటే నా స్నానము
వలనుగ నిన్నుఁ గనువారల శ్రీపాద
జలములే నా స్నానము ॥సదు॥

పరమభాగవతపాదాంబుజముల
దరుశనమే నా స్నానము
తిరువేంకటగిరిదేవ నీ కథా
స్మరణమే నా స్నానము ॥సదు॥

రేకు 8 సంఖ్య 61 సంపు 1 పుట 34

సీ. నా స్నాన మెట్టిదనంగ శ్రీహరిదాస
చరణాబ్జధూళిలోఁ బొరలుచుంట
నా స్నాన మెట్టిదనంగ గోవిందునిఁ
దలఁచినవారలఁ దలఁచు చుంట
నా స్నాన మెట్టిదనంగ నిర్వంకల
దైత్యారిముద్రిలు దాల్చియుంట
నా స్నాన మెట్టిదనంగ భాగవతుల
శ్రీపాదయుగళి దర్శించుచుంట

గీ. నాదుస్నానమ్ము శౌరిఁ గన్గంటఁ గాంచు
సాధుపదతీర్థమును దలఁజల్లుకొనుట
నద్ధులలోఁ గాదు నాదుస్నానమ్ము శేష
శైలవల్లభు సత్కథాసంస్మరణమె.

దేసాళి

ఎంతైన దొలఁగవై తేదైన నా మతికి
వింతచవి సేతుగా విషయబుద్ధి ॥పల్లవి॥

ఎనసి జన్మముల నే నెట్లనుండినఁ దోక
వెనకఁ దిరుగుదువుగా విషయబుద్ధి
అనువైన యనుభవన లనుభవించఁగఁ జేసి
వెనక మఱపింతుగా విషయబుద్ధి ॥ఎంతై॥

కెలిఁ కాంతలు నేనుఁ గిసిసిననుఁ బొలయలుక
విఱిచి కలపుదువుగా విషయబుద్ధి
తఱితోడ వావి వర్తన దలంచిన నన్ను
వెఱపు దెలుపుదువుగా విషయబుద్ధి ॥ఎంతై॥

యెడలేని యాపదల నెట్లు వొరలిన నన్ను
విడిచిపో వైరిగా విషయబుద్ధి
నడిఁబెట్టి వేంకటస్వామికృపచే నిన్ను
విడిపించ వలసెఁగా విషయబుద్ధి ॥ఎంతై॥

రేకు 12 సంఖ్య 76 సంపు 1 పుట 52

సీ. ఎనసి జన్మముల నే నెట్లుండినం బోక
వెంటునం కెదవుగా విషయబుద్ధి !
అనువైన యనుభవా లనుభవింపఁగఁ జేసి
వెస మఱపింతుగా విషయబుద్ధి !
కాంతలకును నాకుఁ గలిగిన పొలయల్క
విఱిచి కల్పెదవుగా విషయబుద్ధి !
తఱితోడ వావివర్తన దలంచిన నాకు
వెఱపు దెల్పుదువుగా విషయబుద్ధి !

గీ. ఎట్టియాపదలందు నే నెటు పొరలిన
విడిచిపో నేరవైతిగా విషయబుద్ధి !
వేంకటస్వామికృప నడిఁబెట్టి నిన్ను
విడుచునటు చేయవలసెగా విషయబుద్ధి !

దేవగాంధారి

సర్వజ్ఞత్వము వెదకఁగ నొల్లను సందేహింపఁగ నొల్లను
సర్వజ్ఞుండును నాచార్యుండే సర్వశేషమే నా జీవనము ॥పల్లవి॥

యెఱుఁగఁగ నొల్లము విజ్ఞానపుగతి యెఱుకలు నే మిటు సోదించి
యెఱిఁగి యితరులను బోధించెద మను యీ పెద్దరికము నొల్లము
యెఱిఁగేటి వాఁడును యాచార్యుఁడే, యెఱుకయు సర్వేశ్వరుఁడే
యెఱుకయు మఱపును మానిపుఁడుటే యిదియే పో మా విజ్ఞానము ॥సర్వ॥

చదువఁగ నొల్లము సకలశాస్త్రములు సారెకు సారెకు సోదించి
చదివి పరులతో యుక్తివాదములు జగడము గెలువఁగ నొల్లము
చదివేటివాఁడును నాచార్యుండే చదువును నా యంతర్యామే
చదువుకుఁ జదుపమికియుఁ దొలఁగుటే. నా సాత్వికభావమే నాతెలివి ॥సర్వ॥

అన్నిటికిని నే నధికారిననే యహంకారము నొల్లను
కన్నులఁ జూచుచు నందఱితో నేఁ గాదని తొలఁగా నొల్లను
మన్నన శ్రీవేంకటేశ్వరుకరుణను మా యాచార్యుఁడే అధికారి
వున్నరీతినే అస్తినాస్తులకు నూరకుండుటే నాతలఁపు ॥సర్వ॥

రేకు 98 సంఖ్య 468 సంపు 1 పుట 310

సీ. ఎఱిఁగి విజ్ఞానమ్ము నితరుల బోధింతు
మను పెద్దఱికము మే మభిలషింప;
యెఱుఁగువాఁ డాచార్యుఁ డెఱుక సర్వేశ్వరుం
డెఱుక మఱపుమీఁదు టింతెకాక;
సకలశాస్త్రమ్ములు చదువ నొల్లము; యుక్తి
వాదాలఁ బరుల గెల్వంగఁ జనము;
చదువువాఁడు గురుండు చదువె యంతర్యామి
రెంటికిని దొలఁగి యుంటుగాక;
గీ. అన్నిటికి నేనె యధికారి నన్నెడు గర్వ
మొల్ల; మందఱిఁ గనుచు మే ముజ్జగింప
నొల్ల; మాచార్యుఁడే మాకు నొడయుఁ; డస్తి
నాస్తివిచికిత్స మానుటే నాతలంపు.

లలిత

అంతరాత్మ హరిగలఁ డంతే చాలు
యెంతకెంత చింతించ నేలా వెరవ ॥పల్లవి॥

వెనకజన్మపుగతి వివరించి నే నెరఁగ
అనుగు మీఁదటిజన్మ మది యెఱఁగ
ననిచి యీ జన్మము నానాఁటఁ దెలిసేము
యెనసి యీ భవముల కేలా వెఱవ ॥అంత॥

నిన్నటిదివసముకత నిమిషమై తోఁచీని
కన్నుల రేపటిచేఁత కానఁగా రాదు
పన్ని నేఁటిదినము మున్ను నోఁచినట్లే
యెన్నఁగ నెందుకు నైనా నేలా వెఱవ ॥అంత॥

పరము నిహము నేఁ బైకొన నా యిచ్చగాదు
హరి శ్రీవేంకటపతి యఖిలకర్త
శరణంది నాతనికి స్వతంత్ర మతనిది
యిరవెఱితి నింకా నాకేలా వెఱవ ॥అంత॥

రేకు 178 సంఖ్య 888 సంపు 2 పుట 262

సీ. అంతరంగమునందు హరిగలం డదిచాలు
నేల చింతింపంగ ? నేల వెఱవ ?
వెనుకటిజన్మంబు వివరం బెఱుంగను
మీఁదటిజన్మ మేమియొ యెఱుంగ;
ననిచి యీ జన్మము నానాఁటఁ దెలియుదు
నెనసి యీ భవముల కేల వెఱవ ?
నిన్నటిదివకథ నిమిషమై తోఁచెడి
కనుల రేపటిచేఁత కనఁగరాదు
పన్ని నేఁటిదివమ్ము మున్ను నోఁచినయట్లె
యింక దేనికి నైన నేల వెఱవ ?
గీ. ఇహపరాలఁ బైకొనఁగ నా యిచ్చగాదు
అంజనాచలనాయకుం డఖిలకర్త
అతఁడు స్వతంత్రుఁ డా భువనాధిపతికి
నేను శరణాగతుండ; నా కేల వెఱవ ?

## గుండక్రియ

నమ్మినదొకటే నాకు నీ శరణము
యెమ్మెల సంసార మింతే యిందేమిగలదు ॥పల్లవి॥

యేఁటికర్మము నా కేఁటి ధర్మము
యేఁటిదో నేఁజేయఁగా నీకేమి గూడెను
నాఁటకపుతొంటివారు నడచిన మార్గమని
యీఁటుకుఁ జేసేఁగాక యిందేమి గలదు ॥నమ్మి॥

యేడ తపము నాకేడ జపము నే
వాడికఁ జేయఁగ నీకు వచ్చినదేమి
వెడదపుఁబెద్దలెల్లాఁ బెట్టిన తిట్టము లంటా
యీడుకుఁ జేసెఁగాక యిందేమి గలదు ॥నమ్మి॥

యెక్కడి పుణ్యము నా కెక్కడి భోగములు
యిక్కువ నన్నిట్లఁజేసి యేమిగంటివి
నిక్కపు శ్రీవేంకటేశ నిన్నుఁ గనుటగాక
యెక్కడి కెక్కడిమాయ లిందేమి గలదు ॥నమ్మి॥

రేకు 113 సంఖ్య 74 సంపు 2 పుట 50

సీ. ఏటి కర్మము నాకు నేటిధర్మము నాకు
నేను జేయంగ నీకేమి కూడె ?
నా తొంటివారలు నడచిన తెరువని
యేఁజేతుఁగాక యిందేమి గలదు;
ఏటితపము నాకు నేటిజపము నాకు
నేను సల్పంగ నీ కేమివచ్చె
మును పెద్దలెల్లఁ బెట్టిన దిట్టము లటంచు
నిటు చేతుగాక యిందేమి గలదు ?

గీ. ఏడ పుణ్యమ్ము భోగము లేడ నాకు
నేమిగంటివి దేవ! న న్నిట్లుచేసి
గాఢముగ విశ్వసించి ని న్ననుటగాక
ఎచటి కెచ్చటిమాయ లిందేమి గలదు ?

## దే వ గాం ధా రి

అందుకే నేఁ జింతించేదను అచ్యుత నీ శరణాగతుఁడ
సంతడి నాభవ మిందువల్లనే సఫలం బాయ నయ్యా ॥పల్లవి॥

వొక నీనామము వొగిఁ దలంచిన
అకలంకంబగు నాపాపంబులు అన్నియుఁ జారణే సేసె
అకటా తక్కిన అనంతనామములు
వొకట నుపవాసము లున్నవో యయ్యా ॥అందు॥

హరి నీ పాదము లవిరెండే
పరమును నిహమును నా కొసఁగెను పయిపైఁ గృపతోడ
ధర నీ యనంతరములు తామేమి
సిరు లిత్త మనుచు చెలఁగీ నయ్యా ॥అందు॥

ఇల నీ దాస్యం బిది యొకటే
సిలుగులభవముల జిలుగు మాన్పె నదె చిత్తము తహదీర
యెలమిని శ్రీవేంకటేశ్వర నీ విదె
తలఁపునఁ బాయక దక్కితి వయ్యా ॥అందు॥

రేకు 176 సంఖ్య 876 సంపు 2 పుట 258

సీ. నీ నామ మొక్కఁడే నేఁ దలంచినమాత్రి
పారణచేసె నా పాపపటలి
అకట ! తక్కిన నీ యనంతనామంబులు
నుపవాసములు సల్పుచున్నవయ్య !
నీ పాదములు రెండె నే భజించినమాత్రి
కృపతోడ నా కిచ్చె నిహము పరము
ధర నీ యనంతహస్తములు తా మేమేమి
సిరులిత్తు మనుచును జెలఁగు నయ్య !

గీ. నీదు దాస్యం బిదొక్కఁడే నాదుమనసు
చింతదీఱంగ భవముల జిలుగు మాన్పె
అందులకె గొల్తు నిన్ను శేషాద్రినాథ !
తలఁపునం బాయకిటు నాకు దక్కితయ్య !

భైరవి

నీ దాస్య మొక్కటే నిలిచి నన్నుఁగాంచది
శ్రీదేవుఁడవు నీ చిత్తము నా భాగ్యము ॥పల్లవి॥

అనుష్ఠానములు గతియని నమ్మి చేసితినా
తను విది మలమూత్రముల పోగు
జనులలో నుత్తమపుజన్మమే నమ్మితినా
పొనరఁ గర్మమనే వోఁదానఁ బడినది ॥నీదా॥

చదువుల శాస్త్రముల జాడలు నమ్మితినా
పొదలిన మతముల పోరాట మది
మదిమదినుండిన నా మనసే నమ్మితినా
అదియును నింద్రియాల కమ్ముడువోయినది ॥నీదా॥

పుత్ర దార ధన ధాన్య భూములు నమ్మితినా
పాత్రమగు ఋణానుబంధము లవి
చిత్రముగ ననుఁ గావు శ్రీవేంకటేశ నీవే
పత్రపుష్పమాత్రమే నా భక్తి యెల్లా నీకు ॥నీదా॥

రేకు 104 సంఖ్య 20 సంపు 2 పుట 14

సీ. గతియని నమ్మి చేసితినా ? యనుష్ఠాన
ములు, మలమూత్రాల ప్రోగు తనువు;
జన్మల నుత్తమజన్మ నమ్మితినా ? దు
రంతకర్మపుటోదమందుఁ బడియె;
చదువుల శాస్త్రాల జాడ నమ్మితినా ? మ
తమ్ముల దొమ్మికయ్యమ్మె అద్ది;
నమ్మితినా నా మనస్సు నే ? యింద్రియ
మ్ముల కద్ది యమ్ముడువోయె నెపుడొ:

గీ. ఆలుబిడ్డల విత్తగృహాదికముల
నమ్మికొనినన్ ఋణానుబంధమ్ము లివ్వి;
పత్రపుష్పమాత్రమ్మె నా భక్తియెల్లఁ
జిత్రముగ నన్నుఁ బ్రోవవే శ్రీనివాస !

శ్రీరాగం

ఎఱిఁగితి నమ్మితి నితఁడు దయానిధి
మఱఁగులు మొరఁగులు మరి యిఁక లేవు ॥పల్లవి॥
వేదోద్ధరణుఁడు విశ్వరక్షకుఁడు
ఆదిమూర్తి శ్రీ అచ్యుతుఁడు
సోదించి కొలిచితి సుముఖుఁడై మమ్మేలె
యేదెస మాపాల నితఁడే కలఁడు ॥ఎఱి॥
పరమపురుషుఁ డాపన్నివారకుఁడు
హరి శాంతుఁడు నారాయణుఁడు
శరణంటి మితఁడు చేకొని కాచెను
తరవాతిపనులఁ దప్పఁ డితఁడు ॥ఎఱి॥
హృదయాంతరంగుఁడు యీశ్వరేశ్వరుఁడు
ఇదివో శ్రీవేంకటేశ్వరుఁడు
వెదకితి మితఁడు విడువఁడు మమ్మిక
తుదకును మొదలికి దొరకినవాఁడు ॥ఎఱి॥

రేకు 198 సంఖ్య 502 సంపు 2 పుట 339

సీ. ఎఱిఁగితి నమ్మితి నితఁడు దయానిధి
మఱుఁగులు మొరగులు మఱియు లేవు
వేదసముద్ధర్త విశ్వసంరక్షకుం
డాదిమూర్తి ముకుందుఁ డచ్యుతుండు
సోదించి కొలిచితి సుముఖుఁడై మమ్మేలె
నే దెస మాపాల నితఁడె కలఁడు;
ఆపన్నివారకుం డతిశాంతచిత్తుండు
నారాయణుఁడు హరి నందసుతుఁడు
శరణంటి మీతఁడు సత్కృపఁ గాచెను
తరువాతిపనులకుఁ దప్పఁ డితఁడు
ఆ. ఈశ్వరేశ్వరుఁడు హృదయనివాసుండు
శాశ్వతుండు వేంకటేశ్వరుండు
వెదకినార మితఁడు విడువఁడు మమ్మింకఁ
దుదకు మొదలిటికిని దొరకినాఁడు.

# శ్రీనివాసతేజము

## ముఖారి

ఇటు నిన్నుఁ దెలియఁగ నెంతటివారము
తటుకున నాసలఁ దగులుటగాక

నానామూర్తులు నగధర నీరూపు
యే నెలవుల నిన్నెటువలెఁ దలఁచుట
పూని నీ భావము పొందుగాఁ జెప్పఁగా
వీనులు చల్లఁగా వినుటే కాక ॥ఇటు॥

పెక్కునామములు బిరుదు లనంతము
లెక్కడ గొలదిగ నెన్నని పొగడుట
యిక్కువసేసుక యిందులో నొకటి
పక్కన నొకమరి పలుకుటగాక ॥ఇటు॥

వేవేలుగలవు నీ విహారభూములు
యే విధమున నెందెందని తిరుగుట
దేశా నీ శృంగార మెల్లను
సేవించి ముదమునఁ జెలఁగుటగాక ॥ఇటు॥

రేకు 168 సంఖ్య 305 సంపు 2 పుట 204

సీ. నానావిధంబులు నగధర! నీ రూపు
లే నెలవులను ని న్నెట్లు దలఁతు ?
పూని నీ భావము పొందుగఁ జెప్పంగ
వీనులు చల్లఁగా వినుటెగాక
పెక్కునామమ్ములు, బిరుదు లనంతము
లెన్నియటంచు నే నెటు నుతింతు ?
ఇక్కువ గావించి యిందులో నొక్కటి
కోరి నోరారఁ బల్కుటయగాక

గీ. అగణితమ్ములు నీదువిహారభూము
లే విధమున నెందెందని యేఁ జరింతు;
గరుడగిరినాథ! నీదు శృంగార మెల్లఁ
బరఁగ సేవించి సంబరపడుటగాక!

సామంతం

ఏమి సేయుదు నింక నిందిరాధీశ్వరుఁడా
నీ మఱఁగు చొచ్చితిని వెరవేర్తు గాక ॥పల్లవి॥

కడివోని జవ్వనము కలిమిలే మెఱుఁగునా
బడినుండి మిగుల రుణపరచుఁగాక
అడియాస లెల్లాఁ బుణ్యముఁ బాప మెఱుఁగునా
వెడగుఁదనలో దయ విడిపించుఁగాక ॥ఏమి॥

పలపు వెఱ పెఱుఁగునా వాఁడిమొనలకు నైన
బలిమిఁ దూరించఁ జలపట్టుఁగాక
చలనమందిన మనసు జాతి నీ తెఱుఁగునా
కలిసి హేయమున కొడిగట్టించుఁగాక ॥ఏమి॥

వొలమి రతిపరవశము యెగ్గుసి గ్గెఱుఁగునా
బలిమిఁ దిట్లకు నొడఁబఱచుఁగాక
యిలలోన శ్రీవేంకటేశ నీ మాయ లివి
తలఁగించి యేలితివి దయసేతుగాక ॥ఏమి॥

రేకు 102 సంఖ్య 11 సంపు 2 పుట 8

సీ. ఎలజవ్వనం బిది కలిమిలే మెఱుఁగునా ?
బడినుండి కడు ఋణపఱచుఁగాక
అడియానలెల్లఁ బుణ్యము పాప మెఱుఁగునా ?
వేగమే దయ విడిపించుఁగాక
వాఁడి మొనలకైన వలపెఱుంగునె వెఱ ?
పట్టె దూర్చగ చలపెట్టుఁగాక
చలచిత్త మెఱుఁగునా జాతినీతుల నొడి
గట్టించుఁగా కల్పకార్యములకు

గీ. ఎఱుఁగునా రతి వివశత్వ మెగ్గుసిగ్గు ?
బండతిట్లకు మఱి యొడఁబఱచుఁగాక !
ఏమి సేయుదు నీమాయ లివ్వి వేంక
టేశ ! చొచ్చితి నీ మఱుఁగ్ గేలు మయ్య !

ఆహిరి

కలిదోషములాల కడునేల మీరేరు
యింధరుఁ డుండగాను యింక నేఁటి సుద్దులు ॥పల్లవి॥

జగము లేలెడువాఁడు సర్వాంతరాత్మకుఁడు
జిగి నింక నీకీబుద్ధి చెప్ప నోపఁడా
నిగిడి పుట్టించేటివాఁడు నిండుక వుండేటివాఁడు
తెగనికర్మము లెల్ల తిద్దకేల మానును ॥కలి॥

దనుజుల గొట్టేవాఁడు ధర్మము నిలిపేవాఁడు
పనిగొన్న దురితాలు పాప నేరఁడా
కొనమొదలైనవాఁడు గురిదానైనవాఁడు
పునికి మనికి సేయ కూరకుండీనా ॥కలి॥

స్వతంత్రుఁడైనవాఁడు స్వామియైనవాఁడు
గతియై దాసులనెల్లఁ గావకుండీనా
యితఁడే శ్రీవేంకటేశుఁ డిందిరాపతైనవాఁడు
సతతము మాకు నిట్టే సంపద లొసఁగఁడా ॥కలి॥

రేకు 120 సంఖ్య 118 సంపు 2 పుట 80

సీ. జగము లేలెడువాఁడు సర్వాంతరాత్ముండు
జిగి మాకు బుద్ధులు చెప్ప లేఁడె ?
నిగిడి పుట్టించుచు నిండియుండెడివాఁడు
తెగని కర్మము లెల్ల దిద్ద లేఁడె ?
దనుజుల హతమార్చి ధర్మము నిల నిల్పు
వాఁడు పాపమ్ములు వావ లేఁడె ?
కొనమొదలగువాఁడు గురి తానె యైనవాఁ
డునికి మనికి సేయ నోప లేఁడె ?

గీ. స్వామియైనవాఁడు స్వాతంత్ర్య మున్నవాఁ
డోమ లేఁడె సేవకోత్కరమ్ము ?
సిరికి వెలుఁగైన శ్రీవేంకటేశుండు
సంపదాళి మాకొసంగ లేఁడె ?

శ్రీరాగం

ఇట్టివాఁడవు సులభ మెట్లా నైతివో కాక
అట్టి నీదయ దలఁచి అరుదయ్యో నాకు ॥పల్లవి॥
యేమేమి చదువవలె నెందరి నడుగవలె
ఆముక నిన్నుఁ దెలిసేయందుకొరకు
భూమిలోన నెంతేసి పుణ్యములు సేయవలె
కామించి నీపై భక్తిగలిగేటి కొరకు ॥ఇట్టి॥
యెన్ని జన్మా లెత్తవలె నెందెందు వెదకవలె
కన్నుల నీ సాకారము గనేకొరకు
వున్నతి నెంతగాలము వొగ్గి కాచుకుండవలె
విన్నవించి నీ సేవ వేఁడుకొనేకొరకు ॥ఇట్టి॥
యేదేది యెఱఁగవలె యె ట్లభ్యసించవలె
నీ దాసుఁ డనిపించుకొనేటికొరకు
సాదరాన శ్రీవేంకటేశ్వర నన్ను మన్నించితి
వేదెసఁ బొగడవలె యింత సేసేకొరకు ॥ఇట్టి॥

రేకు 164 సంఖ్య 811 సంపు 2 పుట 208

సీ. ఎంత చదువవలె నెందఱి నడుగంగ
వలె నీదుజాడలు తెలియుకొఱకు
భువిలోన నెంతేసి పుణ్యముల్ సలుపంగ
వలె నీ యెడల భక్తి గలుగుకొఱకు
ఎన్ని జన్మము లెత్తి యెందెందు వెదుకంగ
వలె నీవు మాకంటఁ బడెడుకొఱకు
ఎంతకాలము వేచి యిట్టు నిల్వఁగవలె
వేడ్కమై నీ సేవ వేఁడుకొఱకు
గీ. ఎంత అభ్యసింపఁగవలె నెఱుఁగ వలెను
కోరి నీ దాసుఁ డనిపించుకొనెడుకొఱకు
నన్ను మన్నించినాఁడ వనాథనాథ
చెలఁగి యెటు మెచ్చవలె నింతసేయుకొఱకు.

## కేదారగౌళ

ఇదియే ఉపాయ మిఁక నాకు నిందులకంటె మఱి లేదు
మది నితనిదాసుల దాసుఁడనై మహిమలతోఁ గడు మెఱసేఁగాక ॥పల్లవి॥

కడచితినా నాజన్మములు గక్కన మానిసి నైనంతనే
విడిచితినా పాపము సేయక వేవేలు చదివినయంతనే
అడఁచితినా సంసారవారధి అఖిలదేవతలఁ గొలిచినయంతనే
బడిబడి హరినామము నుతించి నేఁ బావన మయ్యేఁగాక ॥ఇది॥

గెలిచితినా యీ మాయను నేఁ గెరలి తపంబులు సేసినంతనే
తలఁగితినా నరకములు చొరక ధరయెల్లా నేలినంతనే
తెలిసితినా తత్వరహస్యము తిరముగ కులజుఁడ నయినంతనే
యిలలో శ్రీపతిశరణుచొచ్చి నే నిన్నిటఁ బుణ్యుఁడ నయ్యేఁగాక ॥ఇది॥

వదలితినా నాదుర్గుణములు వసుసతోఁ జుట్టాలు గలిగినంతనే
వెదకితినా ముక్తిమార్గమును విద్య లెఱిఁగి నేర్చినంతనే
యిదివో శ్రీవేంకటేశుఁడు నాకును యేలికయై మన్నింపఁగను
పదిలముగా నాతనిసేవసేసి పరమానందుఁడ నయ్యేఁగాక ॥ఇది॥

రేకు 146 సంఖ్య 210 సంపు 2 పుట 141

సీ. మానిసినైనంత మానను జన్మముల్
వేవేలు చదివియు విడువ నఘము
సకలసురులఁ గొల్చి సంసారమును బాయ
కొండాడి హరిఁ బవిత్రుండ నగుదు;
మఱి తపమ్ము లొనర్చి మాయ జయింపను
దాఁటను నరకముల్ ధరణి నేలి
ఎఱుఁగఁ దత్త్వరహస్య మిటు కులజుండనై
హరిని శరణుఁజొచ్చి యగుదు సుకృతి;

గీ. వదల దుర్గుణములు బంధువర్గమున్న
వెదక ముక్తిమార్గము పెక్కు విద్య లున్న
నన్ను మన్నింప తిరుమలనాథుఁ డతని
భక్తి సేవించి యానందపదము గందు.

## భైరవి

నీవు జగన్నాథుఁడవు నే నొక జీవుఁడ నింతే
నీవలె ననుభవించ నే నెంతవాఁడను ॥పల్లవి॥

వైకుంఠ పదమేడ వడిఁగోర నెంతవాఁడ
యీ కడ నీ దాసుఁడనౌ టిది చాలదా
చేకొని నీ సాకారచింత యేడ నే నేడ
పైకొని నీ దాసుమోచి బ్రదికితిఁ జాలదా ॥నీవు॥

సొంపుల నీ యానందసుఖమేడ నే నేడ
పంపు శ్రీవైష్ణవసల్లాపన చాలదా
నింపుల విజ్ఞాన మేడ నేఁ దెలియ నెంతవాఁడ
యింపుగా నీకథ వినుటిదియే చాలదా ॥నీవు॥

కైవల్యమందు నీతో కాణాచి యాడనాకు
శ్రీవేంకటాద్రిమీఁది సేవ చాలదా
యీవల శ్రీవేంకటేశ నీ విచ్చిన విజ్ఞానమున
భావించి నిన్నుఁ బొగడే భాగ్యమే చాలదా ॥నీవు॥

రేకు 189 సంఖ్య 169 సంపు 2 పుట 113

సీ. వైకుంఠపద మేడ? వాంఛింప నేనేడ?
శేషాచలముమీఁది సేవ చాలు;
తావకరూపచింతనమేడ? నే నేడ?
నొడల నీ చిహ్నమ్ము లున్నఁజాలు;
చూడ బ్రహ్మానందసుఖమేడ? నే నేడ?
చాలు శ్రీవైష్ణవసల్లపనము;
విజ్ఞాన మదియేడ? నజ్ఞుఁడ నే నేడ?
నెలమి నీ కథ విను టిదియ చాలు;

గీ. ఏను జీవుండ నీ వఖిలేశ్వరుండ
వభిలషింపను నీవలె ననుభవింప
నీ విడిన జ్ఞానసంపత్తి నిన్నుఁ బొగడు
భాగ్య మొదవినఁ జాలును ఫణిగిరీశ!

శంకరాభరణం

ఆహా యేమిచెప్పేది హరి నీ మాయ
మోహములే చిగిరించి మొదల జవ్వనము ॥పల్లవి॥
యెంచఁగ భూమి యొక్కటే యేలినరాజు లెందరో
పొంచి వారివెంటవెంటఁ బోవదాయను
అంచల సూర్యచంద్రులనే గడెకుడుకల
ముంచి కొలచిపోసీని మునుకొనికాలము ॥ఆహా॥
దేవలోక మొక్కటే దేవేంద్రు లెందరో
కైవశమై యేలఁగ నొక్కరిదీ గాదు
ఆవటించి పంచభూతా లనేటి శాఖలువెళ్ళి
సావధానానఁ బెరిగీ సంసారవృక్షము ॥ఆహా॥
యిప్పట నీవొక్కఁడవే యిటు నీదాసు లెందరో
తప్పి యెంత సేవించినాఁ దనివిలేదు
నిప్పులు శ్రీవేంకటేశ నిధానము నీభక్తి
యెప్పినాఁడ వింతటా నీదేరీజన్మము ॥ఆహా॥

తేకు 140 సంఖ్య 172 సంపు 2 షట 115

సీ. ఎంచ భూమియొకండె యేలిక లెందఱో
పొంచి వారలవెంటఁ బోవఁడాయె
అంచెల రవిచంద్రు లను గడెకుడుకుల
నీ మాయ కాలమున్ నియతిఁ గొలుచు
దేవలోక మొకండె దేవేంద్రు లెందఱో
కైవసంబుగ నేలఁగా దొకరిది;
పంచభూతములను ప్రంగలతో వెళ్ళి
జానుగఁ బెరుగు సంసారతరువు
గీ. ఎందఱో నీకు సేవకు లీ వొకఁడవె
త్రిప్పి నిన్నెంత కొలిచినఁ దనివి లేదు
నిచ్చలును వేంకటేశ్వర ! నీదుభక్తి
నా నిధాన, మీదీర్చుఁబో నా భవమ్ము.

ముఖారి

జగము లేలేవాఁడవు జనార్దనుఁడవు
తగ నీవారమే నేము ధర నెట్టుండినాను ॥పల్లవి॥

గతినీవు మతినీవు కాణాచిచోటు నీవు
సతమై యన్నిటికిని సాక్షివి నీవు
చతురత వలసితే జరతుము కొలుతుము
తతి నేము సేసినతప్పులు లోఁగొనవే ॥జగ॥

తల్లియుఁ దండ్రివి నీవు దాత దైవమవు నీవు
యెల్లవారికిఁ బరము నిహము నీవు
మల్లడి నొక్కొక వేళ మఱతుము తలఁతుముఁ
చల్లఁగా మానేరములు సైరించుకొనవే ॥జగ॥

దరినీవు దాపునీవు దయామూర్తివి నీవు
పరఁగ శ్రీవేంకటేశపతివి నీవు
విరివిగా నేమైనా వేఁడుదుము నుతింతుము
శరణుచొచ్చితి మిఁక క్షమియించుకొనవే ॥జగ॥

రేకు 240 సంఖ్య 229 సంపు 8 పుట 158

సీ. గతి నీవు పతి నీవు కాణాచియును నీవు
సతత మన్నింటికి సాక్షి నీవు
చతురత వలసినఁ జఱతుము కొలుతుము
మాతప్పు లెంచకు మనసునందు
తల్లివి దండ్రివి దైవము దాత నీ
వెల్లవారికిఁ బర మిహము నీవు
మల్లడి నొకవేళ మఱతుము తలఁతుము
సైరించుకొనవె మా నేరములను
గీ. దాపు దరి నీవు కారుణ్యధాము డీవు
పరఁగ శ్రీవేంకటాచలపతివి నీవు
వేడుకొందుము నినుఁ గొనియాడుచుందు
మెట్టు లున్నను మము క్షమియింపు మయ్య!

### వసంతవరాళి

ఇహముఁ బరముఁ జిక్కె సీతనివంక
అహిశయనునిదాసు లంతవారు వేరీ ॥పల్లవి॥

సిరికలిగినవారు చింత లిన్నిటనుఁ బాసి
నిరతపువర్గ (గర్వ ?) ముతో నిక్కేరటా
సిరికి మగఁడయిన శ్రీపతి యేలి మ
మ్మరయుచున్నాఁడు మాయంతవారు వేరీ ॥ఇహ॥

బలవంతుఁ డైనవాఁడు భయము లిన్నిటఁ బాసి
గెలిచి పేరువాడుచుఁ గెరలీ నటా
బలదేవుఁడైన శ్రీపతి మాయింటిలోన
అలరివున్నాఁడు మాయంతవారు వేరీ ॥ఇహ॥

భూమి లేలేటివాఁడు భోగములతోఁ దనిసి
కామించి యానందమునఁ గరఁగీనటా
సేమముతో భూపతైన శ్రీవేంకటేశుఁడు మాకు
అముకొని వుండఁగా మాయంతవారు వేరీ ॥ఇహ॥

రేకు 206 సంఖ్య 34 సంపు 3 పుట 28

సీ. సిరిగలిగినవాఁడు చింత లన్నిఁటిఁ బాసి
నిండుగర్వముతోడ నిక్కునంటు
సిరికి మగండైన కరివరదుఁడు మమ్ముఁ
బాలింప మాయంతవార లేరి ?
బలవంతుఁ డగువాఁడు భయము లన్నిఁటిఁబాసి
గెలిచి పేరుగడించి కెరలునంటు
బలదేవుఁడైన శ్రీపతి మాగృహమ్మున
వఱలెడు మాయంతవార లేరి ?
గీ. భూమి లేలెడువాఁ డెల్లభోగములను
గనుచు నానందరసమునఁ గరఁగునంటు
వసుమతీపతి వేంకటేశ్వరుఁడు మాకు
నండయైయుండ నేరి మాయంతవారు ?

బౌళి

మమ్ముఁజూడ నేమున్నది మావంక నీ కేలాభము
కమ్మక దయదలంచి కరుణింతుగాక ॥పల్లవి॥

శ్రీకాంతుఁడ నీ పాదసేవకు లయినవారు
పాకశాసనాదులును బ్రహ్మాదులు
పైకొని సరుఁడ నేను బంటుఁగాఁగ నెంతవాఁడ
కైకొని నీపుణ్యానకుఁ గాచు టింతేకాక ॥మమ్ముఁ॥

నారాయణుఁడ నిన్ను నమ్మినట్టిదాసులు
నారదాది సనక సనందనాదులు
వీరిలో నే నెంతవాఁడ వికటపుజీవుఁడను
యీ రీతి నీమూకఁగూడ నేలుటింతేకాక ॥మమ్ముఁ॥

శ్రీవేంకటేశ నీపై చేరి భక్తి సేసేవారు
కావించి యనంతముఖ్యగరుడాదులు
దేవ నే నొక్కనీచుఁడ దీనరక్షకుఁడవు నీ
వివిధ మెంచక మమ్ము నీడేరింతుగాక ॥మమ్ముఁ॥

రేకు 260 సంఖ్య 286 సంపు 3 పుట 198

సీ. శ్రీనాథ! నీ పాదసేవకు లగువారు
సరసిజాసన పాకశాసనాదు;
లేను నీ బంటౌట కెంతవాఁడ, నరుండఁ?
బ్రోవుము నను వట్టిపుణ్యమునకు;
నారాయణుఁడ! నిన్ను నమ్మినదాసులు
నారద సనక సనందనాదు
లి వ్వారిలోన నికృష్టుండ నే నెంత?
పోషింతుగాక నీ మూకఁగూడ

గీ. శ్రీశ! చేరి నీపై భక్తి సేయువార
లెంచఁగ ననంతగరుడాదు; లీవు దీన
బాంధవుఁడ; వేను నీచుఁడ పాటిగొనక
మా విధం బెంచుకయుఁ, గృపఁ గావు మయ్య!

## గుండక్రియ

పంతపుటాసలు బండ్లరాఁగా
దొంతులయలమట దొలఁగేనా ॥పల్లవి॥

ముని దీపనాగ్ని మోఁచిన దేహిని
అనిశముఁ గ్రోధాగ్ని నణఁచేనా
మనసిజుకతమున మహి జన్మించితి
విను మరునాజ్ఞకు వెలియయ్యేనా ॥పంత॥

సటలోభపుసంసారము చొచ్చితి
ఘటన విడుముడికె గలిగీనా
నటించు చపలపునాలుక గల నే
మటమాయపుదవి మానేనా ॥పంత॥

పాపపుణ్యముల భవముల జీవిని
తోపద కర్మము దొబ్బేనా
యేపున శ్రీవెంకటేశ్వరు శరణమే
పైపయి భజించి బ్రదికితిఁగాక ॥పంత॥

రేకు 312 సంఖ్య 69 సంపు 10 పుట 46

సీ. పంతపుటాసలు బండ్లపైఁ జనుదేర
దొంతులయలమట తోయఁగలనె ?
ముని దీపనాగ్ని మోచిన దేహధారిని
ననిశముఁ గ్రోధాగ్ని నణఁచఁగలనె ?
మనసిజుకతమున మహిని జన్మించితి
వెడవిల్తునాజ్ఞకు వెలియగుదునె ?
లోభపుసంసృతిలోఁ దగుల్కొంటిని
కలనేని విడుమర గాంచఁగలనె ?
నటియించు చపలపునాలుక గలనేను
మటుమాయపుంజవి మానఁగలనె ?

గీ. పాపపుణ్యానుభవముకై భవముగన్న
ప్రాణిమాత్రుఁడ కర్మమ్ముఁ బాయఁగలనె ?
సప్తశైలాధినాయకు శరణుఁజొచ్చి
సతతము భజించి యిటు బ్రదికితినిగాక !

## లలిత

ఎంచి చూచితే మాకు నిందే నిత్యసుఖము
కొంచి యనుమాన మైతే కొనదాఁకా లేదు ॥పల్లవి॥

హరి నీ గర్భములోన నంగమయి పున్నారము
యిరవై వేరె మోక్ష మెంచ నున్నదా
నిరతిఁ జూచిన వెల్లా నీ రూపులే మాకు
ధరలోన నింతకంటె ధ్యాన మున్నదా ॥ఎంచి॥

అంతరాత్మవైన నిన్నె యాతుమకు నిచ్చితిని
యింతకంటె నే నడిగేది యిఁక నున్నదా
పొంతనే భూకాంత పుట్టినవెలవు మాకు
యింతకంటె తల్లిదండ్రి లిఁక నున్నారా ॥ఎంచి॥

వెరి నెరుకే జ్ఞానము పొంచి మరపె సమాధి
సొరిది నేఁ డింతకంటె సుఖ మున్నదా
గరిమ శ్రీవెంకటేశ కల్పిత మింతా నీదె
శరణంటె యింకా విచార మున్నదా ॥ఎంచి॥

రేకు 342 సంఖ్య 246 సంపు 10 పుట 165

సీ. హరి ! నీదుగర్భాన నంగమై యున్నార
మిరవయి యిఁక మోక్ష మెంచఁ గలదె ?
నిరతిఁ జూచినవెల్ల నీ రూపులే మాకు
ధర నింతకంటెను ధ్యాన మేది ?
ఆత్మ కిచ్చితి నంతరాత్ముండ వగు నిన్ను
నే నడిగెడిదేమి యింతకంటె ?
పొంతనే భూకాంతపుట్టినవెల వింత
కంటె మాతాపితల్ గలరె మాకు ?

గీ. ఎఱుకయే జ్ఞానము; సమాధి మఱపె మాకు
సొరిది నేఁ డింతకంటెను సుఖము గలదె ?
కల్పితం బింత నీదె వేంకటనగేశ !
శరణనిన మాకుఁ గలదె విచార మింక.

గుండక్రియ

కైకొండేకాక కమలనాథునియాజ్ఞ
పైకొని యిన్నిటాను బాసివుండనేది ॥పల్లవి॥

హరినిర్మితములే అఖిలప్రపంచము
తొరలి యేమిటి నింద దూషించేది
ధరణిధరునికి దాసులే జీవు లెల్లా
గరిమ నెవ్వరి నిందఁ గాదదేది ॥కైకొ॥

వాసుదేవకల్పితమే వరసంసారబంధము
దోసమంటా యెందెందు దొలఁగేది
శ్రీసతీవరచనలే చేకొన్న రుచులెల్ల
యీసుతోడ నిందమీఁద నెట్టురోసేది ॥కైకొ॥

గోవిందుమాయలే కూడినట్టి పనులెల్ల
వేవేలై యిందు నెట్టు వేసరేది
శ్రీవెంకటేశుఁడే చిత్తములో ధ్యాన మెల్లా
పావనమైతిమి యిఁకఁ బరచింత యేది ॥కైకొ॥

రేకు 326 సంఖ్య 148 సంపు 10 పుట 99

సీ. హరినిర్మితమ్మె యీ యఖిలప్రపంచమ్ము
దూషింపఁగా నేది తొరలు నింద;
ధారుణీధరునకు దాసులే జీవుఁ లిం
దెవ్వని గాదని యెట్టు లందు ?
సంసారబంధ మా సర్వేశుకల్పితం
బెందెందుఁ దొలఁగుదు హేయ మనుచు
చేకొన్న రుచు లెల్ల శ్రీపతిరచనలే
యెటులిందు రోయుదు నీసుతోడ
ఆ. కూడినట్టిపనులు గోవిందుమాయలే
వేసరిలుదు నెట్లు దోస మనుచు
శ్రీనివాసవిభుఁడె చిత్తమ్ములో ధ్యాన
మేఁ బవిత్రుఁడైతి నేదిచింత ?

## ఉద్ధవసంతం

కటకటా యీ ప్రాణి గతిగనుట యెన్నఁడో
అటు నా వశముగాదు హరి నీచేఁగాని ॥పల్లవి॥

పాపము నెరుఁగుదు బంధము నెరుఁగుదు
మాపుదాఁకా నివి నేను మానలేఁ గాని
కోపము దుర్గుణ మని కొంతగొంత యెరుఁగుదు
తీపుల యాసలఁబడి తిప్పలేఁ గాని ॥కట॥

చూతును దుఃఖాలవారిఁ జూతును బుట్టేవారి
యీతల నాకు వెరపు యించుక లేదు
గాతల నా మనసెల్లఁ గల్పించిన ట్లవును
చేతనైనా చెప్పినట్టు సేయలేఁ గాని ॥కట॥

నా వంకఁ గడమగాఁక నా గురుఁడు తొల్లె నన్ను
శ్రీవెంకటేశుఁడ నీ చేతి కిచ్చెను
దైవ మొక్కఁడవే నీ దాసానుదాసుఁడ నైతి
యే విధులు నే నెరఁగ నిటు నిన్నేకాని ॥కట॥

రేకు 333  సంఖ్య 195  సంపు 10  పుట 130

సీ. పాపమ్ము నెఱుఁగుదు బంధమ్ము నెఱుఁగుదు
మాపుదాఁకను వీని మానఁగాని,
కోపమ్ము చాల దుర్గుణమంచు నెఱుఁగుదు
తీపియాసలఁబడి త్రిప్పఁగాని,
చూతు దుఃఖితులను, జూతుఁ బుట్టెడివారి
నినుమంతవెఱపు నా కివల లేదు
గాతల నామతి కల్పించినట్లవు
చేతఁ జెప్పినయట్లు చేయఁగాని,
గీ. కడమ నా వంకఁగాక యప్పుడె గురుండు
నన్ను నీచేతి కిచ్చెను; నిన్నె కాని
యే విధు లెఱుంగఁ గరుణ నన్నేలుమయ్య !
నీదుదాసానుదాసుఁడ నీరజాక్ష !

## నారాయణి

హరిహరి నీ మాయామహిమ
సరవి దెలియ సనుఁ గరుణించఁగదే ॥పల్లవి॥
తలఁతును నాపాలిదైవమ వని నిను
తలఁతును తల్లివిఁ దండ్రివని
మలసి యంతలో మఱతుమ తెలుతుమ
కలవలె నున్నది కడ గనరాదు ॥హరి॥
మొక్కుదు నొకపరి మొగి నేలిక వని
మొక్కుదు నీ వాదిమూల మని
వుక్కున గర్వించి యుబ్బుదు సగ్గుదు
కక్కస మైనది కడ గనరాదు ॥హరి॥
చూతును నీమూర్తి సులభుఁడ వనుచును
చూతు జగములకు సోద్యమని
యీతల శ్రీవెంకటేశ నన్నేలితివి
కౌతుక మొదవెను కడ గనరాదు ॥హరి॥

రేకు 350 సంఖ్య 298 సంపు 10 పుట 196

సీ. తలఁతును నాపాలి దైవతం బని నిన్ను
దలఁతును తల్లివి దండ్రి వనుచు
మరల నంతటిలోన మఱతును దెలతును
కడ గానరా; దుండె కల విధాన;
మ్రొక్కుదు నొకపరి మొగి యేలిక వటంచు
మ్రొక్కుదు నీ వాదిమూల మనుచు
ఉక్కున గర్వించి యుబ్బుదు వగ్గుదు
కక్కసమ్మయి కడ గానరాదు;
గీ. సులభుఁడ వటంచు నీమూర్తి చూచుచుందుఁ
జూతు జగముల కెంతొ చోద్య మనుచు
ఏమి నీమాయ! శ్రీశ! న న్నేలినావు
కౌతుకం బాయెఁ గడ యింత కానరాదు.

శో క వ రా ళి

విడువుము మనసా వీరిగిచేఁతలు
తడయక శ్రీహరిఁ దలఁచవొ యిఁకను ॥పల్లవి॥
నానాఁడె యెనుఁబది నాలుగులక్షలు
యోనుల వెడలితి నొక్కఁడనే
ఆనిన భోగము లందలివే పో
కానము యిఁక నేమి గడియించేము ॥విడు॥
నలుగడ నటు పదునాల్గులోకములు
వెలయఁ జొచ్చితిని వెడలితిని
కలిగిన దేదో కలుగని దేదో
తెలియ దేమిటికిఁ దిరిగేమో ॥విడు॥
భువిలోఁ జేసితి పుణ్యముఁ బాపము
కలిసి యా ఫలము గైకొంటిని
యివల శ్రీవెంకటేశుఁ డింతలో
తవిలి యేలఁగా ధన్యుఁడ నైతి ॥విడు॥

రేకు 337 సంఖ్య 216 సంపు 10 పుట 144

సీ. నానాఁడె యెనుబదినాలుగులక్షల
యోనుల వెడలితి నే నొకండ
ఆనిన భోగమ్ము లందలివే మఱి
యేమి గడింతుమో యెఱుఁగ లేము
నలుగడ నటు పదునాల్గులోకమ్ములు
వెలయంగఁ జొచ్చితి వెడలినాఁడ
కలిగిన దెద్దియో కలుగని దెద్దియో
తెలియ దేఁటికి మఱి తిరిగినాము ?
గీ. భువి నొనర్చితి పాపము పుణ్య మవల
నా ఫలముగొంటి మనసా ! యిఁకైన విడుము
నీదు వీఱిడిచేఁతలు; నిలుపు మాత్మ
నాగనగనాథు జన్మ ధన్యత్వమంద.

దే సా ళం

వాసుదేవ నీవు నెలవరివి మగుడనేల
ఊసరి నీవద్దనుండే యెట్లైనఁ జేయవయ్యా ॥పల్లవి॥

మాయ దెచ్చి నా బదుకు మనుజలోకాన వేసె
కాయము సంసారవార్ధి గడ్డపై వేసె
పాయపు నా తమకము భామలవలల వేసె
ఛాయ నేనుండి వచ్చినజా డెఱఁగ నయ్యా ॥వాసు॥

ఘనమైన యింద్రియాలు కర్మముల వాతవేసె
మనసుసంపద యామనిలో వేసె
పనులెల్ల లంపటాల పయిఁ బక్కలా వేసె
కొనకెక్కఁ నేనె నా గురుతు గాననయ్యా ॥వాసు॥

అంచెల నా దినములు ఆఁకటిబారి వేసె
ముంచిన నా గుణములు మోహముల వేసె
యెంచఁగ శ్రీవెంకటేశ యెందెం దున్నాఁడనో
పొంచి నీకు శరణంటి బోధించ వయ్యా ॥వాసు॥

రేకు 325 సంఖ్య 148 సంపు 10 పుట

సీ. మాయదెచ్చి బ్రిదుకు మనుజభువిని వేసె
కాయము సంసృతికడలి వేసె
ప్రాయంపుఁదమకము భామలవలవేసె
నే నుండివచ్చిన నెలవెఱుంగ;
మఱి యింద్రియములు కర్మములవాతను వేసె
మనసు సంపత్తి యామనిని వేసె;
పనులు లంపటముల పయిపక్కలను వేసె
నేనె నా గుఱుతును గాననయ్య!
గీ. పరఁగ దివసమ్ము లాఁకటిబారి వేసె
నమరినగుణంబు లెల్ల మోహముల వేసె
ఎంచ శ్రీవేంకటేశ! యెందెందుఁ గలనో
తివిరి శరణంటి నీక్కు బోధించవయ్య!

దే సా క్షి

ఇందుకేది వుపాయమో యీశ్వర నీకే తెలుసు
మరదలించ నశక్తుఁడ మరి నీ దాసుఁడను ॥పల్లవి॥

ధీరుఁడనై ధరణిలోన దేహము నే మోచితి
కోరి పుణ్యపాపాలకు గురియైతి
నూరట యేమిటా లేదు వోప నని మానరాదు
తీరదు భోగించక దినదినకర్మము ॥ఇందు॥

గరిమ సంసారినైతి కంటిఁ బెక్కుసుతులను
యిరవుగఁ గట్టుకొంటి నీలంపటాలు
వెరవేమీ నెరఁగను విడువ వెంతైనాను
హరిహరి రాచినా సమయవు బలుకాంక్షలు ॥ఇందు॥

అట్టె గురుముఖమైతి నాతుమలో నినుఁగంటి
జట్టిగాని నీ పాదాలే శరణంటిని
గట్టిగా నలమేల్మంగకాంతుఁడ శ్రీవెంకటేశ
యిట్టె నిన్నెరఁగలేని దిన్నాళ్ల నా నేరమి ॥ఇందు॥

రేకు 826 సంఖ్య 150 సంపు 10 పుట 100

సీ. ధీరుఁడనై ధర దేహమ్ము మోచితి
పాపపుణ్యములకుఁ బాత్రి మైతి;
ఊరటలే దెందు నోనర భోగింపక
దినదినకర్మము తీఱఁబోదు;
గరిమ సంసారినై కంటి బిడ్డలఁ; గట్టు
కొంటి లంపటములగుదులు మెడకు;
వెరవేమి యెఱుఁగను; విడువ వేంతైనను;
కాలరాచిననైన కాంక్ష లుడుగ;
గీ. వట్టె గురుముఖమైతి నిన్నాత్మఁగంటి;
నీదుపాదాలె శరణంటి; నిన్నెఱుంగ
నేర కిన్నాళ్లు వుచ్చిన నేర మెంచ
కాత్మదాసానుదాసు న న్నరయు మీశ !

శంకరాభరణం

ధర్మమునకె మము దయఁగావలె యింక
నిర్మలుఁడవు నిను నే మెరిఁగేమా ॥పల్లవి॥

కాయధారులము కర్మలోలులము
మాయ కగపడిన మనుజులము
పాయపుమదమున భ్రమసే మామనసు
నీయెడఁ దగులై నిలిచీనా ॥ధర్మ॥

చాపల్యగుణము జడుల మన్నిటాను
పాపపుణ్యసంబద్ధులము
పైపైఁ గోర్కుల ప్రబలే మా బ్రదుకు
నే పనులకు నీ కెక్కీనా ॥ధర్మ॥

అతిప్రాకృతులము అహంకారులము
సతతంబునుఁ జంచలులము
హితవుగ శ్రీవెంకటేశ యేలితివి
తతితో నీ భక్తి తగ మరచేమా ॥ధర్మ॥

రేకు 849 సంఖ్య 290 సంపు 10 పుట 194

సీ. కాయధారుల మేము కర్మలోలురము నీ
మాయకుఁ జిక్కిన మానవులము
ప్రాయంపుమదమున భ్రమయు మా చిత్తమ్ము
నీయెడ తగులొంది నిలుచునేమి ?
చంచలగుణులము జడుల మన్నిట పుణ్య
పాపబద్ధుల మతిప్రాకృతులము
పైపయి కోర్కులఁ బ్రబలు మా బ్రతుకు నీ
కేపనులన్ మది కెక్కఁగలదు ?

ఆ. ధర్మమునకె మమ్ము దయగావవే యింక
ని న్నెఱుంగఁగలమె నిర్మలుండ!
వేలినాఁడ వీవు హితవుగ నీ భక్తి
మఱవఁగలమె ? శేషగిరినివాస !

## శ్రీ నివాస తేజము

### దేసాళం

వాదమేల సారెసారె వది ముక్తి లేదంటా
వేదాంతశ్రవణము వెట్టికిఁ జేసిరా ॥పల్లవి॥

అరయ జీవుల కెల్లా నభేదమైతే
గురుఁడు శిష్యుఁడు లేఁడు కూడ దర్థము
సొరిది నాతుమలోన సోహంభావన యైతే
సరి మునులదేవపూజలు చెల్లవు ॥వాద॥

సహజలీలావిభూతి సర్వము మిథ్యయైతే
బహుయాగాదికర్మాల పసలేదు
మహిలోని జననాలు మరణాలు మాయమైతే
విహితాచారాలు సేయ విధే లేదు ॥వాద॥

ఘటన బ్రహ్మము నిరాకారమైతేఁ జదివింప
యిటు పురుషసూక్తాదు లివి మరేల
అటు శ్రీవేంకటేశుదాస్యములేక బిగిసితే
పటలాడుకొనెడి రాక్షసమత మవును ॥వాద॥

రేకు 120 సంఖ్య 120 సంపు 2 పుట 81

. అరయ జీవుల కెల్ల నగుచో నభేదమ్ము
గురుఁడు శిష్యుఁడు లేఁడు కువలయమున;
ఆత్మయం దెపుడు సోऽహంభావనమె యైన
మునుల దైవతపూజ మును పొసఁగదు;
లీలావిభూతి శీలింప మిథ్యయె యైన
క్రతుకర్మములకు నక్కఱయె లేదు;
మహి జన్మమరణముల్ మాయయైనన్ విహి
తాచారములకు లే దవసరంబు;

గీ. కచ్చితముగ బ్రహ్మము నిరాకారమైన
నటు పఠింపఁగ పురుషసూక్తాదు లేల ?
వేంకటేశుదాస్యము లేక బిగిసికొన్న
మాట లేటికి రాక్షసమతమె యగును.

## భైరవి

అయ్యో మాయలఁబొంది అందు నింద నున్నవారు
యియ్యఁగొనఁ గర్తలుగా రెఱఁగరు జడులు ॥పల్లవి॥

చుక్కలై యుండినవారు సురలై యుండినవారు
యిక్కడనుండి పోయిన యీ జీవులే
దిక్కుల వారి నిందరు దేవతలంటా మొక్కేరు
యెక్కుడైన హరి నాత్మ నెఱఁగరు జడులు. ॥అయ్యో॥

పాతాళవాసులును పలులోకవాసులును
యీ తరవాతనుండిన యీ జీవులే
కాతరాన వారిపుణ్యకతలే వినేరు గాని
యీతల శ్రీహరికత లెఱఁగరు జడులు ॥అయ్యో॥

యిర వెఱిఁగిన ముక్తు లెఱఁగని బద్ధులు
యిరవై మనలో నున్న యీ జీవులే.
సిరులమించినవాఁడు శ్రీవేంకటేశ్వరుఁడే
శరణాగతులు దక్క నక్కఁగారు జడులు ॥అయ్యో॥

రేకు 102 సంఖ్య 12 సంపు 2 పుట 9

సీ. ఇటునుండిపోయిన యీ జీవులే చుక్క
లై సురలై యుండినట్టివారు
వారిని జడులు దేవతలంచు మ్రొక్కెద
రెక్కుడౌ హరి నాత్మ నెఱుఁగలేరు;
పాతాళవాసులు బహులోకవాసులు
నీ జీవులేకదా యిందఱంద;
అవ్వారిగాథలే యాలకింతురుగాని
యెఱుఁగరు జడులు లక్ష్మీశుకథలు;
గీ. ఇర వెఱింగిన ముక్తులు, నెఱుఁగనట్టి
బద్ధులీ జీవులేగదా ! పన్నగాద్రి
పతికి శరణాగతులు దప్ప నతనిమాయ
గడచి యేనాఁటికిం జక్కఁబడరు జడులు.

### దేవగాంధారి

మేలు లేదు తీలు లేదు మించి నిదే హరిమాయ
కాలమందే హరిఁగంటె కైవల్య మొకటే ॥పల్లవి॥

సురలును జీవులే నసురలును జీవులే
ధర నిందుఁ బ్రకృతిభేదమే కాని
సురలకు స్వర్గ మసురలకు నరకము
పరగి నీ రెంటిగతి పాపపుణ్యమలే ॥మేలు॥

పొలఁతులు జీవులే పురుషులు జీవులే
తలఁప భావభేదములే కాని
బలిమి స్వతంత్రముఁ బరతంత్ర మొకరికి
యెలమి నిందులోఁ జెల్లె హీనాధికములే ॥మేలు॥

రాజులును జీవులే రాసి బంట్లు జీవులే
వోజతో సంపదచెల్లె దొకటే వేరు
సాజపు శ్రీవేంకటేశు శరణ మొక్కటే గతి
బాజుఁగర్మ మొందొకటి బంధమోక్షములు ॥మేలు॥

రేకు 113 సంఖ్య 78 సంపు 2 పుట 58

సీ. సురలును జీవు లసురులును జీవులే
ధర నిందుఁ బ్రకృతిభేదమ్మె కాని;
సురలకు స్వర్గ మసురులకు నరకమ్ము
కృతపుణ్యదుష్కృతప్రతిఫలమ్ము;
పురుషులు జీవులే పొలఁతులు జీవులే
తలపోయ భావభేదములె కాని;
ఒకరు స్వతంత్రు లింకొక్కరు పరతంత్రు
లందులోఁ జెల్లె హీనాధికములు;

గీ. రాజులును, బంట్లు జీవులే; యోజతోడఁ
జెల్లు సంపదయే వేఱు; శ్రీనివాసు
శరణమొక్కండె గతి కర్మసంక్షయమునఁ
బడయఁగనఁటకుఁ బరమకైవల్యలక్ష్మి.

శ్రీ రాగం

ఇంతేకాని తెలిసితే నెవ్వరూఁ గర్తలు గారు
బంతినే వీని కెప్పుడుఁ బ్రకృతి గారణము ॥పల్లవి॥

యివిగో గుణాలు మూఁడే యింద్రియాలఁ గూడుకొని
భువిఁ బ్రాణుల నెల్లానూ పూఁచి పనులుగొనేవి
కవిసి కర్మములై ఘనలోకాలఁ దిప్పేవి
అవలఁ బుట్టుగులకు నప్పటిఁ దెచ్చేవి ॥ఇంతే॥

పంచభూతా లివియే పరగ జీవుల కెల్లా
దించరాక యెప్పుడును దేహా లయ్యేవి
అంచెలఁ గంచములోఁ బదార్థములై వుండినవి
తెంచరాని పాశములై తీపులఁ బెట్టేవి ॥ఇంతే॥

మనసొక్కటే జంతులమర్మములు రేఁచేది
తనుభోగములలోనఁ దని విచ్చేది
అనయము శ్రీవేంకటాధిప నీ మహి మిది
నినుఁ గొల్చినదాసుల నెరవేర్చేది ॥ఇంతే॥

రేకు 144 సంఖ్య 199 సంపు 2 పుట 138

సీ. ఇవియ మూఁడుగుణమ్ము లింద్రియమ్ములఁ గూడి
ప్రాణుల పనిగొను పవలు రేలు
కవిసి కర్మమ్ములై ఘనలోకములఁ ద్రిప్పు
నవల పుట్టుగులకు నప్పగించుఁ
పంచభూతము లివే పరఁగ జీవుల కెల్ల
దించరా కెప్పుడు దేహము లయి
తెగనిపాశమ్ములై తీదీక్షలంబెట్టు
కంచమ్ములో వంటకమ్ము లగును;

గీ. మనసొకండె జంతువుల మర్మములు రేఁచి
తనివి నొడఁగూర్చు తనుభోగతతుల సతము
అహిమహీధరనాథ! నీ మహిమ యిద్ది
ధన్యుల నొనర్చు నినుఁగొల్చు దాసకోటి.

నాట

ఏదియును లేని దేఁటి జన్మము
వేదాంతవిద్యావివేకి గావలెను ॥పల్లవి॥

పరమమూర్తి ధ్యానపరుఁడు గావలె నొండే
పరమానందసంపద లొందవలెను
పరమార్థముగ నాత్మ భావింపవలె నొండె
పరమే తానై పరగుండవలెను ॥ఏది॥

వేదశాస్త్రార్థకోవిదుఁడు గావలె నొండె
వేదాంతవిదుల సేవించవలెను
కాదనక పుణ్యసత్కర్మి గావలె నొండె
మోదమున హరిభక్తి మొగి నుండవలెను ॥ఏది॥

సతతభూతదయావిచారి గావలె నొండె
జితమైన యింద్రియస్థిరుఁడు గావలెను
అతిశయంబగు వేంకటాద్రీశుసేవకులె
గతి యనుచు తనబుద్ధిఁ గలిగుండవలెను ॥ఏది॥

రేకు 49 సంఖ్య 301 సంపు 1 పుట 201

సీ. పరమమూర్తి ధ్యానపరుఁడు గావలె నొండె
పరతరానందాన వఱలవలయు
పరమార్థముగ నాత్మ భావింపవలె నొండె
పరమె తానై యుండి పరగవలయు
వేదశాస్త్రార్థకోవిదుఁడు గావలె నొండె
వేదాంతవిదుల సేవింప వలయు
కడఁకతోఁ బుణ్యసత్కర్మి గావలె నొండె
హరిభక్తియుక్తుఁడై యలర వలయు

గీ. భూతదయగల్గి, యింద్రియమ్ములజయమ్ము
గలిగి శేషాచలేశు కైంకర్యపరులె
సతము గతియను సద్బుద్ధి జరుగవలయు
నేదియును లేని పుట్టు వదేటి పుట్టు ?

## పా డి

వేతొక భావనలేల వీరితోఁ బెనఁగ నేల
చూచినందే హరిఁగూర్చి తుదగంటగాక ॥పల్లవి॥
చూచే కన్నులనేమీఁ జూడకుండవచ్చునా
చూచినందెల్లా హరిఁ జూచుటగాక
వేచిన వీనులనేమీ వినకుండవచ్చునా
కాచి యపె హరికథగా వింటగాక ॥వేతొక॥
కోరేటిసవుల జిహ్వ గోరకుండవచ్చునా
కోరిసవుల హరిఁ గూర్చుటగాక
ఆ రీతిఁ బారేమనసు అడఁచఁగవచ్చునా
ఆరితేరి అన్నిటాను హరిఁ గంటగాక ॥వేతొక॥
వొదలుమోచిన దేహి వోమకుండవచ్చునా
వొడలు శ్రీహరిదనే వోముటగాక
బడినే శ్రీవేంకటేశుఁబాసి వుండవచ్చునా
యెదయ కందె సుఖియించుటగాక ॥వేతొక॥

రేకు 131 సంఖ్య 123 సంపు 2 పుట 6?

సీ. కనెడు కన్నుల నేమి కనకుండ వచ్చునా ?
కనువానిలో హరిఁ గనుటగాక
వినెడువీనుల నేమి వినకుండవచ్చునా ?
వినుకు లాతనివిగా వినుటగాక
కొనెడు నాలుక చవిగొనకుండ వచ్చునా ?
వానిఁ గూర్చుటగాక వలయుచవుల
అఖిలమెంచు మనస్సు నణచంగ వచ్చునా ?
యతనినెంచుటగాక యఖిలమందు
గీ. ఓమకుండఁగవచ్చునా ? యొడలు దేహి
ఓముటయుగాక వానిదే యొడలటంచు
నుండవచ్చునె మంగేశు నండఁబాసి
యెడయు కందేను ఖించుట యింతగాక !

గు జ్జ రి

ఉపకారి దేవుఁడు అపకారిగాఁడు ॥పల్లవి॥

దేహం బొసఁగెను దేవుఁడు తనుఁ దెలియఁగ శాస్త్రము గడియించె
దేహాంతరాత్ముఁడు మరి దేహచైతన్యుఁడా దాను
దేహి యే లోకంబున కేఁగిన దేవుఁడు దా వెంటనే యేఁగును
దేహి కోరినట్టే కర్మ్మర దేవుఁ డనుమతి ఇచ్చీఁగాన ॥ఉప॥
చేయుటకును చేయకమానుటకును జీవుఁడు స్వతంత్రుఁడా యంటేను
కాయపుసుఖములు గోరఁగఁ గర్తట కడగనుటకుఁ గర్తగాఁడా
యీ యెడ నా యెడ నంతర్యామే యిన్నిటికిని బ్రేరకుఁ డింతే
దాయక పాయక తన తలఁపుకొలఁది దైవమే సృజియించీఁగాక ॥ఉప॥
ఇవి యెరిఁగి చిత్తమా నీ వితనందే అభిరతి సేయుము
సదయుఁడు మన శ్రీవేంకటగిరిసర్వేశ్వరుఁడు సత్యుఁడు
మొదలనే యీ యర్థము కిరీటితో మొగి నానతి ఇచ్చినాఁడు
అదే "సమోఽహం సర్వభూతేషు" అని గీతలలో నున్నదిగాన ॥ఉప॥

రేకు 177 సంఖ్య 384 సంపు 2 పుట 258

సీ. దేహం బొసంగెను దేవుండు జీవికి
తనుఁ దెలియంగ శాస్త్రము గడించె;
దేహి యేడకుఁజన్న దేవుఁ డేగును వెంట
దేవుం డనుమతించు దేహికోర్కి;
చేయఁ జేయకమాన జీవుండు కాఁడు స్వ
తంత్రుండు కర్తయుఁ దాను కాఁడు;
ఈ యెడ నా యెడ యిన్నిటికిం బ్రేర
కుఁడు సృష్టికర్తయు గోప్త యతఁడె;
గీ. ఇది యెఱిఁగి సేయు మభిరతి యితనియందె
సదయుఁ డుపకారి వేంకటాచలవిహారి
సర్వభూతమ్ములందున సముఁడ నంచు
నానతిచ్చెను గీతల నర్జునునకు.

**శంకరాభరణం**

చీచీ వో జీవుఁడా చింతించుకో జీవుఁడా
ఆ చందాన కీ చందము అరుహమా జీవుఁడా ॥పల్లవి॥

వుత్తముఁడైన హరి వుండేటి యాతుమలోన
తత్తరపుఁగాంతలను తలపోసేదా
వొత్తి నారాయణనామ ముచ్చరించే నోరను
రుత్తయధరపుఁదోలు రుచిగొనేదా ॥చీచీ॥

పొందుగా గోవిందునిఁ బూజించేటి చేతులను
సందడిఁ జన్నులమీఁద జాచఁబొయ్యేదా
కందువ దేవునిరూపు కనుఁగొనే చూపులు
ముందరి మర్మపుటంగములమీఁద బెట్టేదా ॥చీచీ॥

వేవేలు విష్ణుకథలు వినియేటి చెవులను
ఆపటించి యాడసుద్దు లాలకించేనా
శ్రీవేంకటేశ్వరుని సేవించే యీ జీవనము
భావించక విషయాలపాలు సేసేదా ॥చీచీ॥

రేకు 120 సంఖ్య 115 సంపు 2 పుట 77

సీ. ఉత్తముం డగు హరి యుండెడు నాత్మలో
తత్తరంపుఁజెలులఁ దలఁప నగునె ?
ఒత్తి శ్రీహరినామ ముచ్చరించెడి నోర
రుత్తపెదవితోలు రుచిగొనెదవె ?
పొందుగా గోవిందుఁ బూజించుచేతుల
సందడివనులపైఁ జాచ నగునె ?
ఘనుఁడు దేవునిరూపు కనుఁగొను చూపుల
మర్మాంగములమీఁద మలపఁదగునె ?

ఆ. విష్ణుకథలు వేలు వినియెడి చెవులతో
నాడువారిసుద్దు లాలకింతె ?
శ్రీనివాసవిభుని సేవించు బ్రదుకును
చెడు విషయముపాలు సేయనగునె ?

సాళంగనాట

కందిమి రెంటికి భూమిఁగలుగు దృష్టాంతము
గొంటరి రావణునందు గుహునియందు ॥పల్లవి॥

నీ దాస్యముగల నీచజన్మమైన మేలు
యేదియు నెఱఁగనట్టి యెక్కువజన్మానకంటే
వాదపుగర్వములేదు వట్టి యాచారములేదు
సాదించి నైచ్యానుసంధానమేగాని ॥కంది॥

మిమ్ముఁ దలపుచుఁ జేయు మృగయానమైన మేలు
సొమ్ము పోక మీకుఁగాని సుకృతముసేయుకంటె
దిమ్మరిజన్మములేదు తెగని కోరికలేదు
పమ్మి నీపైఁబెట్టినట్టి భారమేకాని ॥కంది॥

దిక్కులు సాధించుకంటె తెలిసి శ్రీవేంకటేశు
దిక్కు నీ నామమే కా సాధించుటే మేలు
యెక్కువ తక్కువ లేదు యెఱు కెఱఁగమి లేదు
చక్కజాడతో నీకు శరణంటేఁగాని ॥కంది॥

రేకు 115 సంఖ్య 86 సంపు 2 పుట 58

సీ. కంటిమి రెంటికిఁ గలుగు దృష్టాంతంబు
గొంటు రావణునందు గుహునియందు
నీదుదాస్యముగల నీచజన్మమె మేలు
మతిలేని యగ్రజన్మమునకంటె
వట్టియాచారమ్ము వాదగర్వము లేదు
పూను నైచ్యానుసంధాన మింతె
మిముఁ దలంపుచుచేయు మృగయానమే మేలు
నినువీడి సేయు పున్నియముకంటె
దిమ్మరిజన్మంబు తెగని కోరికలేదు
పమ్మి నీపైనిడు బరువెకాని

గీ. దెసలు సాధించుకంటె చింతింప నీదు
నామసాధనయే మేలు నాగశయన!
ఎచ్చు లొచ్చులు నెఱుఁగమి యెఱుక లేదు
నీకు శరణంటయే గాని నియమితోడ.

ధన్నాసి

ఎఱఁగక వేసారు నిల జీవుఁడు
మెఱసి నిండుకున్నాఁడు వేఁటి యీ దేవుఁడు ॥పల్లవి॥
 పూరకే పరాకై యట్టుండును దేవుఁడు
 నారుకొన మఱిలోఁ దనపైనే చింత
 గారవాన మరి పలుకనియట్టే వుండును
 యీ రీతి మాటాడించేవాఁ డిన్నిటా నితఁడే ॥ఎఱఁ॥
యెందులేని యట్టేవుండు నెంచి చూచితే దేవుఁడు
చెంది లోకశరీరియై చెలరేఁగీని
అందరాక యెక్కడాను అడఁగినట్లనే యుండు
యిందరిఁ బోషించేవాఁడు యెప్పు డూ నితఁడే ॥ఎఱఁ॥
 చేరి లోనుగా నెట్టుండు శ్రీవేంకటేశదేవుఁడు
 కోరినవరము లిచ్చు గురుతుగాను
 వారక యలమేల్మంగవల్లభుఁ డిట్టిదేవుఁడు
 యీ రూపుతోనుండు నిందరిలో నితఁడే ॥ఎఱఁ॥

రేకు 171 సంఖ్య 344 సంపు 2 పుట 231

తగ పరాకైన చందమున నుండును దేవుఁ
 డాత్మలోపల జీవునందె చింత
కనఁగ దేవుఁడు పలుకనియట్టు లుండును
 నతఁడె మాటాడించు నన్ని యెడల
ఎంచి చూడఁగ దేవుఁ డెందు లేనట్లుండు
 భువనశరీరియై పొలుపుమీఱు
అందరా కెక్కడ నణఁగినట్లే యుండు
 యిందఱిఁ బోషించు నెప్పు డితఁడె

గీ. లోనుగానియట్లుండును శ్రీనివాసుఁ
 డడిగిన వరమ్ము లిచ్చు నిజాశ్రితులకు
 జీవుఁ డెఱుఁగక వేసారు; చింతసేయు
 దేవుఁ డందఱిలో నిండి తేజరిల్లు.

భై ర వి

హరిఁ గొలిచియు మరి నపరములా
తిరముగ నతనినే తెలియుట గాతా ॥పల్లవి॥
పంకజనాభుని పాదములు దలఁచి
యింకా మరియొక యితరములా
అంకెల నతనినే అతనిదాసులనే
కొంకక నిజముగఁ గొలుచుటగాకా ॥హరి॥

పన్నగశయనుని బంట్లకు బంటై
కొన్నిటిపై మరి కోరికెలా
యిన్ని కోరికలు యిదియే తనకని
కొన్నది కోలై కోరుటగాకా ॥హరి॥
వీనుల వేంకటవిభు నామామృత
మానిన మతి మరియును రుచులా
తేనెలుగారెడి తీపు లతని నుతి
నానారుచులై ననుచుటగాకా ॥హరి॥

రేకు 47 సంఖ్య 290 సంపు 1 పుట 198

సీ. పంకజనాభుని పాదంబులు దలంచి
యితరంబు లెంచుటా యింక నింక
ఆ జగన్నాథు నే యతని సేవకులనే
యుడుగక కొల్చుచు నుంటగాక
పన్నగశయనుని బంట్లకు బంటయి
కొన్నింటిపై మఱి కోర్కు లటవె ?
ఇన్ని కోర్కులు తమ కివియే యటంచును
గొంకక హరిఁ గోరుకొంటగాక
గీ. అంజనాచలవిభుని నామామృతంబు
నాను వీనులకున్ మఱి యన్యరుచులె ?
తేనె లుట్టు రమాపతి దివ్యనుతుల
నుల్లమునఁ గలవుగాఁ గ్రోలుచుంటగాక.

## శ్రీ ని వా స తే జ ము



గౌళ

విచరించుకోనివారి వెఱ్ఱితన మింతేకాక
తవిలి రెంటికి గురి తామే కాదా ॥పల్లవి॥

కడుఁ బాపకర్మానకుఁ గలిగినట్టి బలిమి
నడుమఁ బుణ్యకర్మమునకు లేదా
అడరి నరలోకమందుఁ గలిగిన విధి
కడుమంచి స్వర్గలోకమునకు లేదా ॥విచ॥

తప్పక బంధములను తగిలించే కోరికె
ముప్పిరిఁ గొనేటి మోక్షమునకు లేదా
కప్పి యట్టె కల్లలాడఁగలిగిన నాలికె
దప్పిదీర శ్రీహరిఁ దలఁచఁగ లేదా ॥విచ॥

పంచకొన్న విషయాలబారిఁ జిక్కే జీవుఁడు
అంచెల వైరాగ్యమునందు లేఁడా
పంచల నరులవెంటఁ బారాడించే మనసు
కొంచక శ్రీవేంకటేశుఁ గొలిపించలేదా ॥విచ॥

రేకు 225 సంఖ్య 189 సంపు 2 పుట 98

సీ. కడుపాపకర్మకుఁ గలిగిన యా బల్మి
పుణ్యకర్మమునకు పొందుపడదె ?
అదటు నరలోకమందుఁ గల్గిన విధి
స్వర్గలోకమున కెంచంగ లేదె ?
తప్పక బంధాల తగిలించుకోరిక
ముప్పిరిగొన మోక్షమునకు లేదె ?
కల్లమాటల నాడఁగలిగిన నాలుక
సరసిజాక్షునిఁదలచంగ లేదె ?

గీ. చెంత విషయాలబారిని జిక్కు జీవుఁ
డంచెలంచెల వైరాగ్యమందు లేఁడె
నరులవెంటఁ బాఱాడించు నాలిమనసు
వేంకటాచలవిభుఁ గొలిపించ లేదె ?

బౌళి

కొలఁది పుణ్యపాపాలే కొంగురొక్కములు వెట్టి
వెలదెంచి వేరమాడ వేగిరమే రారో ॥పల్లవి॥

జననాలు మరణాలు సంసారభోగములును
అనిశము భూమిమీఁద నగ్గువలు
కొనేవారుఁ దినేవారు కూడికూడి మూఁకల్లై
దినసంత లెక్కె నిదే దేహులాల రారో ॥కొలఁ॥

అంగనలు వలపుల అంగళ్లు వెట్టిరదే
చెంగట పయసులనే చింతలకింద
సంగతిఁ గాయమనే సంచుల నించుకొందము
చెంగిపోరాదు మనకు జీవులాల రారో ॥కొలఁ॥

లంపటాలు సంపదలు లలి నంబారాసు లాయ
ఇంపుల ముంచి తలల కెత్తుకోరో
దింపక ఇందులోననే తిరిగి శ్రీవేంకటేశు
పంపున లాభముచేరె ప్రాణులాల రారో ॥కొలఁ॥

తేకు 230 సంఖ్య 170 సంపు 8 పుట 114

సీ. పాపపుణ్యములను పైకమ్ము చెల్లించి
వెలదెంచి గైకొన వేగరారొ
జననాలు మరణాలు సంసారభోగమ్ము
లనిశంబు భూమిపై నగ్గలములు
కొనువారు తినువారు కూడి మూఁకలుగట్టి
దినసంత లెక్కిరి దేహులార !
అంగనల్ వలపులయంగళ్లు వెట్టిరి
చిఱుప్రాయ మను చింతచెట్లుక్రింద
తనువు లనెడి సంచులను నించుకొందము
చెంగిపోవకరారొ జీవులార !

గీ. లంపటమ్ములు సంపదల్ రాసు లాయె
నింపులను ముంచి తలలకు నెత్తుకొనరొ
యిందులోననె తిరిగి మంగేశునాజ్ఞ
చేరులాభమ్ము మఱి ప్రాణులార ! రారొ !

ముఖారి

సులభపుమార్గములు చుట్టి రానే వుండఁగాను
బలుప్రియాసపుకర్మబద్ధు లైరి జీవులు ॥పల్లవి॥
శ్రీపతిభక్తి యనేటి చింతామణి వుండఁగాను
యేపున మోసపొయ్యేరు యేలో జీవులు
చేపట్టి నామాంకితపుసిద్ధరసము గలిగి
కోపుల నుడిగి పనిగానరేలో జీవులు
ఆక్కడనే శరణాగతనే వోడ వుండఁగాను
యెక్కి భవవార్ధి దాఁటరేలో జీవులు
తక్కక దాస్య మనేటిధనము దమ కుండఁగా
లెక్కించి కూడపెట్టుకోలేరు యేలో జీవులు ॥సుల॥
అట్టె శ్రీవేంకటేశుఁ డంతరాత్మై వుండఁగాను
పట్టి కొలువరేలో పైపై జీవులు
పట్టపుహరిదాసులు ప్రత్యక్షమై వుండఁగాను
యిట్టె వారికృప చేరు టెన్నఁడో యీ జీవులు ॥సుల॥

రేకు 249 సంఖ్య 279 సంపు 3 పుట 169

సీ. సులభమార్గమ్ములు చుట్టుండ, జీవులు
బలుప్రియాసలఁ గర్మబద్ధు లైరి
దనుజారిభక్తిచింతామణి యుండంగ
మోసపోయెద రేల మూఢమతులు
శ్రీపతినామంపుసిద్ధరసము గల్గ
నింపుల పనిగొనరేల జనులు ?
శరణాగతి యటన్న వరనౌక యుండంగ
తలభవజలరాశి దాఁటు రేల ?
దాస్యంబను ధనము తమకుండ లెక్కించి
కూడఁబెట్టుకొనంగఁ జూడ రేల ?
గీ. అంతరాత్మయైయుండ శేషాద్రివిభుఁడు
పట్టి కొలువంగలేరేల ప్రత్యహంబు
తవిలి ప్రత్యక్షముగ హరిదాసు లుండ
వారికృపఁ గాంచరేలొకో ప్రాణు లకట !

బౌళి

మఱచిన వెఱచిన మతి లేదు
యెఱిఁగిన సులభుఁడు యీ హరి యొక్కఁడే ॥పల్లవి॥

ఆతుమ తొల్లిటిదే అంతరాత్మ తొల్లిటిదే
నీతితో యీ దేహములే నిత్యకొత్తలు
యీ తల నేర్పరులకు నిందే యిహపరములు
చేతిలో నున్నవి యిది చింతించరో జనులు ॥మఱ॥

కాలము నెందూఁ బోదు కర్మము నెందూఁ బోదు
జాలిఁబడ్డ మనసే పావి వోయను
పోలింప వివేకులకు పుణ్యమునుఁ బాపమును
వేళవేళనే వున్నవి వెదకరో జనులు ॥మఱ॥

ఆఁకలినిఁ దీరదు అన్నమునుఁ దీరదు
తేఁకువ తన ధైర్యమే తీరెఁగాని
తాఁకి శ్రీవేంకటేశుదాసులైతేఁ జాలుఁగాని
కాఁకదీరు నిందరికిఁ గనుకోరో జనులు ॥మఱ॥

రేకు 219 సంఖ్య 104 సంపు 3 పుట 70

సీ. మఱచిన వెఱచిన మతిలేదు మదిలోన
నెఱిఁగిన సులభుఁ డీ హరి యొకండె
ఆత్మ తొల్లిటి దంతరాత్మ తొల్లింటిదే
యీ శరీరమ్ములే యెపుడు క్రొత్త;
లీతల నేర్పరి కిహపరమ్ములు తన
యఱచేతివైయుండు నరయ రయ్య!
కాల మెందును బోదు కర్మ మెందును బోదు
జాలిఁబడ్డ మనసె పావిఁ బోయె
పోరి వివేకులకెల్లఁ బుణ్యమ్ముఁ బాపమ్ము
వేళవేళఁ గలవు వెతక రయ్య!

గీ. తీఱ దన్నమ్ము నాఁకలి తీఱ దింక
తేఁకువను తన ధైర్యమే తీఱెఁగాని
వాసి శ్రీవేంకటేశ్వరదాసులైన
గాఁక దీఱు నిందఱికిన గనరొ జనులు!

## శుద్ధవసంతం

పసిగొనువారల భాగ్య మిది
వెనక ముందరికి వివేక మొకటే ॥పల్లవి॥

బలుపుణ్యములకుఁ బాపములకు గురి
కలియుగ మొకటే కలది
చెలఁగి చేయుటకు చేయించుటకును
తలఁపూ నొకటే తనలోఁ గలది ॥పసి॥

మోదపుభోగము మోక్షమునకు గురి
యీ దేహ మొకటె యెత్తినది
గోదలి కడఁ గుంగుటకు నెక్కుటకు
యీ దెస విజ్ఞానమే కలది ॥పసి॥

అర్మిలిదుఃఖము నతిసుఖములకు గురి
కర్మం బొకటే కలది
కూర్మి శ్రీవెంకటగురుదైవముఁ గను
ధర్మమున కతని దాస్యమే కలది ॥పసి॥

రేకు 802 సంఖ్య 7 సంపు 10 పుట 5

సీ. బలుపుణ్యములకును బాపమ్ములకు గుఱి
కలియుగ మొక్కటే గలది నిజము
చెలఁగి చేయుటకును చేయించుటకుఁ గాని
తనలోనఁ గలది యీ తలఁపొకండె
మోదపుభోగమ్ము మోక్షమ్మునకు గుఱి
తాను ధరించిన తనువె గలదిః
దిగఁ గ్రుంగుటకు మీఁది కెగయుటకును మఱి
యొప్పైన విజ్ఞాన మొకటె గలది
తే. కష్టసుఖములకును గుఱి కడఁగి చేయు
కర్మ మొక్కటె గలది వేంకటగిరీశు
సత్కృపంగాంచ నతనిదాస్యమ్మె గలది
పరఁగ పసిగొనువారల భాగ్య మిద్ది.

సామంతం

ఊరకే వెదకనేల వున్నవి చదువనేల
చేరువనె వున్నదిదె చెప్పరాని ఫలము ॥పల్లవి॥
కోపము విడిచితేనె శాపము దానేపోవు
దీపింప సుజ్ఞానము తెరు విదివో
లోపల మలినుఁడై లోకము మెచ్చుకొరకు
పైపైఁగడిగితేను పావనుఁ డౌనా ॥ఊర॥
ముందరికోరిక వోతే ముంచిన బంధాలువీడు
కందువ నాసమానితే కైవల్యము
బొందిలోన నొకటియు భూమిలోన నొకటియు
చిందు వందు చిత్తమైతే చేరునా వైకుంఠము ॥ఊర॥
కాంతలపొం దొల్లకుంటే ఘనదుఃఖమే లేదు
అంతరాత్మ శ్రీవెంకటాద్రీశుఁడు
అంతట మాటరె యాడి హరి శరణనకుంటె
దొంతినున్న భవములు తొలఁగునా వివేకికి ॥ఊర॥

రేకు 384 సంఖ్య 196 సంపు 10 పుట 131

సీ. కోపమ్ము విడిచిన పాపమ్ము వెడలును
దీపింప జ్ఞానమ్ము తెరువు నిదియె
లోపల మలినుఁడై లోకంబుమెప్పుకై
పైపయిఁ గడుగఁ బావనత గనునె ?
ముందు కోరికవోవ మొగి బంధములు వీడు
కైవల్య మొదవును కాంక్ష లుడుగ
బొందిలో నొకటిగా భూమిలో నొకటిగా
మనసున్న వైకుంఠ మెనయఁగలదె ?
గీ. చెలులపొం దొల్లకుండిన చింతలేదు
అంజనమహీధరాధిపుఁ డంతరాత్ముఁ
డంతటను మాటలే యాడి యతనిశరణు
గనక భవములు తొలఁగునే ఘనులకేని.

### ఆ హి రి

ఎందరివెంటల నేఁగేము
చందపుహరి నీ శరణనియెదము ॥పల్లవి॥
పెంచినఁ బెరుఁగును పెక్కుబంధములు
తుంచినఁ దునుఁగును దుఃఖములు
యెంచఁగ నేటికి యింద్రియమహిమలు
చంచల హరి నీ సూత్రము లివియే ॥ఎంద॥
పఱపిన బాఱును బహుళపుటాసలు
తఱపిన దఱగును తన మదము
వెఱవఁగ నేఁటికి వెడకర్మములకు
కఱకులహరి నీ కల్పిత వివియే ॥ఎంద॥
చేసినఁ జెలఁగును జిగి సంసారము
మూసిన ముఱుఁగును మోహములు
యీసుల శ్రీవేంకటేశ్వర యివి నీ
దాసులఁ దడవవు తగు నీ మహిమ ॥ఎంద॥

రేకు 245 సంఖ్య 265 సంపు 10 పుట 177

సీ. పెంచినఁ బెరుఁగును పెక్కుబంధమ్ములు
త్రుంచినఁ దునుఁగును దుఃఖపటలి
ఎంచఁగ నేఁటికి నింద్రియమహిమలు
నీదుసూత్రము లివ్వి నీరజాక్ష!
పఱపినఁ బాఱును బహుళంపుటాసలు
తఱచినఁ దఱుగును తన మదమ్ము
వెఱవంగ నేఁటికి వెడకర్మములకును
నీ కల్పితము లివ్వి నిగమవినుత!
గీ. సల్పినను సాగుచుండు సంసార మెపుడు
మూసిన ముఱుంగు మోహముల్ మూల మరసి
నిన్ను సద్భక్తి సేవింప నీదుమహిమఁ
దడవ వయ్యెవి దాసుల దైత్యహరణ!

బౌళి

అడ్డములేని నాలిక వాడుమరుగాక భూమి
దొడ్డవాఁ డేమిసేసినా దోసమందు నేది ॥పల్లవి॥

ఆతుమలో మదనుఁ డయ్యేవాఁడవు నీవే
ఆతల నాలిమగఁడః సనే వారలు నీవే
ఘాతల పరాంగనఁ గలసితి వని నిన్ను
తోతో మునుల కీఁక దూరఁ జోచేదయ్యా ॥అడ్డ॥

దేహములోపలనున్న దీపనాగ్నియు నీవే
దాహము నాఁకలి నీనే తగు రుచులెల్ల నీవే
ఆహా శబరియెంగి లారగించి తనుమాట
సోహల నీఁదిఁచి నవ్వఁ జోటిందునేది ॥అడ్డ॥

పుట్టుగు లోపలనున్న భోగము లన్నియు నీవే
యిట్టె ఆదారములు హీనాధికములు నీవే
గుట్టున శ్రీవెంకటేశ గొల్లఁడవై పుట్టినందు
కుట్టిపడి యెవ్వరికి నూహించఁ జోటేది ॥అడ్డ॥

రేకు 315 సంఖ్య 89 సంపు 10 పుట 60

సీ. అడ్డు లేదని నాల్క నాడుచుందురుగాక
దొడ్డవాఁ డొనరింప దోసమేమి ?
ఆత్మలో మదనుండ వగువాఁడవు నీవె
పతిపత్ను లనియెడివారు నీవే
కలసితి వన్యకాంతల నంచు నిను దూఱ
గరుడాద్రివాన ! యెక్కడిది చోటు ?
దేహమ్ములోపలి దీపనాగ్నియు నీవె
తగురుచు లాఁకలి దప్పు లీవె
అహో ! శబరియెంగి లారగించితి వని
పొడ్డిడి నిందింపఁ జోటేది ?
గీ. పుట్టువులలోని భోగంపుపుంజ మీవె
అట్టె యాచారములును హీనాధికమ్ము
)వె గొల్లఁడవై జనియించినందు
కెవ్వరికి నిన్ను నెగ్గింప నేదిచోటు ?

## బౌళి

హరి సర్వాత్మకుఁ డాదిమపురుషుఁడు
హొరి నెరుఁగువారి పుణ్యముగాన ॥పల్లవి॥

నాలుక కొసనే నారాయణుఁ డిదె
వైకుంఠము దలఁచని వారిదె పాపము
నేలయు మిన్నును నిజవైకుంఠము
పోలించి చూడని పురుషుల వెలితి ॥హరి॥

మనసులోననే మాధవుఁ డున్నాఁడు
కనుఁగొననివారి కడ మింతే
తనువే విష్ణుని తత్వసాధనము
వొనరఁగ శ్రీపతి యున్నాఁడు గాన ॥హరి॥

చేరువ నిదివో శ్రీవెంకటపతి
ధరణిఁ గొలిచెటి దాసులభాగ్యము
కారణ మితఁడే కలిగిన దైవము
కోరినవారల కొంగుబసిఁడి ॥హరి॥

రేకు 344 సంఖ్య 261 సంపు 10 పుట 175

సీ. హరియె సర్వాత్మకుం డాదిమపురుషుండు
పొరి నెఱింగెడివారి పుణ్యమంతె
నాలుకకొనమీఁద నారాయణుం డిదె
వైకుంఠమ దలఁచనివారి దపము;
నేలయునింగియు నిజవైకుంఠపురమ్ము
పోలించి కననిదే పురుష వెలితి;
మానసమందున మాధవుఁ డున్నాఁడు
కాననివారిదే కడమఁ గాని
తనువె మహావిష్ణుతత్త్వసాధన మగు
వలనుగ హరి యున్నవాఁడుగాన

గీ. చెంత నితండె వేంకటశిఖరివిభుఁడు
వసుధఁ గొలిచెడిదాసుల భాగ్య మింతె;
కారణ మితండె; కలిగిన ఘనుఁ డితండె
కోరువారల కితండె కొంగుపసిఁడి.

## సా మ ం త ం

బాలదా బ్రహ్మ మిది సంకీర్తనం మీకు
జాలెల్ల నడఁగించు సంకీర్తనం ॥పల్లవి॥

సంతోషకరమైన సంకీర్తనం
సంతాప మణఁగించు సంకీర్తనం
జంతువుల రక్షించు సంకీర్తనం
సంతతముఁ దలఁచుఁ డీ సంకీర్తనం ॥చాల॥

సామజముఁ గాచినది సంకీర్తనం
సామమున కెక్కు డీ సంకీర్తనం
సామీప్య మిందరికి సంకీర్తనం
సామాన్యమా విష్ణుసంకీర్తనం ॥చాల॥

జముబారి విడిపించు సంకీర్తనం
సమబుద్ధి వొడమించు సంకీర్తనం
జమళి సౌఖ్యము లిచ్చు సంకీర్తనం
శమదమాదులఁ జేయు సంకీర్తనం ॥చాల॥

జలజాసనునినోరి సంకీర్తనం
చలిగొండసుత దలఁచు సంకీర్తనం
చలువ గడు నాలుకకు సంకీర్తనం
చలపట్టి తలఁచుఁ డీ సంకీర్తనం ॥చాల॥

సరవి సంపద లిచ్చు సంకీర్తనం
సరిలేని దిదియపో సంకీర్తనం
సరుస వేంకటవిభుని సంకీర్తనం
సరగుననుఁ దలఁచుఁ డీ సంకీర్తనం ॥చాల॥

రేకు 68 సంఖ్య 348 సంపు 2 పుట 229

సీ. చాలదా బ్రహ్మ మీ సంకీర్తన; మ్మణ
గించు దైన్యమ్ము సంకీర్తనమ్ము;
సంకీర్తన మ్మిది సంతాపముం బాపుః
సంకీర్తనము సంతసం బొసంగు;
సామీప్య మొదవించు సంకీర్తనముః హరి
సంకీర్తనము ప్రోచె సామజమును;
జముబారి విడిపించు సంకీర్తనముః కాచు
సంకీర్తనము సర్వజంతువులను;
జలజాసనుని నోరి సంకీర్తనం బిదిః
గిరిసుత దలఁచు సంకీర్తనంబు;
సరవి సంపద లిచ్చు సంకీర్తనము; విష్ణు
సంకీర్తనమునకు సాటిలేదుః

గీ. జమలిసౌఖ్యంబు లొసఁగును; శమదమాది
సద్గుణంబులు గలిగించు; సామమునకు
నెక్కుడై నది; సమబుద్ధి నెసఁగఁ జేయు
కృపగల వృషాద్రివిభుని సంకీర్తనంబు.

మే ఘ ర ం జి

పట్టిజాలిఁబడవలె దీఁకను
గట్టివిచారము గలవారికిని ॥పల్లవి॥

దేవుఁడు సులభుఁడు తెలియఁగ నేర్చిన
వేవేలు లాభము విరతి
భావించు జ్ఞానమె పొదైన సౌఖ్యము
తావగు శాంతమె ధనధాన్యములు ॥పట్టి॥

గురుఁడె సాధనము కోరి వెదకినను
పరగు నాచారమె బ్రదుకెల్లా
శరణాగతియె సామ్రాజ్యపదవి
ధర జితేంద్రియత్వమె వైభవము ॥పట్టి॥

తన నిజభక్తియె దండయు దాపును
మనసు నిలుపుటే మరి శుభము
యెనయఁగ శ్రీవెంకటేశుమహిమ లివి
కని మని యుండుటె ఘనవివేకము ॥పట్టి॥

రేకు 330 సంఖ్య 178 సంపు 10 పుట 116

సీ. దేవుఁడు సులభుండు తెలియంగ నేర్చిన
వేవేలు లాభము విరతి దలఁప;
భావించుజ్ఞానమే పొదైన సౌఖ్యంబు;
ధనము ధాన్యమ్ము శాంతమె ధ్రువంబు;
గురుఁడె సాధనముపో కోరి యన్వేషింప;
ఆచారపరతయే యగును బ్రదుకు;
సామ్రాజ్యపదవియే శరణాగతి యనంగ;
వరజితేంద్రియతయే వైభవమ్ము;

గీ. తనదు పరభక్తి దండయు దాపు తనకు;
మనసునిలుపుటయే యసమానశుభము;
జాలిఁబడనేల ? వేంకటేశ్వరుమహిమలు-
వీనిఁ గనుఁగొని మనుట వివేక మరయ.

## సామంతం

కొసరి కొసరి యిఁకఁ గోరఁగ నేఁటికి
అసురవైరి శరణనుటే చాలు ॥పల్లవి॥

సంతతభోగము జననబంధములు
జంతురాసులకు సహజము
వంతు రక్షకత్వము కరుణ భువి
నంతర్యామికి నది సహజము ॥కొస॥

కలకాలంబును గామముఁ గ్రోధము
చలమును బ్రాణుల సహజము
సులభత్వంబును సొరిది వదాన్యత
అల లక్ష్మీపతి కది సహజము ॥కొస॥

వుడుగని కర్మము లొడలోముటలును
జడులము మాకిది సహజము
యెడయక శ్రీవెంకటేశ నీకు మము
నడరి కాచుటే అది సహజము ॥కొస॥

రేకు 303  సంఖ్య 16  సంపు 10  పుట 10

సీ. సంతతభోగమ్ము జననబంధమ్ములు
జంతువర్గమునకు సహజగుణము;
భూరికారుణ్యంబు భువిరక్షకత్వంబు
సకలాంతరాత్మకు సహజగుణము
కలకాలమును తుచ్ఛకామమ్ము క్రోధమ్ము
చలము ప్రాణుల కెల్ల సహజగుణము
బహుసులభత్వంబు పరమవదాన్యత
క్ష్మారమాప్రియునకు సహజగుణము
గీ. ఉడుగనట్టికర్మం బొడ లోముటయును
జడుల మగు మాకు నెప్పుడు సహజగుణము
శరణనిన మమ్ముఁ బ్రోచుట సంతతంబు
సప్తగిరినాయకా! నీకు సహజగుణము.

మాళవిగౌళ

విచారించుకొనేవారి వివేకాలకొలఁదులు
పచారించు వున్న వెల్ల భావనమాత్రములు ॥పల్లవి॥
జగము లన్ని నీ శరీరమే కనక
తగు వైకుంఠాలే వుండే తావు లెల్లాను
పొగరు స్వర్గనరకభూము లనే లోకా లెల్ల
పగటున తమలోని భావనమాత్రములు ॥విచా॥
అన్ని పదార్థాలు నీయందే పుట్టివచ్చెఁగాన
తిన్నని నీ ప్రసాదాలే దినభోగాలు
వన్నెల నిష్టానిష్టవస్తు భేదము లెల్లాను
పన్నుకొన్నయటువంటి భావనమాత్రములు ॥విచా॥
అంతరాత్మవు శ్రీవెంకటాధిప నీవే కాన
చెంతల నీకైంకర్యాలే చేఁత లెల్లాను
వింతలైన సంసారవిహారము లెల్లాను
బంతినే నానావిధభావనమాత్రములు ॥విచా॥

రేకు 805 సంఖ్య 20 సంపు 10 పుట 20

సీ. నీ శరీరమె గాన నిఖిలజగంబులు
వైకుంఠములె యున్కిపట్టు లెల్ల
పరువడి నరకమ్ము స్వర్గలోకమ్మును
మఱి నిజభావనామాత్రము లగు;
నీయందుఁబుట్టె నన్ని పదార్థములు గాన
నీ ప్రసాదమ్మెపో నిత్యభుక్తి
వఱలు నిష్టానిష్టవస్తుభేదము లెల్ల
మఱి నిజభావనామాత్రము లగు

గీ. అంతరాత్మ వీవేగాన ఆదిపురుష !
చెంత నీదుకైంకర్యాలె చేఁత లెల్ల
అబ్బురంపుసంసారవిహారము లవి
మల్లడించెడి భావనామాత్రము లగు.

## బౌళిరామక్రియ

జ్ఞానం బొకటే జగమున కధికం మరి
నానావిధములు నటనలు ॥పల్లవి॥
బహుదానఫలము పడయుట కంటే
యిహమున వైరాగ్య మెక్కుడు
సహజకర్మములు శతములకంటే
అహిశయనుని భక్త్యధికము ॥జ్ఞానం॥
ధరఁ దపము లనంతంబులకంటే
గరిమల శాంతము ఘనము
విరసాచారము వేవేలకంటె
హరినామపఠన మధికము ॥జ్ఞానం॥
ఆవల వ్రతములు అన్నిటికంటే
శ్రీవైష్ణవమే శేఖరము
శ్రీవెంకటేశ్వరు చేఁతలె యివిగన
సేవ యిదొకటె చింతింప ఘనము ॥జ్ఞానం॥

రేకు 339 సంఖ్య 281 సంపు 10 పుట 155

సీ. బహుదానఫలములు పడయఁ గనుటకంటె
నిహమున వైరాగ్య మెక్కు డగును;
శతసహస్రంబులు సహజకర్మలకంటె
నహిశయనునిభక్తి యధికతరము
ధరణి ననంతముల్ తపములకంటెను
కడుకొను శాంతమే కడుఘనంబు
అగణితములు విరసాచారములకంటె
హరినామపఠనమే యగ్గలంబు
గీ. నేమమునఁ జల్పు వ్రతము లన్నింటికంటె
వసుధలో సిగబంతి శ్రీవైష్ణవంబె
సంకటంబులు వాపెడు వేఁ
దేవు సేవయొకండె చింతింప దొడ్డ.

బౌళి

చదివి చదివి వట్టిజాలిఁబడుటింతే కాక
యెదుట నిన్నుఁ గానఁగ నితరుల వశమా ॥పల్లవి॥

ఆకాశముపొదవు ఆకాశమే యెరుఁగు
ఆకడ జలధిలోఁతు ఆ జలధే యెరుఁగు
శ్రీకాంతుఁడ నీఘనము చేరి నీవే యెరుఁగుదు
యీకడ నింతింతన నితరుల వశమా ॥చది॥

నదులయిసుక లెల్ల నదులే యెరుఁగును
కదిసి గాలియిరవు గాలికే తెలుసు
ఆదన నాత్మగుణము లంతరాత్మ నీ వెరుఁగు
యిది యది యని చెప్ప నితరుల వశమా ॥చది॥

శ్రీవెంకటేశ యిన్ని చింతలకు మొదలు
యీవల నీ శరణంటే యిటు నీవే యెరిగింతు
దైవమా నీ కల్పనలు తగ నీవే యెరుఁగుదు
యీవల నొఁగాదన నితరుల వశమా ॥చది॥

రేకు 321 సంఖ్య 121 సంపు 10 పుట 81

సీ. అంబరౌన్నత్య మా యంబరమ్మె యెఱుంగ;
జలనిధిలోతు తజ్జలధి యెఱుఁగు
నీ గొప్పతనమెల్ల నీవ యెఱుంగుదు
వింతింతయని చెప్ప నెవరితరము ?
నదులయిసుకలెల్ల నదులే యెఱుంగును
గాలియ యెఱుఁగు నా గాలియిరవు
ఆత్మగుణంబుల నంతరాత్మవు నీవ
యెఱుఁగుదు తెల్పఁగా నొరుల వశమె ?

గీ. చదివి చదివియు వ్యర్థమో జాలియేల ?
యిన్ని చింతలకున్ మొదలేదో దాని
నీవ యెఱిఁగింతు 'శరణన్న'; నీదుకల్ప
నల నెఱుఁగ శక్యమే యితరులకు దేవ !

### శ ం క రా భ ర ణ ం

కొలువుఁడు వలసితేఁ గొలువక మానుఁడు
తెలియ నీతఁడే సుండి దేవదేవోత్తముఁడు ॥పల్లవి॥

పుడమి కాధారము పురుషోత్తముఁడె
కుడిచి కట్టెడివాడ కోటానఁగోటి
విడువఁ డేఁటికిఁ బారవేసినగుంటికి నెల్ల
నొడయఁ డీతఁడె సుండీ వున్నతోన్నతుఁడు ॥కొలు॥

అమృత మిచ్చినవాఁడు ఆదినారాయణుఁడె
సముతై జీవించువారు సంతానసంఖ్య (?)
భ్రమయకుఁ డెండమావిబయళ్లు చెరువు లంటా
అమర నీతఁడే సుండి హరి వాసుదేవుఁడు ॥కొలు॥

చెలువుఁ డీతఁడె సుండి శ్రీవెంకటేశుఁడె
పలుకుఁ బంతాలవారు పదివేగురు
తలఁచకుఁడీ దోమ దంతితోను సరిగా
జలజనాభుఁడె సుండి సకలలోకేశుఁడు ॥కొలు॥

రేకు 381 సంఖ్య 188 సంపు 10 పుట 122

. కొలువుఁడు వలసినఁ గొలువక మానుఁడు
తెలియ నీతఁడె సుఁడీ దేవరాజు
పుడమి కాధార మీ పురుషోత్తముఁడె సుఁడీ
కుడిచి కట్టెడువారు కోట్లుకోట్లు
విడువుఁ డేఁటికిఁ బాఱవేసిన కూటికి
నొడయఁ డీతఁడె సుఁడీ యున్నతుండు
ఇతఁడె సుఁడీ సుధనిడిన నారాయణుం
డిదిగొని బ్రదుకువా రెల్లవారు
ఎండమావిబయుళ్ళనెల్ల చెర్వులటంచు
భ్రమయకుఁ డీతండె వాసుదేవుఁ

గీ. డితఁడె వేంకటవిభుఁడు లక్ష్మీశ్వరుండు
తలఁప నితరులు పలుకు పంతాలవారె
ఎంచకుఁడు దోమదంతితో నెనయటంచు
వృషగిరీశుండె సుండి లోకేశ్వరుండు.

శంకరాభరణం

అదె వాఁడె యిదె వీఁడె అందునిందు నేఁగీని
వెదకి వెదకి తిరవీధులందు దేవుఁడు ॥పల్లవి॥
అల సూర్యవీధి నేఁగీ నాదిత్యునితేరిమీఁద
కలికి కమలానందకరుఁడుగాన
తలపోసి ఆదియును దవ్వు చుట్టరిక మని
యిలఁ దేరిమీఁద నేఁగీ నిందిరావిభుఁడు ॥అదె॥
దక్క సోమవీధి నేఁగీఁ జందురుని తేరిమీఁద
యెక్కువైన కువలయహితుఁడుగాన
చుక్కలుమోచిన దవ్వు చుట్టరిక మిది యని
యిక్కువతో వీధి నేఁగీ నెన్నికైన దేవుఁడు ॥అదె॥
యింతుల మనోవీధి నేఁగీ మరుతేరిమీఁద
నంతటా రతిప్రియుఁ డటుగాన
రంతుల నదియుఁ గానరాని చుట్టరిక మని
వింతరీతి నేఁగీ శ్రీవేంకటాద్రిదేవుఁడు ॥అదె॥

రేకు 87 సంఖ్య 424 సంపు 1 పుట 284

. అదె వాఁడె యిదె వీఁడె యందిందు నేగెడి
వెదకి వెదకి తిరువీథులందు
రహి సూర్యవీథిని రవితేరిపై నేగుఁ
గనఁ గమలానందకరుఁడుగానఁ
దలపోసి అది చాల దవ్వని యిలఁ దేరి
పైనేగు నిందిరావల్లభుండు
చందురుతేరిపైఁ జను సోమవీథిని
వెంతయుఁ గువలయహితుఁడుగాన
ఉడుమార్గ మిదియును కడుదూరమని ధరా
వీథిని తేరిపై వెడలు శౌరి
గీ. అరుగు మరుతేరిమీఁద సుందరులచిత్త
వీథులను మాధవుఁడు రతిప్రియుఁడుగాన
నదియు కనరాని బాంధవం బంచు నెంచి
వేంకటస్వామి యేగును వింతరీతి.

సౌరాష్ట్రం

వీధుల వీధుల విభుఁ డేఁగీ నిదె
మోదముతోడుత మొక్కరో జనులు ॥పల్లవి॥

గరుడధ్వజమదె కనకరథం బదె
అరదముపై హరి యలవాఁడె
యిరుదెసల నున్నారు యిందిరయు భువియు
పరఁగ బగ్గములు పట్టరో జనులు ॥వీధు॥

ఆడే రదివో యచ్చర లెల్లను
పాడేరు గంధర్వపతు లెల్లా
వేడుకతో వీఁడె విష్వక్సేనుఁడు
కూడి యిందరునుఁ జూడరో జనులు ॥వీధు॥

శ్రీవెంకటపతిశిఖరము చాయదె
భావింప బహువైభవము లవే
గోవిందనామపుఘోషణ లిడుచును
దైవం బితఁడని తలఁచరో జనులు ॥వీధు॥

రేకు 349 సంఖ్య 286 సంపు 10 పుట 192

సీ. వీథుల వీథుల విభుఁడు తా నేగెడు
మోదముతోడుత మ్రొక్క రయ్య !
గరుడధ్వజం బదే కనకరథ మ్మదే
యరదమ్ముపై హరి యల్లవాఁడె
ఇరుదెసలన్ భువి యిందిర యున్నారు
పరఁగ పగ్గమ్ములు పట్టరయ్య !
ఆడుచున్నా రదే యచ్చరల్ పాడుచు
న్నారలు వారె గంధర్వపతులు
వీఁడె విష్వక్సేనవిష్ణుసేనాపతి
కూడి యిందఱు వేడ్కఁ జూడరయ్య !

గీ. సిరుల దీపించు వేంకటశిఖర మదియె
భావన మొనర్ప బహువైభవమ్ము లవియె
కోరి గోవిందనామంపుఘోష లిడుచు
దైవతం బితఁడే యని తలఁపరయ్య !

## శంకరాభరణం

నాటికి నాఁడుగొత్త నేటికి నేఁడుగొత్త
నాటకపుదైవమవు నమో నమో ॥పల్లవి॥

సిరుల రుక్మాంగదుచేతికత్తిధారఁ దొల్లి
వరుస ధర్మాంగదుపై వనమాలాయె
హరి నీ కృపకలిమి నట్లనే అరులచే
కరిఖడ్గధార నాకుఁ గలువదండాయె ॥నాఁటి॥

మునుప హరిశ్చంద్రు మొనకత్తిధారఁ దొల్లి
పౌనిగి చంద్రమతికిఁ బూవు దండాయె
వనజాక్ష నీ కృపను వరశత్రు లెత్తినట్టి
ఘనఖడ్గధార నాకుఁ గస్తూరివాటాయ ॥నాఁటి॥

చలపట్టి కరిరాజు శరణంటే విచ్చేసి
కలుషముఁ బెడఁబాపి కాచినట్టు
అలర శ్రీవేంకటేశ ఆపద లిన్నియుఁ బాపి
యిల నన్నుఁ గాచినది యెన్నఁ గతలాయ ॥నాఁటి॥

రేకు 115 సంఖ్య 85 సంపు 2 పుట 57

సీ. సిరుల రుక్మాంగదు కరవాలధార ధ
ర్మాంగదుపై వనమాల యయ్యె
హరి ! భవత్కారుణ్యగరిమ వైరికృపాణ
ధార నా కటు కల్వదండయయ్యె;
మును హరిశ్చంద్రభూపుని ఖడ్గధార పు
ష్పముల సరంబాయె చంద్రమతికి;
జలజాక్ష ! నీ కృప శత్రులయసిధార
కస్తూరివాటయ్యె కడకు నాకు

గీ. వనకరీంద్రమ్ము శరణ మంచనఁగ వచ్చి
కష్టమును మాపి దయతోడఁ గాచినట్టు
పన్నగగిరీశ ! యాపద లన్ని బాపి
అలర నన్నుఁ బ్రోచినది కథ లాయె నయ్య !

## శంకరాభరణం

నీకే నే శరణు నీవు నన్నుఁ గరుణించు
యీకడ నాకడ దిక్కు యెవ్వరున్నా రికను ॥పల్లవి॥

కన్నులఁ జంద్రసూర్యులు గల వేలుపవు నీవు
పన్నిన లక్ష్మీభూమిపతివి నీవు
అన్నిటా బ్రహ్మకుఁ దండ్రియైన యాదివేలుపవు
యెన్నఁగ నీకంటే ఘన మెవ్వరున్నా రికను ॥నీకే॥

దేవత లందరు నీ తిరుమేనైనమూర్తి
ఆవలఁ బాదాన లోక మణఁచితివి
నీ వాక్కుఁడవే నిలిచినదేవుఁడవు
యే వేళ నీకంటే నెక్కు డెవ్వరున్నా రికను ॥నీకే॥

అరసి జీవుల కెల్ల నంతరాత్మవైన హరి
సిరుల వరము లిచ్చే శ్రీవేంకటేశ
పురుషోత్తముఁడవు భువనరక్షకుఁడవు
యిరవైన నీవేకాక యెవ్వరున్నా రికను ॥నీకే॥

రేకు 333 సంఖ్య 194 సంపు 10 పుట 180

సీ. ఈకడ నాకడ నెవరు దిక్కున్నారు
కరుణించు నీకె నే శరణమంటి;
కనుల సోమార్కులుగల వేలుపవు నీవు
భార్గవీభూసతీపతివి నీవు
అజునకు జనకుఁడౌ ఆదిదైవత మీవు
ఘను లెన్న నీకంటెఁ గలరె యొరులు?
దేవత లెల్ల నీ తిరుమేనఁ బొడమిరి
యటు పాదమున లోక మణఁచినావు

గీ. అఖిలజీవులకును నంతరాత్మ వీవు
ఉత్తమశ్లోకుఁడవు పురుషోత్తముఁడవు
నీవుగా కెవ్వ రున్నారు దేవదేవ!
వరదుఁడవు సర్వభువనైకపాలకుఁడవు

## ధ న్నా సి

మెచ్చుల దంపతులార మీరేగతి
మెచ్చితి నిన్నిట మిమ్ము, మెరసె మీచేఁతలు ॥పల్లవి॥
తమ్మిలోనిమగువా వో ధర్ణిధరుఁడా
మిమ్ము నే నమ్మితి నాకు మీరేగతి
నెమ్మది నోయిందిరా నీరజలోచనుఁడా
కమ్మి యేపొద్దును మీరే కలరు నా పాలను ॥మెచ్చు॥
పాలజలధికూఁతుర భక్తవత్సలుఁడ హరి
మేలిచ్చి రక్షించ నాకు మీరేగతి
కేలి నో శ్రీమహాలక్ష్మి కేశవదయానిధి
తాలిమి మీరే నాకు దాపు దండ యెపుడు ॥మెచ్చు॥
చెన్నగు రమాకాంత చెందినవో మాధవ
మిన్నక యేపొద్దు మాకు మీరేగతి
చిన్ని యలమేలుమంగ శ్రీవేంకటేశుఁడా
యెన్నికె కెక్కించి నన్ను నేలుకొంటిరిదిగో ॥మెచ్చు॥

రేకు 276 సంఖ్య 488 సంపు 8 పుట 295

సీ. తమ్మిలోని మగువ ! ధర జీధరుఁడ ! మది
మిమ్ము నమ్మితి నాకు మీరె దిక్కు;
ఇందిరా ! పుండరీకేక్షణ ! నాపాల
క్రిమ్మి యేప్రొద్దును గలరు మీరు
పాలకడలిపట్టి ! భక్తవత్సల ! నాకు
మేలెంచి రక్షింప మీరెదిక్కు;
శ్రీమహాలక్ష్మి ! దయామయ ! కేశవ !
తాల్మిమీరలె నాకు దాపు దండ
గీ. చెన్నుమీఱు రమాకాంత ! శ్రీధరుండ
మిన్న కేపొద్దులును నాకు మీరె దిక్కు
చిన్ని యలమేలు మంగమ్మ ! శ్రీనివాస !
యెన్నికకుఁ దెచ్చి నన్ను మీ రేలినారు.

శ్రీ రాగం

హరియవతార మీతఁడు అన్నమయ్య
అరయ మాగురుఁ డీతఁ డన్నమయ్య ॥పల్లవి॥

వైకుంఠనాథునివద్ద వడిఁ బాడుచున్నవాఁడు
ఆకరమై తాళ్లపాక అన్నమయ్య
ఆకళపు విష్ణుపాదమందు నిత్యమై వున్నవాఁడు
ఆకడీకడఁ దాళ్లపాక అన్నమయ్య ॥హరి॥

క్షీరాబ్ధిశాయి నిట్టె సేవింపుచు నున్నవాఁడః
ఆరితేరి తాళ్ళపాక అన్నమయ్య
ధీరుఁడై సూర్యమండలతేజమువద్ద నున్నవాఁడు
ఆ రీతులఁ దాళ్లపాక అన్నమయ్య ॥హరి॥

యీపల సంసారలీల యిందిరేశుతో నున్నవాఁడు
ఆవటించి తాళ్లపాక అన్నమయ్య
భావింప శ్రీవేంకటేశుపాదములందె వున్నవాఁడు
ఆ (హా)వ భావమై తాళ్లపాక అన్నమయ్య ॥హరి॥

రేకు 117 సంఖ్య 100 సంపు 2 పుట 67

సీ. హరి యవతార మీాయన అన్నమయ్య
కరయంగ గురుఁ డీత డన్నమయ్య మా
వైకుంఠపతివద్ద వడిఁ బాడుచున్న వాఁ
డతిభక్తి తాళ్ళపా కన్నమయ్య
విష్ణుపదమ్మందు వెలుఁగొందుచున్న వాఁ
డనఘుండు తాళ్ళపా కన్నమయ్య
క్షీరాబ్ధిశాయిని సేవించుచున్నాఁడు
పన్నగ తాళ్ళపా కన్నమయ్య
సూర్యమండలమందు శోభిల్లుచున్న వాఁ
డా రీతి తాళ్ళపా కన్నమయ్య

గీ. ఇవల సంసారలీల లక్ష్మీశుతోడ
నున్న వాఁ డిదె తాళ్ళపా కన్నమయ్య
పన్నగ గిరీశుపదములం దున్న వాఁడు
హావభావమై తాళ్ళపా కన్నమయ్య.

లలిత

శరణంటి మాతని సమ్మంధమునఁ జేసి
మరిగించి మము నేలి మన్నించవే ॥పల్లవి॥

సకలవేదములు సంకీర్తనలు చేసి
ప్రకటించి నినుఁబాడి పావనుఁడైన
అకలంకుఁడు తాళ్లపాకన్నమాచార్యుల
వెకలియై యేలిన శ్రీవేంకటనిలయ ॥శర॥

నారదాది సనక సనందనాదులవలె
పేరుపడి నిన్నుఁ బాడి పెద్దలైనట్టి
ఆ రీతిఁ దాళ్లపాకన్నమాచార్యుల
చేరి యేలినయట్టి శ్రీవేంకటనిలయ ॥శర॥

సామవేదసామగాన సప్తస్వరములను
బాముతో నీ సతి నిన్నుఁ బాడినయట్టి
ఆముకొన్న తాళ్లపాకన్నమాచార్యుల
వేమరు మెచ్చిన శ్రీవేంకటనిలయా ॥శర॥

రేకు 104 సంఖ్య 24 సంపు 2 పు. 17

సీ. సకలవేదంబులు సంకీర్తనలు చేసి
ప్రకటించి నినుఁబాడి పావనుఁడగు
నకలంకుఁ దాళ్ళపాకన్నమాచార్యులఁ
గరుణనేలిన శేషగిరినివాస!
నారద సనక సనందనాదులవలెఁ
బేరొంది నినుఁబాడి పెద్దలైన
సన్నుతుఁ దాళ్లపాకన్నమాచార్యులఁ
జేరి బ్రోచిన వృషశిఖరినిలయ!
ఆ. సామవేదగానసప్తస్వరంబుల
నిన్ను మంగఁబాడ నీదుమెప్పు
లందుకొన్న అన్నమయ్యకుటుంబంబుల
నేలు మయ్య! వేంకటేశ! మమ్ము.

దే సా ళం

ఈతఁడే ముక్తి దోవ యీతఁడే మాయాచార్యుఁ
డీతఁడు గలుగఁబట్టి ఇందరు బదికిరి ॥పల్లవి॥

ఆదివో తాళ్ళపాక అన్నమాచార్యులు
యిదె వీఁడె శ్రీవేంకటేశు వెదుట
వెదపెట్టి లోకములో వేదములన్నియు మంచి
పదములుచేసి పాడి పావనముసేసెను ॥ఈతఁ॥

అలరుచుఁ దాళ్ళపాక అన్నమార్యులు
నిలిచి శ్రీవేంకటనిధియే తానై
కలిదోషములు వాప ఘనపురాణములెల్ల
పలుకుల నించి నించి పాడినాఁడు హరిని ॥ఈతఁ॥

అంగవించెఁ దాళ్లపాక అన్నమాచార్యులు
బంగారు శ్రీవేంకటేశు పాదములందు
రంగుమీర శ్రీవేంకటరమణుని యలమేలు
మంగను యిద్దరిఁబాడి మమ్ము గరుణించెను ॥ఈతఁ॥

రేకు 282 సంఖ్య 188 సంపు 3 పుట 128

సీ. ఇతఁడె ముక్తికిఁ ద్రోవ యితఁడె మాయాచార్యుఁ
డిందఱు బ్రదికిరి యితఁడు గలుగ
అదె వాఁడె తాళ్ల పాకన్న మాచార్యులు
నిదె వీఁడె శ్రీవేంకటేశు నెదుట
వెదపెట్టి జగములో వేదముల్; కావించి
పదములు, పాడి పావనము చేసె;
నలరుచుఁ దాళ్ల పాకన్న మాచార్యులు
వేంకటనిధి యన వెలసి తాను
కలిదోషములు వాప ఘనపురాణము లెల్లఁ
బలుకులనించి శ్రీపతినిఁ బాడె;

గీ. అంగవించెను తాళ్ల పాకన్న యయ్య
బంగరువ్వృషాచలాధీశు పదములందు;
రంగుమీఱు శ్రీవేంకటరమణమూర్తి
మంగ - నిరువురఁ దాఁబాడి మమ్ముఁ బ్రోచె.

## ధన్నాసి

పరిణామమే మాకుఁ బతివి నీవుగలుగ
శరణాగతే మాకు సకలరక్షయ్యా ॥పల్లవి॥

నుదుట వ్రాసినవ్రాఁత నూఁటికి నీ తిరుమణి
యెదురేదిమాకు నేఁడు యేఁడులోకాల
పెదవిమీఁదటితేనె పేరుకొనే నీ జపము
అదన మాకు నదివో అక్కర లేదయ్యా ॥పరి॥

చేతికివచ్చినసొమ్ము చేరె నీ శంఖచక్రాలు
ఘాతల మాకిఁక నేది గడమలేదు
నీతితో వెనుబలము నీ దాసులసేవ
రాతిరిఁ బగలు నిదె రాజులమో యయ్యా ॥పరి॥

తొల్లిఁటిపుణ్యఫలము తోడనే నీ సంకీర్తన
తల్లి దండ్రి నీవు నీతరుణియును
యెల్లగా శ్రీవేంకటేశ యిన్నియుఁ గలిగె మాకె
చల్లఁగా బ్రతికితిమి జయమందవయ్యా ॥పరి॥

రేకు 800 సంఖ్య 580 సంపు 8 పుట 389

సీ. పరిణామమే మాకు పతి వీవు గలుగంగ;
శరణాగతియె మాకు సకలరక్ష;
నుదుట వ్రాసినవ్రాఁత నూటి కీ తిరుమణి
యేడులోకాల మా కెదురు లేదు;
పెదవిమీఁదటితేనె పేర్కొను నీ జపం
బెట్టి యక్కరయు మా కెందు లేదు;
చేతి కబ్బినసొమ్ము శ్రీశంఖచక్రాలు
కనుఁగొన మా కింకఁ గడమ లేదు;
వెండు వెనుబలమ్ము నీదు దాసులసేవ
రాజులమే మేము రాత్రిపవలు;

గీ. పుడమి నీదుసంకీర్తన పుణ్యఫలము
తండ్రి వీవు నీ తరుణియే తల్లి మాకు
బ్రతికితిమి చల్లఁగా నిన్ను బ్రాప్త మయ్యె
అంజనగిరీశ్వరా! జయ మందవయ్య!

# తాళ్లపాక అన్నమాచార్యుల అధ్యాత్మసంకీర్తనల
# అకారాది సూచిక

''శాలివాహనశకవరుషంబులు ౧౪౨౪ అగు నేఁటి దుందుభి
సంవత్సర ఫాల్గుణబహుళ ౧౨ మొదలుగాను తాళ్ళపాక
అన్నమాచార్యులుంగారు తమ కౌమారుఁడు తిరుమలా
చార్యు లనుదిన మొకసంకీర్తన శ్రీవేంకటేశ్వరునకు
అంకితం చేసి చెప్పు మనఁగాను విన్నపము
చేసిన సంకీర్తనలు.''

అన్నమాచార్యులు పరమపదించినవాఁటినుండి
తిరుమలాచార్యులు చెప్పిన

# సంకీర్తనలు

గౌళ

వెద విచారాలు వద్దు విష్ణుఁ డితఁడే
యెదయని వరము లిచ్చీ నీ దేవుఁడే ॥పల్లవి॥

మున్ను బలభద్రునికి మూర్తియై చిచ్చినవాఁడు
సన్నిధై మునులచేఁ బూజగొన్నవాఁడు
చెన్నుమీర శేషాద్రిశిఖరమై యున్నవాఁడు
యిన్నిటి కెక్కుడైనవాఁ డీ దేవుఁడే ॥వెద॥

చదువులలోఁ జెప్పి స్వయంవ్యక్తమైనవాఁడు
కదిసి గుహునిసేవ గైకొన్నవాఁడు
వెదకఁగా సుకలకు విశ్వరూపై యున్నవాఁడు
యెదుటఁ గానఁగవచ్చీ నీదేవుఁడే ॥వెద॥

తొండమాంజక్రవర్తితో మాటలాడినవాఁడు
నిండుకొని పెద్దలకు నిధైనవాఁడు
అండనే శ్రీవేంకటేశుఁ డలమేలుమంగతోడ
యెండనీడకన్నులవాఁ డీదేవుఁడే ॥వెద॥

రేకు 75 సంఖ్య 434 సంపు 21 పుట 292

సీ. మున్ను శ్రీబలభద్రమూర్తి యయినవాఁడు
సన్నిధి ఋషిపూజ గొన్నవాఁడు
చెన్నారు శేషాద్రిశిఖరమైయున్నవాఁ
డీ దేవుఁడే వరా లిచ్చువాఁడు
ఆగమంబుల స్వయంవ్యక్తమయినవాఁడు
కోరి గుహునిసేవ గొన్నవాఁడు
వెదవిచారము లేల విశ్వస్వరూపుఁడై
ముచ్చటగాఁ గానవచ్చువాఁడు
గీ. తొండమాన్ సార్వభౌమునితోడ మాట
లాడువాఁ డార్యులకు నిధియైనవాఁడు
అండ నలమేలుమంగతో నలరువాఁడు
ఎండనీడకన్నుల వేంకటేశుఁ డితఁడె.

బౌళి

ఇతఁడే బ్రహ్మస్వరూప మితఁడే పరతత్వము
యితఁడే స్వయంవ్యక్త మిటని తలఁచుఁడీ ॥పల్లవి॥
హరి వేంకటాద్రి నుండునని పురాణములు చెప్పు
పరమేష్ఠికి విశ్వరూపము చూపినందుకు
సరుసనే జనులకు స్వప్నములో మాటలాడి
పరుషలకు వరాలు పైపై నిచ్చీని ॥ఇతఁడే॥
మునులు పూజించి రట మున్నే యీ మూర్తిని
సనకాదియోగీంద్రు లిచ్చటనే వెదకిరటా
యెనలేని మహిమలు యెప్పుడునుఁ గలవట
ఘనదివ్యజ్ఞానసిద్ధిగలవాఁ డట ॥ఇతఁడే॥
అలమేల్మంగ పురమందుఁ గాఁపురి మున్నది
యిల శ్రీవేంకటేశుఁ డితఁడై వున్నాఁడు
తలఁప నితనిపేరే ధరించిరి లోక మెల్లా
తెలుసుకొంటేఁ దానే దృష్టదేవుఁడు ॥ఇతఁడే॥

రేకు 76 సంఖ్య 436 సంపు 21 పుట 293

సీ. హరి వేంకటాద్రీశుఁ డనియెఁ బురాణముల్
బ్రహ్మకు విశ్వరూపమ్ముఁ జూప
స్వప్నమ్ములం దోఁచి జనులతో మాటాడు
పరసలకు వరాలు వరుస నొసఁగు;
మునులు పూజించిరి మున్నె యీ మూర్తిని
సనకాదియోగు లిచ్చటనె కనిరి;
ఎనలేని మహిమమ్ము లెపుడు గలాఁడంటు
కలవాఁడు ఘనమైన జ్ఞానసిద్ధి;
గీ. ఉరమునన్ మంగ కాఁపురమున్నదంటు
యితఁడె శ్రీవేంకటేశ్వరుం డితఁడె బ్రహ్మ
మీతఁడే స్వయంవ్యక్తుఁడు దృష్టదేవుఁ
డితని పేరె ధరించిరి యెల్లవారు.

బౌళి

మొక్కేటి గోపాంగనల మోహనాకారము
చిక్కని నవ్వులు నవ్వీ శ్రీవేంకటేశ్వరుఁడు ॥పల్లవి॥
సత్యభామవురముపై చల్లని కస్తూరిపూఁత
తత్తరించే రుక్మిణి చేతామరపూవు
హత్తిన భూకాంతకు యంగపుపయ్యదకొంగు
చిత్తగించరమ్మ వీఁడే శ్రీవేంకటేశుఁడు ॥మొక్కే-టి॥
పంతపుపదారువేల బంగారువుంగరము
బంతికే కుబ్జగట్టిన పసిఁడితాళి
వింతగా రాధాదేవివేసిన కలువదండ
చెంతలను వీఁడేయమ్మ శ్రీవేంకటేశుఁడు ॥మొక్కే-టి॥
ఆసల తులసీదేవి యంఁచేతిలో యద్దము
భాసురపు యిళాదేవి పట్టుగొమ్ము
శ్రీసతియెక్కినట్టి సింహాసనపుగద్దె
సేస వెట్టించుకున్నాఁడు శ్రీవేంకటేశుఁడు ॥మొక్కే-టి॥
రేకు 89 సంఖ్య 221 సంపు 21 పుట 147

1. మ్రొక్కు గోపికలకు మోహనాకారమ్ము
చిరునగవుల శేషశిఖరి భర్త
సత్యభామయురంపు చల్లనికస్తూరి
తరుణి రుక్మిణిచేతి తమ్మిపువ్వు
రంగుమీఱెడు భూపురంధ్రిపయ్యెదకొంగు
కనరమ్మ వీఁడె మంగకు మగండు
పదునారువేలచెల్వల ముద్దుటుంగ్రమ్ము
పడఁతి కుబ్జ ధరించు పసిఁడితాళి
వేడ్క రాధాదేవి వేయు కలువదండ
తిలకింపుఁ డితఁడె తిర్మలవిభుండు
గీ. తలఁప శ్రీతులసీకరదర్పణమ్ము
భాసురంపునీళాదేవి పట్టుఁగొమ్ము
కమలయెక్కిన మేటిసింగంపుగద్దె
సేస పెట్టించుకొనె శ్రీనివాసమూర్తి

## శ్రీ ని వా స తే జ ము

నా ట

నావామహిమల శ్రీనారసింహము
పూని మమ్ము రక్షించీ పొగడెద నిదిగో ॥పల్లవి॥

కొండవంటి వేదాద్రిగుహలలో సింహము
పండి భవనాశి యేటిదరి సింహము
అండ నారుశాస్త్రముల అడవిలో సింహము
నిండి అహోబలముపై నిక్కిచూచీ నదిగో ॥నానా॥

దిట్ట యోగీంద్రుల మతితెరమఱఁగు సింహము
జట్టిగొన్న శ్రీసతితో జంటసింహము
పట్టి దైత్యుల వేఁటాడే బలుదీము సింహము
మెట్టి అహోబలముపై మెఱసీఁ దా నదిగో ॥నానా॥

పలుదేవతల వెనుబలమైన సింహము
కెలసి కంబాన చెనఁగిన సింహము
అలరి శ్రీవేంకటేశుఁ డైనట్టి సింహము
కొలువై అహోబలాన గురుతాయ నిదిగో ॥నానా॥

రేకు 21 సంఖ్య 119 సంపు 21 పుట 79

సీ. వేదాద్రిగుహలలో విహరించు సింహమ్ము
భవనాశనీదరిఁ బరఁగు సింహ;
మాఱుశాస్త్రమ్ములయడవిసింహ మ్మహో
బలముపై తీవిగ వెలసె నదిగో !
మౌనుల మతితెరమఱుఁగుసింహము రమా
సతితోడఁ గ్రీడించు జంటసింహ
మసురకోటుల వేఁటలాడెడు సింహమ్ము
పొరి నహోబలముపై మెఱసె నదిగో !
గీ. అమరులకు నెల్ల వెనుబలమైన సింహ
ముక్కుకంబానఁ బొడమిన యుగ్రసింహ
మలరి శ్రీవేంకటేశుఁ డైనట్టిసింహ
మల యహోబలమునఁ గొలువాయె నదిగో !

సా ళ ం గ నా ట

కామక్రోధవికారజలనిధికి కలశభవుఁడు మీ నామము
భీమగుణత్రియబిసకాండములకు బిరుదుహంస మీ నామము ॥పల్లవి॥

బహుళ దురితపటుపటల మను ఘన
గహన దావశిఖి గణుతింపఁగ మీ నామము
సహజకలుషతమిస్రముఁ దొలఁగింపఁగ నహ
రహముల వెలిఁగెడి రవిబింబ మైనది మీ నామము ॥కామ॥

జననబంధదోషము లను గిరులకు
ననుపమ మగు నిష్ఠుర నిర్ఘాతం బరయఁగ మీ నామము
ఘనసంసారం బను పెనుసర్పం
బునకును ముదమున గరుడుఁడు మీ నామము ॥కామ॥

తీరని పంచేంద్రియ మేఘములకు
ఘోరమారుతవిహారం బైనది మీ నామము
శ్రీరమణీశ్వర శ్రీవేంకటపతి
ధారుణిఁ బొగడఁగఁ దగినది మీ నామము ॥కామ॥

రేకు 82 సంఖ్య 458 సంపు 21 పుట 308

సీ. కామాదిజలధి కగస్తి; గుణత్రయ
బిసకాండపటలికి బిరుదుహంస;
కలుషతామిస్రమ్ముఁ దొలఁగింప రవిబింబ;
మఘమహాటవికి దావాగ్నికీల;
జననబంధపుదోషశైలసంఘమునకు
నిష్ఠుర నిర్ఘాత నిశితధార;
సంసారమను ఘోరసర్పరాజమ్మును
గడికండలుగఁ జేయు గరుడపక్షి;
గీ. వెలఁగు పంచేంద్రియములను జలదములకు
చండమారుత మంజనాచలవిహారు
పతితపావననామమ్ము భయహరమ్ము
పరమసుఖదాయకమ్ము శోభనకరమ్ము.

ముఖారి

ప్రియాసపడవద్దు బయలు వెదకవద్దు
క్రియ యెఱిఁగినఁజాలు గెలుతు మిందుననే ॥పల్లవి॥
శ్రీపతి సులభుఁడు చింతించ నేర్చిన
దీపించు మనసు కొనితేవలదు
చేపట్టుఁగుంచము కడుజిహ్వకుఁ దిరుమంత్రము
దాపగు తులసితీర్థము నడచేతిది ॥ప్రియాస॥
అదే వీనులపండుగ ఆచార్యోపదేశము
ముదమున నొసలనే మొక్కు లున్నవి
హృదయమునిక్షేపము యెఱిఁగితే సుజ్ఞానము
సదరము భుజములఁ జక్రలాంఛనములు ॥ప్రియాస॥
తావుగ దేహమందు ద్వాదశనామములవు
సావివోని సంకల్పమే శరణాగతి
శ్రీవేంకటేశుఁడే దిక్కు జీవులకు నెల్లాను
దేవుఁ డితఁడే మనకుఁ దెలుసుకోరో ॥ప్రియాస॥

రేకు 57 సంఖ్య 324 సంపు 12 పుట 218

సీ. క్రియ యెఱింగినఁ జాలు గెలుతు మిందుననె ప్ర
యాసవలదు; బయ లరయవలదు;
శ్రీపతి సులభుండు చింతింప నేర్చిన:
దీపించుమతి కొనితేరవలదు;
చేపట్టుకుంచము జిహ్వ కష్టాక్షరి;
తులసితీర్థము చేత నిలిచియుండె;
శ్రవణపర్వము సదాచార్యోపదేశమ్ము;
ముదమున నొసలనే మ్రొక్కు లుండె;
హృదయమునిక్షేప మెఱుఁగ సుజ్ఞానమ్ము;
చక్రాంకితములు భుజమ్ము లొప్పు;
గీ. ద్వాదశోర్ధ్వపుండ్రములకుఁ దావు తనువు;
పరమసంకల్ప మొక్కఁడే శరణుసొరుటు;
జీవులకు దిక్కు వేంకటశిఖరివిభుఁడు;
దేవుఁ డితండె మన; కిది తెలిసికొనరొ!

దేశాక్షి

సులభము యిదియే భూదివ దుర్లభ మిదే
అలఘు సుజ్ఞానులకు అజ్ఞానులకు ॥పల్లవి॥

తీఱుఁ గొన్నాళ్లకు తెగినదానఫలము
తీఱవు హరిదాసుల దివ్యభోగాలు
జాఱుఁ గొన్నాళ్లకు సకలదేవత్వములు
జాఱదు వైకుంఠుని సాలోక్యమోక్షము ॥సులభ॥

యింతింతనఁగ వచ్చు నింద్రాదుల సంపదలు
యింతనరాదు నీ దాసుల యీ మహామహిమ
పంతాన సాధించవచ్చు బహుకర్మతపములు
యెంతైనా సాధించరాదు యీ హరిభక్తి ॥సులభ॥

వుండు తామసగుణము లోకొక్కొకసమయమున
వుండవు శ్రీవైష్ణవులవద్ద నెన్నఁడు
అందనె శ్రీవేంకటేశుఁ డన్నిమాయలుఁ జూపు
నిండు తన దాసులకు నిజమాయె మాకు ॥సులభ॥

రేకు 25 సంఖ్య 146 సంపు 21 పుట 97

సీ. తీఱుఁ గొన్నాళ్లకు భూరిదానఫలమ్ము;
తీఱదు హరిదాస్యదివ్యసుఖము;
సకలదేవత్వముల్ జాఱు; వైకుంఠుని
సాలోక్యమోక్షమ్ము జాఱ దెప్డు;
ఇంతింతనఁగవచ్చు నింద్రాదులసంపద;
దాసులమహిమ యింతయనరాదు;
సాధింపవచ్చు దుష్కరకర్మతపములు;
సాధింపరాదు కృష్ణపదభక్తి;

గీ. ఉండు తామసగుణము లోకొక్కొకరియందు;
వైష్ణవులయందు నుండవు; వాసుదేవ
దాసులే విష్ణుమాయను దాఁటఁగలరు;
దాససులభుండు వేంకటోత్తముఁడు నిజము.

లౌ

ఇతనిచందము హరిహరి యేమిచెప్పఁ గలఁది హరిహరి
అతిరహస్యముల హరిహరి అదిగో మనకుఁ జిక్కె హరిహరి ॥పల్లవి॥

ఆదివిష్ణుఁ డితఁడు హరిహరి అదె యశోదకొడుకు హరిహరి
వేదమూర్తి ఇతఁడె హరిహరి వెన్న దొంగిలించె హరిహరి
సొదబండి విఱిచె హరిహరి చంటివిషము చెరిచె హరిహరి ॥ఇతని॥

పరమపురుషుఁ డితఁడు హరిహరి పసులఁగాచె నిదివో హరిహరి
సిరికి మగఁడు తాను హరిహరి చెలఁగి రోలఁదగిలె హరిహరి
పరగఁ జూడరోయి హరిహరి బదుకరోయి కొలిచి హరిహరి ॥ఇతని॥

అమరవంద్యుఁ డితఁడు హరిహరి అణఁచెఁ గంసుని హరిహరి
విమతదానవారి హరిహరి వించె మద్దులు హరిహరి
అమరె నిదివో హరిహరి శ్రీవేంకటాద్రిమీఁద హరిహరి
జమళి రామకృష్ణుఁడు హరిహరి సర్వ మితఁడు హరిహరి ॥ఇతని॥

రేకు 20 సంఖ్య 115 సంపు 21 పుట 77

సీ. అదివిష్ణుఁ డితండు వేదమూర్తి యితండు
నందయశోదల నందనుండు
స్తనవిషమ్ముఁ జెఱిచె; శకటమ్ముఁ విఱిచెను;
దొరయాచు వెన్నలు దొంగిలించె;
సిరికి మగఁ డితండు పరమపురుషుఁ డితం
డడవులఁ దిరుగుచు నాలఁగాచె;
అసురశాత్రవుఁ డీతఁ డమరవంద్యుఁ డితండు
కూల్చె మద్దులఁ గంసుఁ గు్రద్దిచంపె;
గీ. రామకృష్ణపరబ్రహ్మ మేమిచెప్ప ?
వెలసె శ్రీవేంకటాద్రిఁ గన్విందుగాఁగ
భక్తితో నితనిఁగొల్చి బ్రదుకరోయి !
సర్వ మీతండు దాసవత్సలుఁ డితండు.

శ్రీ రాగం

ఘనసుఖము జీవుఁ డెఱుఁగఁడుగాక యెఱిఁగినను
అనవరతవిభవంబు లప్పుడే రావా ॥పల్లవి॥
విసుగ కెవ్వరికైన వేఁడ నేర్చిననోరు
దెసలకును బలుమారుఁ దెరచునోరు
వసుధాకళత్రుఁ దడవదుగాక తడవినను
యెసఁగఁ గోరికలు తన కిప్పుడే రావా ॥ఘన॥

ముదమంది యెవ్వరికి మొక్క నేర్చినచేయి
పొదిగి యధముల నడుగఁ జూచుచేయి
అదన హరిఁ బూజసేయదుగాక సేసినను
యెదురెదురఁ గోరికలు యిప్పుడే రావా ॥ఘన॥

తడయ కేమిటికైనఁ దమక మందెడి మనసు
అడియాసకోరికల నలయు మనసు
వడి వేంకటేశుఁ గొలువదుగాక కొలిచినను
ఒడిబట్టే చెడనిసంపద లిట్టు రావా ॥ఘన॥

రేకు 98 సంఖ్య 468 సంపు 21 పుట 312

శ్రీరంగము రాగిరేకులలో లభించిన అన్నమయ్యపాట.

సీ. ఘనసుఖ మెఱుఁగఁడుగాక జీవుఁ డెఱుంగ
నను పమ విభవంబు లపుడ రావె
విసువ కెవ్వరినేని వేడనేర్చిన నోరు
దెసలకుఁ బలుమారు దెఱచునోరు
వసుధాదయితుఁ దడవదుగాక తడఁపిన
నెసఁగుకోర్కులు తన కిపుడ రావె
ముదమున నేరికి మ్రొక్క నేర్చిన చేయి
యధముల నడుగంగ నడచు చేయి
యచ్యుతుఁ బూజసేయదుగాక చేసిన
నెదురెదురై కోర్కు లిపుడ రావె

ఆ. తడయ కన్నిటికిని దమకించు మన సడి
యాసకోరికలకు నలయు మనసు
ఫణినగేశ్వరుఁ గొలువదుగాక కొల్చినఁ
జెడని సిరు లవెల్లఁ జేర రావె

సారంగనాట

ఈతని కెదురులేరు యెక్కడ చూచిన నిదె
చేతనే ప్రతాపముతో చెలరేఁగీ నితఁడు ॥పల్లవి॥

దిక్కులు సాధించుటకు దేవదేవోత్తముఁడదె
యెక్కెను తేరుమీఁద యెచ్చరికతో
చక్కాడీ దనుజులను సమరముల గెలిచి
యిక్కువతో వీథివీథి నేఁగీ నిదివో ॥ఈతని॥

సకలాయుధములునుఁ జక్రము చేతులఁబట్టి
వెకలియై శంఖము వేవేగ నాడించె
వికలులై రాక్షసులు వీఁగి లోఁగి హతులైరి
అకలంకుఁ డీ హరి అన్నిటాను మించెను ॥ఈతని॥

విజయధ్వజము నదె వీఁడె శ్రీవేంకటేశుఁడు
భజన నలమేలుమంగ పలుమారు మెచ్చెనదె
త్రిజగములు నితఁడె దిక్కై కాచీనిదె
గజబిజ లింక నుడుగరో రాక్షసులు ॥ఈతని॥

రేకు 27 సంఖ్య 156 సంపు 21 పుట 104

సీ. దిక్కులు సాధింప దేవదేవోత్తముం
డెచ్చరికను రథ మెక్కె నదిగో!
చక్కాడి దనుజుల సమరమ్ములు జయించి
వీథివీథి నరిగె వేడ్కమీఱ
సకలాయుధమ్ములు చక్రమ్ము చేఁబట్టి
శంఖంబు నాదించె సరభసముగ
వికలులై దైత్యులు వీఁగి లోఁగి నశించి
రన్నిట మించె నారాయణుండు
గీ. విజయకేతన మదె; వీఁడె వేంకటేశుఁ
డతివ యలమేలుమంగ నెయ్యమున మెచ్చెఁ
ద్రిజగములు గాచు దిక్కయి తేజమందు
నెందుఁజూచిన నీతని కెదురులేదు.

## సౌరాష్ట్రం

ఇందరికంటె నెక్కుడు యెంచఁగ యోగీశ్వరుఁడు
అంది కనఁగొను తన యంతరాత్మ నెపుడు ॥పల్లవి॥
చూడఁగల వన్నియును చూడనీ యోగీశ్వరుఁడు
బూడిదెలో గచ్చకాయై పొరయఁ డెందు
యేడనైనా నుండనీ యిచ్చైన యోగీశ్వరుఁడు
వాదలో కుమ్మరిపురువువలె నెందు నంటఁడు ॥ఇందరి॥
చేసంది యే పుణ్యమైనాఁ జేయనీ యోగీశ్వరుఁడు
నూనెఁ గొల్చిన కుంచమై నుశికేలును
వీనుల నేమైనాను విననీ యోగీశ్వరుఁడు
నానేటితామరపాకై సడుమఁ దా నుండును ॥ఇందరి॥
వొడ్డి చవులుగొననీ ఉత్తమయోగీశ్వరుఁడు
జిడ్డంటని నాలికై నిశ్చింతాన నుండు
యెడ్డవలె మెలఁగనీ యెదలో యోగీశ్వరుఁడు
దొడ్డ శ్రీవేంకటేశ్వరుతోనే రమించును ॥ఇందరి॥

రేకు 74 సంఖ్య 425 సంపు 21 పుట 286

సీ. చూడఁగల్గిన వన్ని చూడనీ ఘనయోగి
కన బూదిలో గచ్చకాయ సుమ్ము;
ఏడనుండిననైన నేమిలే ఘనయోగి
బురదలో కుమ్మరపురువు సుమ్ము;
చేత నేపుణ్యంబు చేయనీ ఘనయోగి
చమురును గొల్చు కుంచంబు సుమ్ము;
వీనుల నేమైన విననిమ్ము ఘనయోగి
యంబువులోఁ గమలంబు సుమ్ము;
గీ. ఎన్ని చవులైన మరగుగా కిద్ధయోగి
జిడ్డొకింతయు నంటని జిహ్వ సుమ్ము
ఎడ్డకైవడి మెలఁగుఁగా కిద్ధయోగి
దొడ్డ తిరుమలయోగిమానితో రమించు.

## సామంతం

ఆహా యేమి చెప్పేది హరి నీ చిక్కు
ఊహాపోహలచేత వుడివోవు వయసు ॥పల్లవి॥

చేతఁ జిక్కినట్లుండు చెప్పినదాఁకా జ్ఞానము
ఆతలఁ గడచితేను అట్టువోవు
జాతఁజేసినట్టుండు నాలిడి దేహ మాయుష్యముతో
ఆతుమ యెడసితేను అపపదలవుసు ॥ఆహా॥

నిక్కముపలెనే వుండు నిద్రించుదాఁకాఁ గల
పక్కన మేలుకొంటేను బట్టబయలు
దక్కినయట్లనే వుండు ధనధాన్యములు యింట
చక్క ననుభవించితే సరికి సరి యౌను ॥ఆహా॥

సులభముపలె నుండు చూచేటి యీ లోకము
యింఁ జేకొనఁగోరితే నెలయించును
యెలమి శ్రీవేంకటేశ యిది నీ కల్పితమే
తలపోసి మెలఁగ నీ దాసులెఱుఁగుదురు ॥ఆహా॥

రేకు 78 సంఖ్య 418 సంపు 21 పుట 281

సీ. చేఁజిక్కినట్లుండు. చెప్పుదనుక జ్ఞాన
మాబోధగడవ నట్టట్టుపోవు;
జాతితోఁ జేసిన భాతినుండు శరీర
మాత్మయెడసినంత నదవదలగు;
కల నిదురించుదాఁక నిజమ్మువలె నుండు
పక్కన మేల్కన బట్టబయలు;
దక్కినట్టులె యుండు ధనము ధాన్య మ్మింటఁ
జక్క ననుభవింప సరికి సరియు;

గీ. సులభముగ నుండు నెల్లరు చూడ లోక
మింత చేకొనఁగోరిన నెలయఁ జేయు;
నిది భవత్కల్పితంబని నిన్నెలమి గొల్చు
దాసు లెఱుఁగుదు రీ చిక్కు దాఁటు విధము.

బౌళి

ఏమఱఁజనదు ఖ్రితికేటికాలము యెఱిఁగి మహాత్ములకును
శ్రీమంతుఁడగు హరినే తలఁచిన చీకటు లన్నియుఁ బెడఁబాయు ॥పల్లవి॥
చేరి వుండెడిది బ్రహ్మలోకమట శ్వేతుఁడను రాజట భువిమీఁదికి
కారణమున నేతెంచి నిత్యమును కళేబరం బట తన కాహారము
ఆరయ సంపద రే పనికి వచ్చునట లోకాంతరగతి నే మున్నది
శ్రీరమణునికే శరణుచొచ్చినను చెడనిభోగములు చేచేతఁగలుగు ॥ఏమ॥
చేసినక్రతువులు నూఱట నహుషుఁడు చెలఁగుచు దేవేంద్రపట్ట మేలనట
దోస మింతకంటెఁ గా భువిపైఁ దూలుచుఁ బాము పడియెనటా
ఆసలఁ గర్మము ట్టునమ్మెడిది అమరత్వము ఫలమది యెట్లెంచుట
వాసుదేవునిఁ గొలిచి తా నతనివాఁడై యుండిన నెలకొనుశుభము ॥ఏమఱ॥
వెలయఁగ త్రిశంకుఁ డనియెడి రాజట విశ్వామిత్రుని పరిగ్రహం బట
అలరిన చండాలత్వ మొందెనట యంతరిక్షమున నుండెనటా
బలములు యెందాక వెంటవచ్చు నుపాయంబులు మఱి చెప్పఁగనేరా
యిలధరుఁడగు శ్రీవేంకటేశ్వరుని నెఱిఁగి దాసుఁ డగుదే సత్ఫలము
॥ఏమఱఁ॥

రేకు 47 సంఖ్య 267 సంపు 21 పుట 180

సీ. ఆవాస మజలోక; మాహార మవనిలో
నరకళేబరము; తా ధరణిపుఁ డట
శ్వేతుండు_ చింతింప సిరులు, లోకాంతర
స్థితి తన కిడునె సుస్థిరసుఖాలు ?
కావించె నఁట నూఱుక్రతువు; లేలెను స్వర్గ
మల నహుషుండు పామగుచు నేలఁ
బడెనంట_ కర్మమ్ము భవ్యదేవత్వమ్ము
తన కీయఁగలవె శోభనసమృద్ధి ?
పుడమితేఁ డఁట త్రిశంకుఁడు; మాలఁడై దివి
కేఁగఁ గౌశికు సాయ్యమొసఁగె నంట
బలము లుపాయమ్ములుఁ దపనికివచ్చునె ? తన్ను
నిరపాయపదవిలో నిలుపఁ గలవె ?
గీ. కాల మేమఱఁజనదు నిక్కము గ్రహించి
కంసరిపుఁగొల్వఁ జెడని భోగములు గలుగుఁ;
గుంభినీధవు మెచ్చ నెక్కొను శుభాలు;
వేంకటేశుదాసుండైన విభవ మొదవు.

## శుద్ధవసంతం

అన్నిటికీ మూలము శ్రీహరియె సుండి
విన్నవార కన్నవార విచారించుకొనుండీ ॥పల్లవి॥

దైవమును దలఁచక తత్వమును నెఱుఁగక
భావించుధ్యానము బట్టబయలు సుండీ
త్రోవ దెలుసుకొనక దొడ్డమతస్థుఁడు గాక
కావలెనంటే మోక్షము కలుగదు సుండీ ॥అన్నిటికీ॥

అతిభక్తి నిలుపక హరిఁ గొనియాడక
వెతకేటిచదువులు వృథా సుండీ
యితరము లుడుగక యిన్నిటిపై రోయక
జితకాముఁడు గాఁబోతే చిక్కఁడు సుండీ ॥అన్నిటికీ॥

పాపములు విడుపక పరిశుద్ధుఁడు గాక
యేపున జన్మఫల మీడేరదు సుండీ
దాపుగా శ్రీవేంకటేశుదాసుఁడ నందేఁ గాక
తీపుల బ్రహ్మానందము తిరము గాదు సుండీ ॥అన్నిటికీ॥

రేకు 52 సంఖ్య 295 సంపు 21 పుట 199

సీ. దైవమ్ము దలఁపక తత్త్వమ్ము నెఱుఁగక
భావించు ధ్యానమ్ము బయలుసుండి
దొడ్డమతస్థుఁడై త్రోవ దెలిసికోక
కావలె నన ముక్తి గలుగదు సుఁడి
అతిభక్తి నిలుపక హరి గొనియాడక
వెదకెడి చదువులు వృథయె సుండి
ఇతరమ్ము లుడుగక యిన్నింటి రోయక
జితకామభావమ్ము చిక్కదు సుఁడి

గీ. పాపములు వీడి పరమపావనుఁడు గాక
యేపునన్ జననఫల మీడేరదు సుఁడి
కొండలప్పని కెపుడు దాసుండు గాక
బ్రహ్మనిర్వాణ మింత చేపడదు సుండి

కాంభోది

చూచేవారికిఁ గలిమి సుఖమే తోఁచుఁగాని
యేది కావడిమోచేవా డెఱుఁగునాఁ వేఁగు ॥పల్లవి॥

పక్కెరగుఱ్ఱము గంటే పరులకే సింగారము
గుక్కక దానికే మోపు గుద్దకొలఁది
కిక్కిఱిసి యధికువాకిటనుండు సిరు లెల్లా
వెక్కసమై యానుకొన వేసటేను నాతనికి ॥చూచే॥

గడాటాడేవానిఁ గంటే కన్నవారికి వేడుక
అడుగడుగు ప్రియాస మటువానికి
బడినుండుఁ జతురంగబలములు దొరకును
చిడిముడి శత్రులపై చింతే యాతనికి ॥చూచే॥

పాములవానిఁగంటే పడుచుల కానందము
వోముచుఁ బ్రాణము వట్టుకుండు నాతఁడు
యీమేర శ్రీవేంకటేశ యిల్లెలాఁ బైఁడి ఘనుస
కామెయి భోగించదీర దాతని కే హద్దుసు ॥చూచే॥

రేకు 60 సంఖ్య 286 సంపు 21 పుట 193

సీ. చూచువారికి కల్మి సుఖమొండె తోఁచు కా
వడివేగ్రుఁగు మోచెడువాఁ డెఱుంగ;
పక్కెరగుఱ్ఱముఁ బరికింప సింగార
మొద్దకు; బరువెంచ గ్రుద్దకొలఁది;
అధికునివాకిట నడరును సిరులెల్ల
నతనికి వేసట యానుకొనఁగ;
గడయాటకానిని గనువారలకు వేడ్క
యడుగడుగు ప్రియాస మతని కరయ;
బడినుండుఁ జతురంగబలములు, కాని యా
తని కెల్లప్రొద్దు శాత్రవుల చింత;
గీ. పడుచులకుఁ బ్రీతి పాములవానిఁగన్న
నుసురు లఱచేత నిడుకొని యుండు నతఁడు;
ఘనున కెల్లెలఁ బైఁడియే- కాని వాని
కెపుడు భోగింపఁ దీఱదు వృషగిరీశ !

## శంకరాభరణం

ఇందునందునేచ భేద మెంతైనఁగలదు
చిందరవందరగాక చేతికి లోనయ్యీనా ||పల్లవి||

దేవునిగొలుచువాఁడు దేవునికి కొలఁగాక
యీపల సంసారుల కేమిబాఁతి
కాపురపుమనుజుల కని కొలిచేవారికి
దైవికము విచారించ తలఁపున్నదా ||ఇందు||

పరము గోరేటివాఁడు పరమునకె కొలఁగా
కిరవై యింద్రియముల కేమిబాఁతి
వొరసి భోగములలో నోలలాడేవానికి
అరిది మోక్షసుఖము లాసపడనున్నదా ||ఇందు||

పనిగొన్న భక్తివాఁడు భక్తికి కొలఁగాక
యెనసి కర్మవిధుల కేమిబాఁతి
మని శ్రీవేంకటేశుమాయఁ జిక్కినవానికి
తనిసి భవబంధముల దాఁటఁగఁ జోటున్నదా ||ఇందు||

రేకు 27 సంఖ్య 153 సంపు 1 పుట 102

సీ. స్వామిఁ గొల్చెడివాఁడు స్వామికిఁ / ఐగాక
యివల సంసారుల కేమిభ్రాంతి
కాపరంపు నరులఁ గని కొల్చువానికి
దైవమ్ముఁ జింతింపఁ దలఁపు గలదె ?
పరముగోరెడువాఁడు పరముకే కొలఁగాక
యింద్రియచయముల కేమిభ్రాంతి ?
ఒరసి భోగములలో నోలలాడెడువాని
కరిది మోక్షసుఖంపు టాసగలదె ?

ఆ. భక్తిగలుగువాఁడు భక్తికిఁ గొలఁగాక
యెనయు కర్మవిధుల కేమి భ్రాంతి ?
శ్రీనివాసుమాయఁ జిక్కినవానికి
దాఁటుటాని భవము దాఁటువశమె ?

బౌళి

ఇటువంటివారల నెట్టు బోధించఁగ వచ్చు
కుటిలపుబుద్ధులచే కుందుదురు తాము ॥పల్లవి॥

పాపపుణ్యకర్మదేహి పసిరికాయపురువు
కూపములోని కప్ప దుర్గుణబద్ధుఁడు
దీపము వేటమృగము తెగని యాసోదకాఁడు
దూపము కాకిభక్తి యెందును లేనివాఁడు ॥ఇటు॥

మతిచంచలపువాఁడు మద్దెలలోనియెలుక
వ్రతియై కోరెడువాఁడు వలలో మీను
కుతిలపుటహంకారి గుండెమీఁది చింబోతు
అతికాముకుఁడు జిగురంటుకొన్న పికిలి ॥ఇటు॥

దేవతాంతరపరుఁడు తేనెలోఁబడిన యీఁగ
భావించి కానివాఁడు పైసికొక్కెర
శ్రీవేంకటాద్రీశ్వరు సేవించక మోక్షానకుఁ
బోవల ననేటివాఁడు బూరుగుపై చిలుకా ॥ఇటు॥

రేకు 66 సంఖ్య 378 సంపు 21 పుట 254

సీ. కూపభేకమ్ము దుర్గుణబద్ధుఁ, డఘపుణ్య
కర్మదేహి పసిఁడికాయపురువు,
చలమనస్కుండు మద్దెలలోని యెలుక, స
ద్భక్తివిహీనుండు వాయసంబు,
వలలోని మచ్చెమ్ము వ్రతియయికోరువాఁ,
డతికాముకుఁడు జిగురంటు పికిలి,
కుటిలుఁ డహంకారి గుండెపై చింబోతు,
వెడగుమనుష్యుండు వేటమృగము
గీ. దేవతాంతరపరుఁ డెంచ తేనెఁబడిన
యీఁగ, భావించి కానని హీననరుఁడు
కొంగ, హరి గొల్వకయ ముక్తి కంగవించు
వాఁడు బూరుగువృక్షముపైని చిలుక,

గుజ్జరి

అంతరంగములో నున్న హరియే గతిగాక
చింతించి మొక్కితేఁ దానే చేకొని రక్షించును ॥పల్లవి॥

పుట్టించిన కర్మమే పోషించకుండునట
బెట్టుగా మనసే మరపించునట
పట్టయిన దేహమే బతిమాలింపించునట
చుట్టము లెవ్వరు యెంచిచూచినఁ బ్రాణికిని ॥అంత॥

పక్కన విత్తినభూమి పంట పండకుండునట
యెక్కడా మాయే భ్రమయింపించునట
అక్కరతోఁ జేసిన పుణ్యమే కట్టివేసునట
దిక్కుదెస యెవ్వరు యీ దేహిఁ గరుణించను ॥అంత॥

ఆసలఁబెట్టే ప్రాయమే ఆటమట మౌనట
చేసే సంసార మజ్ఞానిఁ జేయునట
వేసారక యింతకూ శ్రీవేంకటేశుఁ డేలికట
మోసపుచ్చేవా రెవ్వరు ముదమే జీవునికి ॥అంత॥

**రేకు 67** **సంఖ్య 382** సంపు 21 **పుట 257**

సీ. పుట్టించు కర్మమే పోషింపదఁట, తల
పించు చిత్తమె మఱపించునంట
పట్టగు దేహమే బతిమాలఁజేయునం
టెవరు ప్రాణికి బంధు లెంచిచూడ ?
ప్రక్క విత్తినభూమి పంటలు పండదం
టెందుమాయయె భ్రమయించునంట
కావించు పుణ్యమే కట్టి వేసెడునంట
యీ దేహి గరుణింప నెవరు దిక్కు ?

గీ. ఆసలంబెట్టు ప్రాయమే అటమటమఁట
చేయుసంసారమే అజ్ఞుఁ జేయునంట
యింతకును వేంకటేశ్వరుఁ డేలికంట
తానె చేకొని రక్షించు దండ మిడఁగ.

## భై ర వి

వానివానిస్వభావము వద్దనరాదు
తానందుఁ దొరలనంటే తప్పులు లేవు ॥పల్లవి॥
సొరిది చింతపులుసు చూచితే నోరూరును
పరుసలం జవిగొన్న వాఁడుగాఁడు
పరగ దేహప్రకృతిపదార్థగుణము లవి
తొరల కెఱుఁగుకొంటె దోషములేదు ॥వాని॥
నెఁకొన్న యింతుల వర్ణించితే బుద్ధి చలించు
వలసి యంటిముట్టినవాఁడు గాఁడు
తలఁపులక్ష్యము గుఱిదాఁకిన భావము లవి
తలఁకక తెలిసితే తగులేమి లేదు ॥వాని॥
రీతితో సర్పమును మంత్రించితే కరవదు
వాత సూత్రముగట్టినవాఁడు గాఁడు
యీతల శ్రీవేంకటాద్రియీశ్వరు మహిమ లివి
యేతులఁ గొలిచితేను యే కర్మము లేదు ॥వాని॥

రేకు 47 సంఖ్య 266 సంపు 21 పుట 179

సీ. సొరిది చింతపులుసు చూచిన నోరూరు
వలనుగఁ జవిగొన్న వాఁడు కాఁడు;
ఇయ్యవి దేహప్రకృతిపదార్థగుణమ్ము
లెఱిఁగిన దోష మింతేని లేదు;
నారుల వర్ణించినన్ బుద్ధి చలియించు
వడి నంటిముట్టినవాఁడు కాఁడు
తలఁపు లక్ష్యము గుఱిదాఁకిన భావమ్ము
లివి తెలిసినఁ దగు లేమి లేదు;

గీ. కఱవ దురగమ్ము మంత్రింపఁ; గాని దాని
వాత సూత్రమ్ముగట్టినవాఁడు కాఁడు;
మంగపతి వేంకటేశ్వరు మహిమ లివ్వి
మది నిలిపి కొల్వ నెట్టి కర్మమ్ము లేదు.

గౌళ

ఘనసంసారుల కెల్ల కర్మమై పొడచూపు
ననిచి యింతకు గురి నరహరి వొక్కఁడు ॥పల్లవి॥

యెలమిఁ బుణ్యములెల్ల యింద్రలోకమై తోఁచు
నలుంద పాపములే నరకలోకమై తోఁచు
పొలసి రెండుఁ సరియైతే భూలోకమై తోఁచు
కలవాఁ డొక్కఁడే గుటి కమలావిభుఁడు ॥ఘన॥

పరగ రాజసులకు బ్రహ్మయై పొడచూపు
గరిమ తామసులకు కటకంతుఁడై యుండు
సిరుల సాత్వికులకు శ్రీకాంతుఁడై మించు
నిరవైనవాఁడు శ్రీహరి యొక్కఁడే ॥ఘన॥

ఆయ మెఱిఁగినవారి కంతరాత్మయై యుండు
చాయ గన్నవారికి జగమెల్లనై తోఁచు
చేయఁగన్న వారికి శ్రీవేంకటేశుఁడై తోఁచు
యేయెడవారికి గుటె యీ దేవుఁ డొక్కఁడే ॥ఘన॥

రేకు 87 సంఖ్య 210 సంపు 21 పుట 140

సీ. నరవి పుణ్యము లెల్ల స్వర్లోకమై తోఁచుఁ
గలుషముల్ నరకలోకముగఁ దోఁచు
పోరి రెండు సరియైన భూలోకమై తోఁచు
నన్నింటికిన్ గుఱి హరి యొకండె;
పరగ రాజసులకు బ్రహ్మమై పొడసూపు
తానుండు రుద్రుఁడై తామసులకు;
సాత్త్వికులకు రమాజానియై నెఱిమించు
నిరవైనవాఁడు శ్రీహరి యొకండె;

ఆ. ఆయ మెఱుఁగువారి కంతరాత్మయు, చాయ
గన్నవారలకు జగంబు, చేయఁ
గన్న వారికెల్ల గరుడాద్రిమందిరుం
డై వెలంగువాఁడు హరి యొకండె.

సాళంగనాట

మునులాల జనులాల ముంచిన దేవతలాల
పనిపూని మొక్కరో పరమాత్మునికి ॥పల్లవి॥

కనకాచలమువంటి ఘనదివ్యరథముపై
వనజాక్షుఁ డెక్కి వీథివచ్చీవాఁడె
వెనుదళమై నడచె విష్వక్సేనుఁ డిదె దేవిడి
కని మని సేవించరో కన్నులపండుగలు ॥మును॥

గగనవాహినివంటి గరుడధ్వజముతోడ
అగడై వీథినేఁగే చక్రాయుధుఁడు
పగటువిజయముతో పాంచజన్యము పట్టిని
నిగిడి కొనియాడరో నిచ్చకల్యాణములు ॥మును॥

వరుస భాగ్యదేవతవంటి యలమేలుమంగ
వుర మెక్కఁగ శ్రీవేంకటోత్తముఁడు
తిరమై నెలవుకొనె దివ్యనగరులోనను
శరణని బదకరో సాక్షాత్కారమున ॥మును॥

రేకు 34 సంఖ్య 192 సంపు 21 పుట 128

1. మునులార ! జనులార ! అనిమిషవరులార !
చేయెత్తి మ్రొక్కరో శ్రీధరునకు
కనకాచలమువంటి ఘనదివ్య రథమెక్కి
వనజనేత్రుఁడు వీథివచ్చె వాఁడె
వెనుదళమై నడచెను సూత్రవతిభర్త
కన్నులపండువుల్ కనరొ మనరొ
గగనవాహినివంటి గరుడధ్వజముతోడ
నటు వీథినేగెఁ జక్రాయుధుండు
భండనమ్ముల గెల్చి పాంచజన్యము వట్టి
స్తుతియింపరో నిత్యశోభనములు

గీ. మించు భాగ్యదేవత యలమేలుమంగ
యురము నెక్కంగ శ్రీవేంకటోత్తముండు
నెలవుకొనె తిరునగరిలో నిండుభక్తి
శరణనుచుఁ గొల్చి బ్రదుకరో వరము లంది.

దే సా ళం

ఏ విచారములు వొద్దు యీతఁడు రక్షకుఁడు
శ్రీవల్లభుండె వీఁడు చేకొని కాచీని ॥పల్లవి॥

పలుమారు బొడ్డునను బ్రహ్మఁగన్న తండ్రి పేరు
దలఁచినవారికి సంతాన మిచ్చీని
కలిగి పాదములను గంగపుట్టించినవాని
కొలువరో యీతఁడు కోరిక లిచ్చీని ॥ఏవిచా॥

మొదలనెన్నికతో కామునిగన్నవానినే
కదిసి పూజించరో కరుణించీని
కదలక బ్రహ్మాండము గర్భమున మోచిన
యెదుటి వారికి మొక్కుఁ డిన్నియును నిచ్చీని ॥ఏవిచా॥

గరుడగంభము వద్ద గల శ్రీవేంకటపతి
వరుస సేవించరో వర మిచ్చీని
అరిది విశ్వకుటుంబియైన వీనికి మొక్కరో
పరగఁ దామరతంపముగాఁ జేసీని ॥ఏవిచా॥

రేకు 82 సంఖ్య 180 సంపు 21 పుట 120

సీ. కమలజు బొడ్డునఁగన్న వెన్నుఁడు తన్నుఁ
దలఁచువారలకు సంతాన మిచ్చు
నిజపాదముల గంగ సృజియించిన మురారి
కొలిచినవారికిఁ గోర్కు లిచ్చు
కడుపారఁ గామునిగన్న రమాపతి
గదిసి పూజించినఁ గరుణఁ జూపు
బ్రహ్మాండములను గర్భమునఁ దాల్చిన హరి
అంజలిఘటియింప నన్ని యొసఁగు

గీ. గరుడగంబముకడనుండు తిరుమలప్ప
వరుస సేవించువారికి వరము లిచ్చు
నే విచారాలు వద్దు నీలావిభుండు
వీని విశ్వకుటుంబి సేవింపరయ్య!

దే వ గాం ధా రి

ఓపికగలవారికి వొడినుండునవి రెండు
పైపైఁ జేకొనేటివారి భాగ్యము కొలఁదులు ॥పల్లవి॥

సేసినంతపుణ్యము సృష్టిలోనివారి కెల్ల
ఆసల బహుఫలము హరిదాస్యము
త్రాసువంటిది కర్మము దైవముపై భక్తియైతే
బాసదప్పక పండిన పంటవంటిది ॥ఓపిక॥

గడించినంతే ధనము కైకొనేటివారి కెల్ల
అడరి విజ్ఞానధన మక్షయం
సుడివంటిది సంపద చుట్టఁబెట్టుచునుండు
ఆడచి నిరాశ బ్రహ్మానందమువంటిది ॥ఓపిక॥

ధర నాడినంతే మాట తగు నక్షరజ్ఞులకు
హరినామోచ్చారణ మక్షయం
యిరవై శ్రీవేంకటేశుఁ డిందుల కధిదేవత
సిరతి నితనికృప నిధానమువంటిది ॥ఓపిక॥

రేకు 36 సంఖ్య 195 సంపు 21 పుట 130

సీ. చేసినమట్టుకే సృష్టిలో పుణ్యమ్ము
పరమాత్మదాస్యంబు బహుఫలంబు
త్రాసువంటిది కర్మ; బాసదప్పక పండు
పంటవంటిది దైవపరమభక్తి
గడియించుపాటిదే కైకొనుసంపద;
జ్ఞాన మనంగ నక్షయధనంబు;
అరయు నిరాశ బ్రహ్మానంద మట్టిది;
సుడివంటి దీ సిరి చుట్టఁబెట్టు;
ఆ. అక్షరజ్ఞులకును నాడినంతయె మాట;
హరిపవిత్రనామ మనవధికము;
అఖిలమునకు శ్రీశుఁ డధిదైవతము; వాని
కరుణ యెన్నటికిని తఱుగని నిధి.

భూపాళం

కాయ పండుసేయఁబోతే కడు పులుసేఁగాక
యేయెడ తీపుగాదు యిటువంటిదే ॥పల్లవి॥
కోపమెల్లా నొకవంక కూడవేసి మఱికదా
పైపై హరిఁదలఁప పాత్రుఁ డయ్యేది
తైపుగాక రుచులపై కాంక్షమాని మఱికదా
యోపి లోకములం సడ్డ నొల్లకుండేది ॥కాయ॥
పంచేంద్రియముల నెల్ల పారఁదోలి మఱికదా
పుం: పువిరక్తి కెల్ల నొడిగట్టేది
కొంచెపుకోరికెల్ల కోరకుండే మఱికదా
పంచి హరిదాసులలో పహి కెక్కేదీ ॥కాయ॥
పేలు పనులెల్ల విడిచిన మఱికదా
శ్రీవేంకటేశ్వరునిఁ జింతించేది
భావించి యితని దాసపరికరమై కదా
తోఁపచూచి మోక్షము తుద కెక్కేది ॥కాయ॥

రేకు 22 సంఖ్య 127 సంపు 21 పుట 84

సీ. కోపమ్ము మొదలంటఁ గూల్చివైచినఁ గదా
పరమాత్ముఁ దలపోయఁ బాత్రుఁ డగుట;
కడుకొను రుచులపైఁ గాంక్ష మానినఁగదా
యోపి లోకముసడ్డ నొల్లకుంట;
పంచేంద్రియమ్ముల పాఱఁదోలినఁ గదా
యుల్లమ్మున విరక్తి యునికి గొనుట;
కొనలెత్తు కోరికల్ గోసివైచినఁగదా
వహికి నెక్కుట దాసవర్గమందు;
ఆ. కాయ పండొనర్పఁ గడుపులుసేగాక
తీపిగానియట్లు తిరుమలేశు
దాసుఁ డగుచుఁ గర్మతతి వీడినం గదా
తాను పరమపదము దొరిగనుట.

పాడి

వేగిర మేఁటికిని వేసట లేఁటికిని విష్ణుని పొలయఁగ నేల
సాగిలిమొక్కి నతఁడు మన్ననలు జరపినపాటి జరపీగాక ॥పల్లవి॥
తనవేరే తన కన్నుదాఁకినను తా నెవ్వనిఁ గోపించీని
తన కర్మమే తన్నుఁ జేయఁగ దైవము దూరఁగనేల
అనుభవించుచును హరినే కొలిచిన అలమట లన్నియు హరిమాచి
పొసఁగక తమలో దుర్దోషంబులు పొమ్మన్నపుడే పోయీఁగాక ॥వేగిర॥
కడుపులోపలికి మింగిన రత్నము కడుచోట్ల వెదకఁగ నేల
బడిఁ దన యంతర్యామి దా మఱచి పలువేల్పులఁ గొలువఁగ నేల
విడువక శ్రీపతినామమంత్రమే వేడుకఁ దలఁచఁగఁ దలఁచఁగను
చెడకుండా నతఁడు పావనముసేసినప్పుడే సేసీగాక ॥వేగిర॥
కర్మము నతఁడే కార్యము నతఁడే కదఁగిన శ్రీవేంకటవిభుఁడా
నిర్మించినట్లపు నిన్నియు మరి నేఁ దనుమానము లేల
ధర్మం బితనికి యే కాలంబును దాసుల రక్షించే బిరుదు
అర్మిలి నితనిఁ గొలిచినఁ జాలును అందనిపదవులు సందీఁగాక ॥వేగిర॥

రేకు 26 సంఖ్య 151 సంపు 21 పుట 160

సీ. తన వేళ్లు తనకన్ను దాఁకిన నెవ్వనిఁ
దాను కోపించును ? తనదు కర్మ
మట్లుసేయఁగ దూఱనగునె దైవమును ? తా
ననుభవించుచు ముకుందుని భజింప
నలమట లన్నియు నాతండు గని దోష
ములఁ బొమ్మనినవేళఁ బోవుఁ గాక
కడుపులోనికి మ్రింగఁబడిన రత్నమునకై
వేఱుతావులఁ దాను వెదకనేల ?
మఱచి యంతర్యామి మఱి పలువేల్పులఁ
గొలువంగ నేల ? వైకుంఠునామ
మంత్రము దలపంగ మాటి కాతఁడు శుచిఁ
జేసినప్పుడె తన్నుఁ జేయుఁగాక
గీ. అతఁడె కర్మమ్ము; కార్యమ్ము నతఁడె; కడఁగి
యతఁడు నిర్మించినట్లపు; నతని కెప్డు
దాసజనరక్షణంబు సద్ధర్మ; మతని
భక్తి సేవించినన్ సర్వపదవు లబ్బు.

ల లి త

**ఆతుమ సంతోసపెట్టు టది యెఱక తా**
**నే తెరువు వొల్లకుండు టిదియె యెఱుక** ॥పల్లవి॥

ముంచినబంధముల మునుఁగువడక తా
సంచలం విడఁదన్ను టది యెఱుక
చంచలపువిషయాల సగ్గడ ముగ్గడు గాక
యెంచి హరిఁదలపోయు టిదియె యెఱుక ॥ఆతుమ॥

పాయని యర్థములకు బంటు బంటై తిరుగక
ఆయితమై మోసపోని దది యెఱుక
పాయపుకామినులతో పలుమారుఁ జేయుపొందు
హేయముగఁ దలపోయు టిదియె యెఱుక ॥ఆతుమ॥

ధరమీఁదఁగల ప్రాణితతుల నొప్పించక
అరయఁగ సముఁ డవుటి యది యెఱుక
గిరిపై శ్రీ వేంకటపతిదాసుఁడై
యిరవొంద సుఖియించు టిదియె యెఱుక ॥ఆతుమ॥

రేకు 15 సంఖ్య 81 సంపు 21 పుట 54

సీ. ముంచెడుబంధాల మునుకలు వేయక
యంచెల విడదన్ను టదియు యెఱుక
చంచలవిషయాల సగ్గక మ్రగ్గక
యచ్యుతుఁ దలపోయు టదియు యెఱుక
బంటు బంటై సిరివెంటఁ జరించుచు
నటు మోసపోవని దదియు యెఱుక
ప్రాయపుఁ జెలులతోఁ జేయు సంగాతమ్ము
హేయమ్ముగా నెంచు టదియు యెఱుక

ఆ. ధరణిగలుగు ప్రాణితతుల నొప్పించక
సదయుఁడు సముఁడౌట యదియు యెఱుక
పరముఁడైన మంగపతిదాసదాసుఁడై
యెప్పుడు సుఖియించు టదియు యెఱుక.

## సామంతం

తరి నిధానము గన్నదాఁకా దరిద్రఁబు
స్థిరముగా కివి గనిన సిరు లేమి బ్రాఁతి ॥పల్లవి॥
మొదల గోవింద యను మూఁడక్షరంబులును
పదిలముగ నోరఁ బనుపడు దాఁకానె
కదియుఁగా కాపదలు కలుషములు జీవులకు
చెదరుగా కివి గనిన సిరు లేమి బ్రాఁతి ॥తరి॥
నారాయణా యనెడి నాలుగక్షరములు
పేదకొని నోరి కబ్బిన దాఁకానె
ఘోరి దుఃఖములు నలపులు సదా జీవులకు
చేరినా యవి గనిన సిరు లేమి బ్రాఁతి ॥తరి॥
వేంకటేశ్వర యనెడి వేదపంచాక్షరము
అంకురంబయి నోరి కపుదాఁకానె
ఒంకెనలు నలపు నలఁగాక జీవులకు
యింక నివి గనిన సిరు లవియేమి బ్రాఁతి ॥తరి॥

రేకు 9 సంఖ్య 461 సంపు 21 పుట 311

. మొదల గోవిందయన్ మూఁడక్షరంబులు
పదిలమ్ముగా నోట మెదలువఱకె
కదియుగా కాపదల్ కలుషముల్; జీవుల
కివి యొదవిన సిరు లేమి బ్రాఁతి ?
నారాయణా యన్న నాలుగక్షరములు
దబ్బున తమనోటి కబ్బువఱకె
ఘోరదుఃఖమ్ములు పొడమును గా కివి
యెలసిన సిరులకు నేమి బ్రాఁతి ?
గీ. వేంకటేశ్వర యనునట్టి వేదవినుత
పరమపంచాక్షరాల్ నోటపడెడువఱకె
యలపు లలజడుల్ జంకెనః లవల జీవు
లేడఁగన్నను సిరులకు నేమి బ్రాఁతి ?

సా రం గ నా ట

హరిదాసుల మహి మర్లదివో
నరులు యిదే నమ్ముటగాక ॥పల్లవి॥

పెక్కుతపస్వులు పెద్దలు ఋషులు
చుక్కలై యున్నారు చూచితిరా
యెక్కడి ముగితి యెవ్వరి కున్నది
వొక్క శుకునకే యొనరెఁగాక ॥హరి॥

తీరని యమృతపుదేవత లిందరు
మేరువం దున్నారు మెచ్చిరిరా
యీ రీతి వైకుంఠ మెవ్వరి కున్నది
నారదాదులకే నరిచెఁ గాక ॥హరి॥

అందు నీకాకాతమనటి ( ? ) బ్రహ్మముఁ
పొంది యెవ్వరైనఁ బొడగంటిరా
విందువలనే శ్రీవేంకటేశ్వరునిఁ
జెంది వరమ్ములు చేకొంటిరా ॥హరి॥

రేకు 20 సంఖ్య 451 సంపు 21 పుట 304

సీ. పెక్కురు తపసులు పెద్దపెద్ద ఋషులు
చుక్కలైయున్నారు చూచినారె!
యెక్కడి కైవల్య మెవ్వరి కున్నది
ఒకశుకయోగికే యొనరెగాక
దివ్యామృతముగొన్న దేవత లిందఱు
మేరువం దున్నారు మెచ్చినారె
ఈ రీతి వైకుంఠ మెవ్వరికున్నది
నారదాదులకె చేకూరెఁ గాక

గీ. అక్కటకటా! నిరాకార మనెడి బ్రహ్మ
మెవ్వరైనను బొడగంటిరే? వృషాద్రి
వల్లభుని విందువలెఁ జెంది వరము లందు
కొంటిరే? దాసమహిమకు కొలఁది లేదు.

శంకరాభరణం

తనమనసే తనకు తారుకాణ వచ్చుఁగాగ
వినుకలి పరబుద్ధి వీనులఁబట్టినా ॥పల్లవి॥

చుట్టమైనవాఁడు తన చోటికి నమ్మికగాక
వెట్టివాఁడు సతమౌనా వేగినంత తాను
అట్టే తనయింటియన్న మాఁకటి కొదుగుఁదాక
పొట్టఁబోరుగువిందులు పొద్దుదప్పకుండునా ॥తన॥

వాడియైన యిల్లాలు వంశమున కెక్కుఁగాక
కూడగొట్టుకాంత తన కుల మయ్యీనా
వాడలో మంచిగుణము వాసివన్నెఁ దెచ్చుఁగాక
యేదనైనా యపకీర్తి హీనమే కాదా ॥తన॥

యెక్కువ హరిఁగొల్చితే నిహపరము నిచ్చుఁగాక
తక్కిన దేవత లింతటి కోపేరా
చక్కని శ్రీవేంకటేశుఁడు సర్వాంతరాత్మకుఁడు
తక్కక మనుజులాల తలఁచి బ్రదుకరో ॥తన॥

రేకు 77 సంఖ్య 446 సంపు 21 పుట 300

. తన చుట్టమగువాఁడు తనకు నమ్మికగాక
వెట్టివాఁడు సతంబె వేగినంత ?
ఆఁకటి కొదవుఁబో యాత్మగృహాన్నంబు
పొరుగువిందుల కున్న ప్రొద్దుదప్పు;
తన కూర్మియిల్లాలు తగుఁగాక నడువీథి
వెలయాలు వంశాభివృద్ధి కగునె ?
వాసిదెచ్చుంగాక వాడలో సుగుణంబు
హీనమే యపకీర్తి యేడనైనః

గీ. ఇచ్చు తనుఁగొల్వ లక్ష్మీశుఁ డిహపరమ్ము
లితరదేవత లేమి తా మీయఁగలరు ?
అహిగిరీశుండు సర్వాంతరాత్మకుండు
మది దలఁచి కొల్చి బ్రదుకరో మనుజులార !

గుండక్రియ

ఇంచుకంత ధర్మములో నున్నది యిందరిమేలును గీడును
వంచనతోడుతఁ గైకొనఁదలఁచిన వారల నేరుపు లింతేకాని ॥పల్లవి॥
నరకము లనుభవించితి నని తలఁచిన నరిఁజెడుఁ బ్రారబ్ధకర్మములు
పరదారాదులఁ గలయఁ దలఁచిన పాపము వెల్లనుఁ జుట్టుకొను
సురలచరిత్రము విననయంతలో సుకృతియై వెలయుఁ బురుషుఁడు
దురితచిత్తుల విధంబులు వింటే దుష్కృత్యములకును గురియగును ॥ఇంచు॥
వచ్చినపాపమె బ్రతికినయప్పుడు శరీరసుఖములు మఱచిన ముక్తుఁడు
యిచ్చల మృతునకు విభవముసేసిన యేడకు నెక్కీదు వృథా వృథా
మెచ్చుగ నొరులకు నిచ్చినయర్థము మీఁదమీఁద ఫలియించు
తెచ్చి లోభమున దాఁచిన ధనములు తీరక భూగతమై యుండు ॥ఇంచు॥
యిఁకవేయుపైన శ్రీవేంకటేశ్వరు నెఱిఁగి కొలిచినను భవ మీడేరును
పలుకర్మంబుల నెంత దొరలినా ప్రయాసములే కడుఘనము
అలమేల్మంగ పురుషకారమున ఆచార్యునసుమతి మెలఁగును
వెలసిని లాపుల పశగతుఁడైనను వానిచందములు హరియే ॥ఇంచు॥
రేకు 70 సంఖ్య 400 సంపు 21 పుట 269

సీ. అనుభవించిన పాప మతిచాలు ననుచింతఁ
బ్రారబ్ధకర్మముల్ దూర మగును;
నలిరేఁగి పరదార గలయఁ దలంచిన
నెట్టన దురితముల్ చుట్టుకొనును;
సురచరిత్రలు విన్న సుకృతియౌ పురుషుండు
పాపులకథ విన్నఁ బతితుఁ డగును;
బ్రతికినప్పుడె చన్న భావమ్ముతో దేహ
సుఖాలు మఱచిన ముక్తుఁ డగును;
మృతునకుఁ జేసిన యతులితవిభవమ్ము
రాఁబ కెక్కునె యొక్క రవ్వయేని?
సాదుల కిడు సిరి మీఁదమీఁద ఫలించు;
లోభించినన్ మట్టిలోనఁ గలియు;
గీ. ఇంచుకంతధర్మమునందు నెసఁగు మేలు;
గురువుననుమతి శ్రీలక్ష్మిపురుషకార
మున వృషాచలనాథు భక్తిని భజింప
జన్మ మీడేఱు; కడమకర్మములు వృథలు.

గుజ్జరి

దైవముచేసినసేఁత తప్పించరాదు
కావలసిన పనులు కాకమానవు ॥పల్లవి॥

పొంకముగానివానికి బుద్ధు లెన్ని నేరిపినా
వంకర కొంకరేకాని వశముగాఁడు
సంకుఁ బూసదెచ్చి యెంత సానఁబట్ట తోమినాను
సుంకించి ముత్యముతోడి సూటికి రాదు ॥దైవము॥

యెలమితోఁ గురూపి నెంత సింగారించినాను
అలయికలేకాని అందముగాదు
మలసియిత్తడి దెచ్చి మాడలుగాఁ జేసితేను
కలసహజమేకాని కనకము గాదు ॥దైవము॥

యిరవుగా నిగ్గడికి నెంత పెండ్లిసేసినాను
పొరపొచ్చెమే కాని పొందఁగరాదు
సరుగ శ్రీవేంకటేశ్వరుదాసుఁడై తేఁ గాని
సరినేమిటా జ్ఞానము సమకొనరాదు ॥దైవము॥

రేకు 66 సంఖ్య 380 సంపు 21 పుట 255

సీ. శుద్ధమూర్ఖున కెన్నిబుద్ధులు గఱపిన
వంకరకొంకరే వశముగాఁడు
సంకుఁ బూసనుదెచ్చి సానఁబట్టినఁగాని
సుంతముత్యముతోడ సూటిగాదు
చేరి కురూపి సింగారించినన్ లేశ
మందమ్ముగాదు ప్రయాసకాని
మంచియిత్తడిదెచ్చి మాడలు చేసిన
కలగుణమ్ముడిగి బంగారుగాదు
గీ. ఇరవుగా నిగ్గడికిసల్ప పరిణయంబు
నెంతు పొరపొచ్చెమేగాని పొందురాదు
అంజనగిరీశునకు దాసుఁడైనఁ గాని
జ్ఞాన మేమిట సమకొను జాడలేదు.

దేసాళం

విరతి గలుగవలె విష్ణుభక్తుఁడు గావలె
సరవితో నుండవలె సహజయోగికిని ॥పల్లవి॥

మంతనాన నుండవలె మనసు శోధించవలె
చింతించవలె హరిని చెలఁగవలె
అంతరంగుఁడు గావలె నాసలు మానఁగవలె
సంతోసాన మించవలె సహజయోగికిని ॥విరతి॥

వెరవు గలుగవలె వెఱపు లుడుగవలె
యిరవై యెఱుకవలె యెచ్చరవలె
విరసము మానవలె వివేకించుకొనవలె
సరుగ మౌనిగావలె సహజయోగికిని ॥విరతి॥

భావించుకొనవలె పదరకుండఁగవలె
కావలెఁ బరిపూర్ణుఁడు కరుణవలె
శ్రీవేంకటేశ్వరుని సేవే కలుగవలె
సావధానుఁడు గావలె సహజయోగికిని ॥విరతి॥

రేకు 58 సంఖ్య 382 సంపు 21 పుట 223

సీ. మంతనంబుననుండి మనసును శోధించి
చింతించవలె హరిఁ జెలఁగవలయు;
హరి కాంతరంగికుండయి యాశ విడనాడి
సంతోషిగావలె సహజయోగి;
వెరవు లరయవలె వెఱపు లుడుగవలె
నెచ్చరవలె మంచియెఱుక గలిగి;
విరసమ్ము మాని వివేకించుకొనవలె
సరి మౌనిగావలె సహజయోగి;
గీ. పదరకుండవలయు భావించుకొనవలె
పూర్ణుఁ డగుచుఁ గరుణ బొదలవలయు;
విష్ణుభక్తుఁ డగుచు విరతి నొందగవలె
సావధానుఁ డగుచు సహజయోగి.

పా డి

ఇవి నమ్మి గర్వించ నేమిటికి
వివేకించి కొలిచితే విష్ణుఁడే సతము ॥పల్లవి॥

కల రిందరుఁ జుట్టాలు కాయముతో నున్నన్నాళ్లు
వెలయ నంతటిమీఁద వింతవారే
నిలుచును విద్యలెల్లా నేరుపుగలన్నాళ్లు
తలఁపు మఱచితేను తనలోనే యడఁగు ॥ఇవి॥

యెక్కుడుగా నుతియింతు రీవిగల యన్నాళ్లు
చక్కఁగా నూరకుండితే చప్పచప్పనే
గక్కనఁ బంపుసేతురు కలిమిగలన్నాళ్లు
కక్కసానఁ బేదయైతే కైకొన రెవ్వరును ॥ఇవి॥

పను లేమైనాఁ జెల్లు బలిమిగలన్నాళ్లు
తన లావు పొగిలితేను తడఁబాట్లే
వెనకొని కొల్చితే శ్రీవేంకటేశుఁడే రక్షించు
మినుకుల భోగములు మీసాలపై తేనెలు ॥ఇవి॥

రేకు 54 సంఖ్య 306 సంపు 21 పుట 206

సీ. కలరు చుట్టమ్ములు కాయ మున్నన్నినా
ళ్లంతటి మీఁదట వింతవారె;
నిలుచును విద్యలు నేరు పున్నన్నినా
ళ్లవల మఱపుగల్గ నణఁగు లోన;
ఎక్కుడుగా మెత్తు రీవు లున్నన్నినాం
ళ్లుప్పన చప్పన యూరకున్నఁ;
బంపుసేయుదురు సంపద లున్నయన్నినా
ళ్లర్థహీనుండైన నాజ్ఞగొనరు;
గీ. బలిమిగలయన్నినాళులు పనులు చెల్లుఁ;
గలుగు తడఁబాట్లు తనలావు తొలఁగినపుడు;
బహుళభోగాలు మీసాలపైని తేని
యలు తిరుమలేశుఁడే తన్నుఁ గొలువఁ బ్రోచు.

కాంబోది

అటుగాన శరణంటి నపరాధము లెందుకు
తటుకున బ్రోదికించి దయఁజూడవే ॥పల్లవి॥
యెంచరాని నేరములు యిన్నిఁజేసి యేలికకు
వంచనతో మొక్కితే భావము గరఁగు
పొంచిపొంచి వెగటుగాఁ బోరినవాఁ డైనాను
మంచిమాటలాడితే సమ్మతి హితుఁడౌను ॥అటు॥
ఆనాజ్ఞ దోసినట్టి యాతఁడైనా యేలికకు
కానిక చేతికిచ్చితేఁ గరుణ పుట్టు
మోసముతో సొమ్మెల్లా ముచ్చిలించి తని వచ్చి
దీనతతో రెంకయితే దిగులెల్లాఁ బోవును ॥అటు॥
వాలాయించి దూరుచేసి వచ్చియైనా యేలికకు
వేళగాచి కొలిచితే వేడుకపుట్టు
యీలీల శ్రీవేంకటేశ యే జాతివాఁ డైనాను
మూల నీ ముద్ర మోచితే మునుప్పే రక్షింతువు ॥అటు॥

రేకు 76 సంఖ్య 435 సంపు 21 పుట 292

సీ. ఎన్నియో నేరమ్ము లేలికయెడఁ జేసి
పడిపడి మ్రొక్క భావమ్ము కరఁగు;
ఆజ్ఞమీఱినయాతఁ డైన నేలిక కొక్క
కానుక వెట్టినఁ గరుణ పుట్టు;
ముచ్చిలించినసొమ్ము మొత్తమ్ము దినివచ్చి
దీనత బంకైన దిగులు వాయు;
వంచనఁ బోరినవాఁడైన మంచి మా
టాడినచోఁ హితుఁ డగుచు నలుఁ;
ఆ. దూఱుచేసివచ్చి చేరి యేలినవాని
వేళ గాచి కొలువ వేడ్క గలుగు;
నిట్టు వేంకటేశ ! యే జాతివాఁడేని
ముద్రమోవఁ గరుణ మునుపె కాతు.

### గుజ్జరి

ఏమని వున్నదో యీ మనసు
కోమం మెప్పుడు కొరతే మనసు ॥పల్లవి॥
ముదిసేటివారల ములిగేటివారల
కదిసి చూచి కలఁగదు మనసు
వదలక యింద్రియవర్గంబులకే
వెదకీ నిడివో పీఁటిడి మనసూ ॥ఏమని॥

జననమరణముల చరాచరములను
కనియును మీఁదెఱఁగదు మనసూ
ఘనసంసారపుకాణాచులకే
దినదినకాంక్షల దిరిగీ మనసూ ॥ఏమని॥

కలగని యటు మేల్కని చూచి తెలిసి
వెలఁగి వెంట నడచీ మనసు
బలిమి శ్రీవేంకటపతి రక్షింపఁగ
కొలిచి యాతనికి కొసరీ మనసూ

రేకు 14 సంఖ్య 80 సంపు 21 పుట 53

సీ. ముదిసెడివారల మూల్గెడివారలఁ
గదిసి చూచియుఁ గలఁగదు మనస్సు
ఇంద్రియార్థంబుల నెప్పుడు వదలక
పీఁడియగుచును వెదకు మనసు
సకలచరాచరజననముల్ మరణముల్
గనియును మీఁ దెఱుంగదు మనస్సు
కడఁగి సంసారంపుఁగాణాచులకు నయి
దినదినకాంక్షలఁ దిరుగు మనసు

గీ. కలలు గని మేలుకని చూచి కతలు దెలిసి
నలఁగుచుఁ జెలంగుచున్ వెంట నడచు మనసు
బలిమి రక్షింప వేంకటప్రభువరుండు
కొలిచి యాతని నెప్పుడు కొసరు మనసు.

భూపాళం

శరణంటే నీవు దిక్కు సర్వేశ్వరా
నిరతి మాయావికిని నిజమేది ॥పల్లవి॥

యిన్నిటాఁ బుట్టిన దేహి కింక కులశీలమేది
చన్నఁబాలకాని కాచారమేది
పన్నినసంసారికి పరమాత్మచింత యేది
వున్నతి జంతరపుబొమ్మ కుద్యోగ మేది ॥శర॥

పంచేంద్రియబద్ధునికి పట్టి స్వతంత్రమేది
చంచలచిత్తునికి విజ్ఞానమేది
యెంచ భూతావాసుని కింకఁ జేసే ధర్మమేది
నించి మలమూత్రకాయునికి భోగమేది ॥శర॥

కామాతురునకును కర్మానుష్ఠానమేది
వాముల నిత్యలోభికి వైరాగ్య మేది
శ్రీమంతుఁడైనయట్టి శ్రీవేంకటేశ్వర నీవే
కామించి కాచితిగాక గతియేది ॥శర॥

రేకు 88 సంఖ్య 205 సంపు 21 పుట 137

సీ. ఇన్నియోనులవాని కెటుఁ గులశీలముల్ ?
చనుఁబాలవాని కాచార మేది ?
సంసారికిన్ శౌరిసంస్మరణం బేది ?
జంత్రపుబొమ్మకు జతన మేది ?
ఇంద్రియబద్ధున కేది స్వాతంత్ర్యమ్ము ?
చంచలాత్మునకు విజ్ఞాన మేది ?
మలమూత్రదేహికిఁ దలఁప భోగ మ్మేది ?
నిత్యమాయావికి సత్య మేది ?

గీ. సతతకామాతురున కనుష్ఠానమేది ?
పరమలోభికి వైరాగ్యపరత యేది ?
దయ్యములమారి కొనరించు ధర్మమేది ?
గరుడగిరిపతి గావక గతి మఱేది ?

## రా మ క్రి య

వాదమేల సారె సారె పడి ముక్తి లేదంటె
వేదాంతశ్రవణము వెట్టికిఁ జేసేరా ॥పల్లవి॥

అరయ ప్రపంచమెల్ల నభేద మయితే
గురుఁడు శిష్యుఁడ లేఁడు కూడ దర్థము
సారిది నాత్మలోన సోఽహంభావన యయితే
సరి మును దేవపూజలు చెల్లవు ॥వాద॥

సహజలీలావిభూతి సర్వం మిథ్య యయితే
బహు యాగాదికర్మము పనిలేదు
మహిలోని జననము మరణము మాయ యయితే
విహితాచారము సేయ విధిలేదు ॥వాద॥

ఘటన బ్రహ్మము నిరాకార మయితేఁ బఠియింప
యిటు పురుషసూక్తాదు లివి నీ కేల
అటు శ్రీవేంకటేశుదాస్యములేక బిగిసితే
నటలాడుకొనేటి రాక్షసమత మవును ॥వాద॥

రేకు 20 సంఖ్య 112 సంపు 21 పుట 75

విశ్వమింతయును నభేదమ్మె యయినచో
శిష్యుండు లేఁడు దేశికుఁడు లేఁడు;
ఆత్మఁ జింతింప సోఽహంభావనయె యైన
దేవతార్చనలకుఁ దావులేదు;
లీలావిభూతి శీలింప మిథ్యయె యైన
బహుయాగములతోడఁ బనియె లేదు;
పుట్టుట గిట్టుట వట్టిమాయయె యైన
నాచారములకు లే దవసరంబు;

గీ. కడకు బ్రహ్మంబె తా నిరాకారమైన
పురుషసూక్తాదులకు లేదు పుడమి నీడ;
వేంకటేశుదాస్యము లేక విఱ్ఱవీఁగ
మాటు లేటికి ? రాక్షసమతమె యగును.

సా రం గ నా ట

విచారించుకోని వారి వెఱ్ఱితన మింతేకాని
పదారించి నీ కృపను బ్రతికితి నేను ||పల్లవి||

శ్రీమహాలక్ష్మియుండఁ బొంచి దరిద్ర మేలయుండు
కామధేను వున్న చోట కరవేలయుండు
కామించి నారాయణ నీ ఘననామ మున్నచోట
తామసాలఁ బాతకాలు దగ్గరి యేలయుండు ||విచా||

చెంగట సూర్యుఁ డున్నచో చీకట్లేలయుండు
భంగించి గరుడుఁ డుండఁ బాము లేలయుండు
ముంగిట గోవిందుఁడ నీ ముద్రలు మేన నుండఁగా
అంగవికారము లయిన అజ్ఞాన మేలయుండు ||విచా||

తానే నిజమై వున్న చెంతఁ జంచల మేలయుండు
పూనఁబడి భక్తియుండ కలఁక యేల యుండు
ఆనవు శ్రీవేంకటేశ అంతరాత్మ నీ వున్నచో
అనుక శుభము లుండ నలపేలయుండు ||విచా||

రేకు 19 సంఖ్య 109 సంపు 21 పుట 73

సీ. దారిద్ర్య మెటులుండు దండనుండఁగ లక్ష్మి
సురధేను వుండంగఁ గఱవు గలదె ?
నారాయణుని ఘననామ ముండెడుచోట
పాతకకోటు లేపగిది నుండు ?
చీకటు లెట్లుండు చెంగట రవియున్నఁ
గాకోదరము లున్నె గరుడుఁ డున్న ?
తనమేన విష్ణుద్వాదశముద్ర లుండంగ
తూలక యజ్ఞాన మేలయుండు ?
గీ. స్వస్థుఁడై యున్న నేల చాంచల్య ముండు ?
భక్తియుండంగఁ గలఁక యే భాతి నుండు ?
అంతరాత్ముఁడై హరియుండ నఖిలశుభము
లిరవుకొనుచుండ నిఁక నలపేల యుండు ?

ఔళి

తమ తమ యంతటికి తమవారె
గుమిగూడు కొనుటింతె కొసర నేలయ్యా ॥పల్లవి॥
తల్లి శ్రీమహాదేవి తండ్రి పురుషోత్తముఁడు
తొల్లె దేవతలెల్ల తోడఁబుట్లూ
పొల్లగారు జీవులెల్ల పుట్టి పోదురు వత్తురు
చెల్లఁబో యిందులకుఁగా చింత లేఁటికయ్యా ॥తమ॥
హరిభక్తు లేలికలు ఆచార్యుఁ డొక్కఁడే దాత
పరమాత్మనామములే బంధువులు
సరవి జంతువులకు సంసారమే ధర్మము
పరుల కెల్లా నింతేసి భ్రమత లేలయ్యా ॥తమ॥
హితులు వేదరాసులు యిల్లాలు వివేకము
సుతుఁడు తనలోపలి సుజ్ఞానము
గతి శ్రీవేంకటేశుఁడె కలవాఁడు ప్రాణులకు
మతిమంతుల కిందులో మఱపు లేదయ్యా ॥తమ॥

రేకు 18 సంఖ్య 100 సంపు 21 పుట 67

సీ. భువనమాతయె తల్లి పురుషోత్తముఁడు తండ్రి
తొల్లితోఁబుట్టువు లెల్ల సురలు
పుడమిలో జీవులు పుట్టి పోదురు వత్తు
రిందుకుగాఁ జింత లేఁటికయ్య!
హరిభక్తు లేలిక లాచార్యుఁడే దాత
పరమాత్మునామముల్ బంధుజనులు;
సరవి జంతువులకు సంసారమే ధర్మ
మింతేసిభ్రమ లింద నేఁటికయ్య!
గీ. సతి వివేకమ్ము; వేదముల్ హితులు; సుతుఁడు
లోని విజ్ఞాన; మెల్లెడ ప్రాణులకును
సర్వవిధములగతి శేషశైలవిభుఁడె
మతియుతుల కిందులో నుంత మఱపులేదు.

శుద్ధవసంతం

ఎన్నిలేవు యీ యింద్రజాలములు యెట్టు సమ్మెడిది వో సర్వేశ్వర
మన్నించి నన్నిటు బోధింపఁగదవె మాయాతీతుఁడ విన్నిటను ॥పల్లవి॥

తామసునకుఁ బుట్టిన సుజ్ఞానము తత్త్వవాదమునకే మొదలు
కాముకునకుఁ దోఁచిన వివేకము కాంతాముఖలకే సెలవవును
పామరునకుఁ బొడమిన వైరాగ్యము పరదూషణకే పనియవును
సామాన్యున కటువచ్చిన చదువులు సాధింపవు మోక్షముతెరువు ॥ఎన్ని॥

జగతి నాస్తికున కొదవిన సత్యము శపథంబులకే గుఱియౌను
మగటిమి దుర్జనుఁ దెలిఁగినమంత్రము మారణాదులకే సాధనము
పగటున లోభి యొనర్చిన పుణ్యము ప్రతయముల కాలయము
పెగటునఁ గ్రూరుఁడు చేసిన తపమది వీరికితనముల రాకరము ॥ఎన్ని॥

సరిఁబాపిఁ గల దాక్షిణ్యము జారచోరులకు సహాయము
విరసవర్తనున కాచార మబ్బిన విపరీతంబులే దొరకొనును
దురితచిత్తునకుఁ జిక్కినయుక్తులు తుచ్ఛంబులపాలుగఁ జేయుస్
చిరముగ శ్రీవేంకటేశ మిమ్ముఁ గొలిచినవారలే యిల నతిఘనులు
॥ఎన్ని॥

రేకు 56 సంఖ్య 317 సంపు 21 పుట 213

సీ. తామసునకుఁ గల్గు దండిసుజ్ఞానమ్ము
తత్త్వవాదమునకె దారిదీయుఁ;
గాముకునకుఁ బొడకట్టు వివేకము
సెలవగుఁ గాంతాళము కె యెపుడు
పామరునకు జతపడిన వైరాగ్యము
పరదూషణములకే పనికివచ్చుఁ;
సామాన్యునకు వచ్చు చదువులు గిదువులు
సాధింపలేవు మోక్షమ్ము తెరువు;

ఉర్వి నాస్తికునకు నొదవిన సత్యమ్ము
　　శపథంబులకె చాలిచాలకుండు;
దుర్జనుం డెఱింగిన దొడ్డమంత్రము మార
　　ణాదుల కెపుడు సహాయకారి;
భువి లోభి యొనరించు పుణ్యమ్ము ప్రత్యవా
　　యములకు నెల్లప్పు డాలయమ్ము;
క్రూరుండు గావించు ఘోరతపంబు పీ
　　ఱీఁడితనంబుల కెల్ల విడిదిపట్టు

గీ. పాపివాక్కిణ్యసుది సాయపడును జార
చోరులకుఁ; దుచ్ఛకృత్యాల బారిఁద్రోయు
దురితచిత్తుల యుక్తులు- చిరము మిమ్ముఁ
గొలుచువారలె యతిఘనుల్ కొండలప్ప!

సా మం త

నేనే భాగ్యవంతుఁడను నీ కృపగలిగె నాకు
జ్ఞాన మిచ్చితివి నే సంసారము సేయఁగాను ॥పల్లవి॥

పుట్టుదరిద్రుఁడై వున్నప్పుడు వచ్చిన సంపద
లట్టే వేఁపచేఁదు దాగేయప్పటి తీపు
దట్టమై యాఁకలిగొన్నతఱిఁ గల యాహారము
గట్టిగాఁ జవియైనట్టు గలిగె నీ భక్తి ॥నేనే॥

చిక్కులుపేర భీతివాసినమీఁది సంతోషము
చిక్కుపురోగము మానిన సౌఖ్యము
మిక్కిలి యప్పులుదీఱి మెఱసే దొరతనము
గక్కున నా కబ్బినట్టు గలిగె నీ భక్తి ॥నేనే॥

జడిసి యెండదాఁకిన సమయమందలి నీడ
అడవిలోపల సహాయమైన తోడు
అదరి దొరఁకినట్టు లట్టే శ్రీవేంకటేశ
కదఁగి నీ కృపవల్లఁ గలిగె నీ భక్తి ॥నేనే॥

రేకు 76 సంఖ్య 440 సంపు 21 పుట 296

సీ. వేఁపచేఁదును త్రాగువేళ గ్రైకొను తీపు
కటిక పేదఱిమిని గలిగిన సిరి
దట్టంపుటాఁకలి తఱిగల బోనమ్ము
చవియైనయటుగ్గల్గె సాంద్రభక్తి;
భయముపాసినమీఁది పరమసంతోషమ్ము
రోగమ్ము మానిన సాగు సుఖము
అప్పు లన్ని యుదీఱి యడపు దొరతనమ్ము
లభియించినటు భక్తి లభ్య మయ్యెఁ;

గీ. ఎండదాఁకిన సమయమం దెలయునీడ
యడవిలోపల సమకూడినట్టితోడు
కైవడిని నాకు వేంకటకటకనిలయ !
నీ యపారకృపం గల్గె నీదుభక్తి.

శ్రీరాగం

నీవే వచ్చి ప్రత్యక్షమై నిలుతువుగాక మాకు
భావించి నిన్ను రూపించి పట్ట నెట్టువచ్చును ॥పల్లవి॥

పాలజలనిధిలోన పండేది నీ కొకచోటు
పోరి జీవులలో నెల్లా వుండేది నీ కొకచోటు
తేలగిల సూర్యునిలో తిమ్మట నీ కొకచోటు
తాలిమి ని న్నెందని వెదకఁగల మిఁకను ॥నీవే॥

ఆసలునిలోపల నారగించే దొకచోటు
గొనకొని వైకుంఠానఁ గొలువుండే దొకచోటు
పొనుఁగర దాసురింద్లఁ బూజఁ గొనే దొకచోటు
ఘనుఁడ నిన్ను సోదించి కన నెట్టువచ్చును ॥నీవే॥

గతిఁ దులసివనాన రచ్చ సేసే దొకచోటు
కతలుగా లక్ష్మితోడ కాఁపురము లొకచోటు
తతి శ్రీవేంకటాద్రిపైఁ దగఁ గాణా చొకచోటు
యితవుగా నీ చొప్పు లెత్తఁగ మా తరమా ॥నీవే॥

రేకు 64 సంఖ్య 367 సంపు 21 పుట 247

సీ. ఎదుటఁ బ్రత్యక్షమై యీవె నిల్తువుగాక
భావించి ని న్నెట్లు పట్టవచ్చు ?
పాలకడలి నీకుఁ బవళింప నొకచోటు
జీవాత్మ లరయ వసించుచోటు
ఆదిత్యమండల మ్మటు గ్రుమ్మరిలుచోటు
విష్ణుఁడా ! ని న్నెందు వెదకఁగలము ?
అగ్నిహోత్రమ్ముకఁ డారగించెడుచోటు
కొలువుండుచోటు వైకుంఠనగరి
పూఁజలుగొను చోటు పుణ్యదాసగృహాలు
సోదించి ని న్నెట్టు చూడనగును ?

గీ. తులసివనభూమి రచ్చలుసలుపు చోటు
కలిమిచెలితోడ కాపురము లొకచోటు
అహిగిరీంద్రమ్ము కాణాచియైనచోటు
దేవ ! నీ చొప్పు లెత్తంగ మా వశంబె ?

శ్రీరాగం

తెలియదు నీ మనసు దేవోత్తమా
సులభుఁడ వని విని చొరఁబారీ మనసు ॥పల్లవి॥

చూతును నీ మూరితిని చొప్పుగాఁ గన్నులెదుట
ఆతుమలోఁ దలపోసే ననుచును అలవరచుకొందును
నీతి యెంచి చూచితేను నీ వెంత నే నెంత
యీతల నా యగ్గలికెకు నే మనుచున్నాఁడవో ॥తెలి॥

నెట్టుకొనఁ బూజింతు నీవు నా వాఁడవే యంటా
పెట్టెలోన నుంచి చక్కఁబెట్టుకొందును
యెట్టిది నా సాహసంబు యేమిట నిన్ను మెప్పించితి
నట్టనడుమ న న్నెట్టు నవ్వుతా వున్నాఁడవో ॥తెలి॥

నాడిగి నిన్నుఁ బిలుతు నోరునిండాఁ బేరుకొని
యెదయ కెందున్నాఁడవో యెక్కడెక్కడ
అదరి శ్రీవేంకటేశ అలమేల్మంగపతివి
వది న న్నేలితి వెటువంటి సుకృతివో ॥తెలి॥

రేకు 72 సంఖ్య 413 సంపు 21 పుట 278

సీ. కాంచెద నీమూర్తి గన్నులయెదుట ని
న్నలవరించితి నాత్మ నని తలంతు
నెంచిచూడంగ నీ వెంత ? నే నెంత ? యే
మనుచుంటివో నాదునగ్గలికకు
నీవు నా వాఁడవే నిజమని పూజింతు
పెట్టెలో నిడి చక్కఁబెట్టుకొందు
నెట్టి సాహసము ? ని న్నేమిట మెప్పించి
నాఁడ ? న న్గని యెంతనవ్వుకొందొ ?

ఆ. నిన్నుఁ బిలుతు నోటినిండుగఁ బేర్కొని
యెడయ కెందుఁగలవొ ? యేడ కేడ !
ఏలితివి గదయ్య ! యెటువంటి సుకృతివో
అంజనాద్రివాస ! ఆదిపురుష !

సారంగనాట

నేరమెల్లా నాదే కాక నీకుఁ గడమ వున్నదా
సారె నమ్మితే రక్షించఁ జాలుదువు మఱి యేలుదువు గాకా ॥పల్లవి॥
నీ వెత్తిన వెట్టిమోపు నే నడవిఁ బారవేసి
వేవేలు విన్నవించినా విందువా కాదందువుగాక
కావించి నీవు చెప్పిన కర్మఫలము నీ కిచ్చి
యేమి ని న్నడిగినా నీ విత్తువు మఱి మెత్తువుగాక ॥నేర॥
వెలఁగి నీవు నియమించిన యానాజ్ఞ దోసి
కొలువుకు వచ్చితేఁ జేకొందువా పొమ్మందువు గాకా
అల నీవు గల్పించిన యాశ్రమధర్మముననే
కెలన నుండిన బ్రదికింతువా కృప నింతువుగాకా ॥నేర॥
నేరక నీ బంట్లను నిరాకరించి వచ్చి
కూరిమి మొక్కితేఁ గనుఁగొందువా వలదందువుగాక
కోరి పెద్దల సేవించుకొని వారిచేఁ జెప్పించి
చేరితే శ్రీవేంకటేశ చిక్కుదువు మఱి దక్కుదువు గాకా ॥నేర॥

రేకు 62 సంఖ్య 352 సంపు 21 పుట 237

సీ. ఈవు నా నెత్తికి నెత్తిన మోపును
ప్రోల్మాలి యడవిలోఁ బాఱవైచి
వేవేలు నే విన్నవించిన వీనుల
విందువా ? కినుకఁ గాదందుగాక;
ఈవు చెప్పినపనిఁ గావించి యా కర్మ
ఫలము నీకే సమర్పణ మొనర్చి
ఇహపరసుఖముల నేవి ని న్నడిగిన
నిత్తువు మఱీ మఱీ మెత్తుగాక
నీ యాజ్ఞ పోఁదోసి నీ కొల్వుఁజేరఁ జే
కొందువా ? వెడలిపొమ్మందుగాక;
త్వత్కల్పితాశ్రమధర్మవర్తను బ్రతి
కింతువు సత్కృప నింతుగాక
గీ. నీదుబంట్లను నిరసించి నీకు నల్పు
వందనము గొందువా ? వలదందుగాక;
పెద్దలగువారిచేతఁ జెప్పించి చేర
కొండలప్ప ! చిక్కుదువు దక్కుదువు గాక !

నాట

నిన్నడిగే నాన్తతివే నేనీపుట్టుగులకు
పన్నుకొన్నసేరమి నాపై నెట్టుగలిగె ॥పల్లవి॥

పూర్వపునీవు పురాణపురుషుడవు గనక
వుర్విపై నీ వెఱుఁగని దొకటిలేదు
పర్వీన కోటిసూర్యప్రకాశుఁడవు గనక
సర్వజ్ఞ నీవుగానని చందమేమీ లేదు ॥నిన్న॥

విసుతించ నీవు వేదవేద్యుఁడవు గనక
మనసులో నీ కెక్కడ మఱపులేదు
అనిశము నీవు సర్వవ్యాపకుఁడవు గనక
యెనయఁగ నీకు విరహిత మెందూలేదు ॥నిన్న॥

హొంతనీవు పంచమహాభూతేశుఁడవు గనక
పంతాన నీవులేని ప్రపంచము లేదు
అంతర్యామివి శ్రీవేంకటాధిపతివి గనక
చింతాకంత నీవులేని చేష్ట లేదాలేవు ॥నిన్న॥

రేకు 69 సంఖ్య 387 సంపు 21 పుట 227

సీ. కృపఁ దెల్పగదె పురాణపురుషుఁడవు గాన
నుర్వి నీ యెఱుఁగని దొకటి లేదు;
సూర్యకోటిప్రకాశుఁడవు సర్వజ్ఞుఁడ
వీవు గాననిచంద మెందులేదు;
వేదవేద్యుఁడవు విమలబుద్ధివిగాన
మనసులో నీకెడ మఱపులేదు;
పంచమహాభూతపతివి గావున నీవు
లేని ప్రపంచమ్ము లేదు లేదు;
ఆ. అఖిలమునకు నీవె యంతరాత్మవుగాన
నీవులేనిచేష్ట లేద లేవు;
ఇన్నిపుట్టువులకు నే నొనర్చిన నేర
మేమి వేంకటేశ! యెట్లు గలిగె?

సామంతం

దైవమా నీ తప్పులేదు తలఁచేవారిభాగ్యమే
వేవేలుగా నుతియించీ వేదములే నిన్నును ॥పల్లవి॥
నీవు గలవనేచోట నీగుణములు గలవే
నీవులేనిచోట నిర్గుణ మౌను
భావించితే మనసులోఁ బరగు నీ సాకారము
ఆవల నిన్నుఁగానని దది నిరాకారము ॥దైవమా॥
యెఱిఁగి కనుగొంటేను యీ జగ మెల్లా నిజము
యెఱుఁగక మఱచితే నింతా మిథ్య
వుఱక భక్తి సేసితే నుండు నందు భేదము
నెఱయా నొల్లకుండితే నిలుచు నభేదము ॥దైవమా॥
తపము ఫలించెనంటే దండనుండు మోక్షము
యెపుడు నిష్ఫలమంటే యెన్నఁడు లేదు
కృప నలమేల్మంగకధిప శ్రీవేంకటేశ్వర
కపటము లిఁకనేల కావవే యిందఱిని ॥దైవమా॥

రేకు 77 సంఖ్య 442 సంపు 21 పుట 297

సీ. కలవు నీ వనుచోటఁ గలవు; నీ గుణములు
నీవు లే వనుచోటు నిర్గుణమ్మొ;
భావింప మనసులోఁ బరఁగు నీ యాకృతి;
కానకుండుట నిరాకార మంతె;
ఎఱిఁగి కనుంగొన్న నీ జగమ్ము నిజమ్మొ;
యెఱుఁగక మఱచిన నింత మిథ్య;
అటు భక్తి సేసిన నందుండు భేద; మ
ట్లొల్లకున్న నభేద మొప్పుచుండు;
గీ. తపముఫలియించు నన ముక్తి దండనుండు;
లేదు నిష్ఫల మన; లేదు నీదుతప్పు
తలఁచువారిభాగ్యంబె; వేదములు నిన్నుఁ
గడు నుతించెఁ-కపటమేల ? కావు మమ్ము.

భూ పా ళ ం

సర్వశక్తివి నీవే సకలలోకేశ్వరా
నిర్వహించి నన్ను రక్షించఁగ నీవే ॥పల్లవి॥
తండ్రిపైఁ జేసిన భక్తి దైవమా నీకే సెలవు
తండ్రికి తండ్రివి నీ వంతర్యామివి
ఘంజాడి తల్లిపైఁ జేసే మచ్చికెల్లా నీది
నిండ్రి ( ? )ఁ దల్లిలోవాఁడవు నీవె కాక ॥సర్వ॥
పెండ్లాముపైఁ జేసిన ప్రేమలెల్లా నీ సొమ్మే
పెండ్లాములో భావన నీ పెంపేకనక
పెండ్లకై బంగారులకై పెలసే తపసు నీదె
యిండ్లిండ్ల సంపదలు నీ వింతాఁగనక ॥సర్వ॥
కిమ్ములదేహానకు భోగించిన భోగము నీదె
నెమ్మది నంతర్యామివి నీవు గనక
యిమ్ముల శ్రీవేంకటేశ యిన్నియు విన్నవించితి
కమ్మి నా కన్నిటికీ కర్తవు నీవే కాన ॥సర్వ॥

రేకు 25 సంఖ్య 144 సంపు 21 పుట 96

సీ. తండ్రిపైఁగలభక్తి తండ్రికిఁ దండ్రి వం
తర్యామివగు నీకె ధారవోతు
మఱి తల్లిపైఁజేయు మచ్చికెల్లయు నీది
యిటు తల్లిలోవాఁడ వీవె గనుక
పెండ్లముపైఁజేయు ప్రేముడి నీ సొమ్ము
పెండ్లముతలఁపు నీ పెంపె గనుక
వెండికై పసిఁడికై వెలయు తపము నీదె
యన్ని సంపదలు యవియె గనుక
గీ. నెమ్మి మేనభోగించు భోగమ్ము నీదె
యెప్పుడు జీవాంతరాత్ముండ వీవె గనుక
విన్నవించితి ననుఁబ్రోవ వేంకటేశ!
క్రమ్మి నా యన్నిటికి నీవె కర్త గనుక.

గౌళ

ఇదె నీ చిత్తం బింక నాభాగ్యము యిన్ని విన్నపము లిందునే వున్నది
హృదయములోపల నీ వున్నాఁడవు యెఱుఁగని యర్థం బించుక లేదు
||పల్లవి||

మొగి నాయుష్యము నూరేండ్లు ఇంక ముందరఁజేసెదఁ బుణ్యము లనుచును
తగ నా యిచ్ఛల వలసినట్లు నేఁ దప్పె ననక భోగించితిని
జిగి నొకదేవత ననుసరించను సేసినధర్మం బొకటిఁగానను
నిగిడి వృద్ధుడనైతి నింతలోనను నీ ముందర నే నిలిచితిని ||ఇదె||

అనేకకాలము బ్రహ్మకల్పము నదలయందు నే జన్మించి ముక్తి వడతునని
పొనుఁగుచు నిహమే కోరుచు నాసల పట్టుగుంకు నొడిగట్టితిని
అనిశము మునులను అవలంబించను ఆధార మొక్కఁడె సంపాదించను
తనిసి యిదివో దుర్బలుఁడనైతి నీ దయాదృష్టినే తగిలితిని ||ఇదె||

శ్రీవేంకటగిరి పరమపావనము చేరియందు నీ సేవ సేతునని
తోవచూచుకొని యిన్నాళ్ళ (?) దనేక దొరకొని పెద్దకాల మెలఁగితిని
భావములో నొకి యుక్తియు వెదకను పగులు నాకు రక్షకులని తలఁచను
చేవమీటి నిర్భరుఁడ నైతిని శ్రీసంకల్పాశ్రితుఁడ నైతిని ||ఇదె||

రేకు 56 సంఖ్య 318 సంపు 21 పుట 214

సీ. ఆయువు నూఱేఁడు లవలఁజేసెద పుణ్య
ము లని భోగించితి వలసినట్టు;
లోకదేవతను గొల్వ; నొక ధర్మమును జల్ప;
నింతలో వృద్ధునై యెదుటఁ బడితి;
ఎట్టకేలకు ముక్తి నెనయుదు నని, యిహం
బాశించి బహుజన్మ లందినాఁడ;
ననుసరింప మునుల; నాధార మార్జింప;
ముడిసి నీ కన్నులముందుఁ బడితి;
గీ. చేరి శేషాద్రి నీ సేవ చేయుదు నని
యిన్నినాళ్లకు దొరకొంటి; నెడఁద నెట్టి
యుక్తి వెదక; సంరక్షణ కోరుల నెంచ;
హృదయవర్తి వీ వెఱుఁగని దేమి స్వామి!

నాట

ఆలసితిని పుణ్యపాపముల అఁకలిఁబడి నేను
గెలిచితిని నిన్నుఁ గొలిచి యింకఁ గీర్తింపుచు నిర్మలుఁడ నైతిని ॥పల్లవి॥

యింక నేల యీ పదునాలుగులోకములు చొచ్చి
యెన్నాళ్లు దప్పించుకొనువాఁడ
యింక నేను నేఁజేసిన దానంబులు చూపి
యెందాఁకాఁ బెనఁగెడువాఁడ
యింక నేను నాపుత్త్రమిత్త్రులనడుమ
నెటు దాఁగఁగలవాఁడ
యింక నేను యిల దివ్యతీర్థముల వెంటవెంట
నెక్కుడని పారెదఁగలవాఁడ ॥ఆలసితి॥

యింక నేను నానాదేవతల మఱుఁగునను
యేది గొలఁది దొబ్బఁగలవాఁడ
యింక నేను బహుజంతురూపములు గైకొని
యే పగిదిని బొంకఁగలవాఁడ
యింక నేను మంత్త్రములు జపించి
యే రీతి మాయల గెలిచేదివాఁడ
యింక నేను సంసారము చూపి
యేమని నమ్మించఁగలవాఁడ ॥అలసితి॥

యింక నేను నీదాసుఁడనై ఇటువలె నుండఁగలవాఁడ
యింక నేను నీవేగతి యని యిహముఁ బరముఁ జేకొనువాఁడ
యింక నేను అలమేలుమంగకు యీశ్వరుఁడవైన శ్రీవేంకటేశా
యింక నేను ఆచార్యునమతి హృదయములోపలఁ దలఁచువాఁడ ॥అలసితి॥

రేకు 67 సంఖ్య 884 సంపు 21 పుట 268

సీ. ఏడేడు లోకంబు లెన్నినా ళ్లిటుసొచ్చి
తప్పించుకొనువాఁడ దానములను
బొనరించి యెందాకఁ బెనఁగువాఁడ ? నిఁకెట్లు
దారసుతులమధ్య దాఁగువాఁడ;
వివిధతీర్థమ్ములవెంట నే క్రైవడిఁ
బాఱాడఁగలవాఁడఁ బ్రీత్యహంబు?
పలువేల్పులమఱుంగు పనివడి చేరి నే
నెటు కర్మసంగతి నీఁగువాఁడ ?
బహుజంతురూపముల్ వడసి యే తీరునఁ
గాలమంతయును బొంకఁగలవాఁడ ?
ఏ మంత్రములు జపియించి మాయల గెల్చి
దురితసంసారమ్ము ద్రోయువాఁడ ?

గీ. అలసితిని పాపపుణ్యమ్ము లాచరించి
యింక నినుఁగొల్చి కీర్తించి యిహము పరము
చేకొనంగలవాఁడ లక్ష్మీకళత్ర !
తలఁపునన్ గురుననుమతిఁ దలఁచువాఁడ.

### గుజ్జరి

కరుణానిధివి గాఁగ కాచేవుగాక
యిరవై నావంటివాని కిది యసంగతము ||పల్లవి||

నేర నే పుణ్యముసేయ నిత్యానిత్య మెఱఁగి
నేరుతు రిత్తచేతుల నీకు మొక్కేఁది
యే రీతిఁ బర మిచ్చేవో యేమిగలదు నాయందు
కారణములేని యీవి కడు నసంగతము ||కరుణా||

లేదు విజ్ఞానము గొంత లేశమైన నాయందు
సాదించఁ గద్దొకటి మీ శరణనేది
ఆదిగొని నన్నుఁ బాయ వంతరాత్మవై నీవు
పేదరవెల్లి పొందులు విన నసంగతము ||కరుణా||

కాను నే నరుహుఁడను కదిసి పనులకు
నేనవుదు నొకటికి నిన్నుఁ బాడను
యీ నెపాన శ్రీవేంకటేశ నన్ను నేలితివి
దానికిఁ దగ్గంతె కాక దాఁట నసంగతము ||కరుణా||

రేకు 20 సంఖ్య 165 సంపు 21 పుట 110

సీ. కరుణానిధివిగానఁ గాతువుగాక ! యిం
జడుఁబాయకుంట యసంగతమ్ము;
నేర రవ్వంత పున్నియము గావింపంగ
మొండిచేతుల నీకు మ్రొక్క నేర్తు;
ఏ రీతిఁ బరము నా కిత్తువో ? నాయందు
స్వామి ! నీ యీవి యసంగతమ్ము;
లేదు విజ్ఞానమ్ము లేశమ్ము నాయందు
నిను శరణనియెడు మనసు గలదు;

గీ. కాను యోగ్యుఁడఁ బనులను గదిసిచేయ;
నే నవుదు నిచ్చ నోరార నిన్నుఁబాడ
నీ నెపమ్మున జాలి నన్నేలినావు
సరికి సరిగాక మించు టసంగతమ్ము.

దే శా క్షి

శరణాగతుఁడను విచార మింత వలెనా నన్ను
నిరుహేతుకానఁ గావనేరవా యేమి ॥పల్లవి॥

నన్ను నొకజంతువు నన్నతిఁ గాచుటకుఁగా
పన్నినట్టి కర్మములబారిఁ దోయవలెనా
మన్నన లక్ష్మీపతివి మహినెల్ల వేలేవు
వెన్నుఁడ నన్నుఁగావ వేగ్గా యేమి ॥శరణా॥

పుట్టించినయట్టి నీవు పూరిమేప వెప్పుడును
కట్టిడిపరులఁజూపి కాకుసేయవలెనా
అట్టి బ్రహ్మఁగన్నతండ్రివదె లోకములు కుక్షిఁ
బెట్టుకున్నాఁడవు నన్నుఁ బెనుపవా నీవు ॥శరణా॥

అపరాధినై తిఁబో నీ వన్నిటా నన్నేలితివి
చపలపుటాసలలో సడిఁబెట్టవలెనా
యిపుడు శ్రీవేంకటేశ యిన్నిటా నన్నేలితివి
కపురైన మా నుతులు ఘనము గాదయ్యా ॥శరణా॥

రేకు 29 సంఖ్య 170 సంపు 21 పుట 118

సీ. శరణాగతుండ విచార మింత వలెనా
నిర్వ్యాజముగఁ బ్రోవ నేరవేమి ?
నను జంతుమాత్రు నొక్కనిఁ గూర్మిఁ గాపాడఁ
దొడరి కర్మలబారిఁ ద్రోయవలెనె ?
పద్మావతీప్రాణపతివి లోకా లేలు
వాఁడవు నన్గావ భారమేమి ?
పుట్టించి యెప్పుడు పూరి మేపవు, చూపి
చెనఁటుల, నిటు కాకు సేయవలెనె ?
అట్టి బ్రహ్మకుఁ దండ్రి వదె లోకములఁ గుక్షిఁ
బెట్టుకొంటివి నన్నుఁ బెనుప లేవె ?

గీ. అన్ని తెఱఁగుల నపరాధినైతిఁ బొమ్ము
పాడుకోర్కులఁ జీకాకుపఱచవలెనె ?
కపటవినుతులు నీ కేమి ఘనము లయ్య ?
కరుణ రక్షింపు మయ్య ? వేంకటగిరీశ !

**ముఖారి**

నడచీ లోకము బ్రహ్మనాటనుండి సహజము
యెడయక శరణని యియ్యకొంటి సుఖము ॥పల్లవి॥

ఉదయాస్తమయములు వొకరన్నట్టయ్యీనా
చెదరి మేలునుఁ గీడు చెప్పినట్టు సేసీనా
యిది దైవకల్పితము యెవ్వరి నేమనవచ్చు
కదిసి యైనది యయ్యీ కాని దెన్నఁడుఁ గాదు ॥నడచీ॥

జననములు మరణములు జంతువుల యిచ్ఛలా
వొనర కలిమిలేము లొకరన్న దౌనా
ఘనమైన హరిమాయకల్పితము లివి తొల్లె
పొనిఁగి పొయ్యేవిపోవు పోని వెన్నఁడుఁబోవు ॥నడచీ॥

శ్రీవేంకటేశ నీవు సేసిన సేఁతలోన
భావించి తెలియలేక భ్రమసితి మిన్నాళ్లు
సావధానమున నిందు శరణంటిమి నీకు
యే వేళ మమ్ముఁగాచితి విన్నిటా గెలిచితిమి ॥నడచీ॥

రేకు 88 సంఖ్య 217 సంపు 21 పుట 145

సీ. ఉదయాస్తమయములు, పొదలు మేలును గీడు
నొకరుసెప్పినయట్టు లౌదవు నేమి ?
కదిసి యైనది యగుఁ; గాని దెన్నఁడు గాదు
దైవకల్పితముల దాఁటఁ దరమె ?
జంతుల యిచ్ఛలా ? జననాలు మరణాలు
కలిమిలేములు మఱి కొలఁదు లేమి ?
పోవునట్టివిపోవు పోని వెన్నఁడుఁ బోవు
ఘనమైన హరిమాయ గడవ వశమె ?

ఆ. నలువనాఁటినుండి నడచులోక మ్మిట్లె
తెలియలేక బ్రమసి తిరిగినాము;
సావధానమున వృషాచలాధీశ ! నీ
పదయుగమ్ము గొల్చి బ్రదికినాము.

గుండక్రియ

ఎంత మందెమేళము లేమనఁగ వచ్చు నాకు
చెంత నీవు నాకుఁ బనిచెప్పవలెఁ గాక ॥పల్లవి॥

నే నీకు బంటను నీవు నా కేలికవు
అనుకొని హద్దు నుండుమని యెట్టు నియమింతు
నానాఁటికిఁ బేరుకొని నంటున నే రీతిఁ బిలుతు
కానీలే నీ వేళ లెఱుఁగక యెట్టు దలఁతు ॥ఎంత॥

యేదైనా నాసపడి యెట్టు నిన్నడుగవచ్చు
సోదించి నీ భావమెట్టుఁ జూడవచ్చును
పాదుగా సంపదలకై పనులెట్టు గొనవచ్చు
యే దెసఁ జిత్తమెఱుఁగ కేగతి విన్నవింతు ॥ఎంత॥

యెప్పుడైనా నెట్టువచ్చి యెదుట నిలువవచ్చు
చిప్పిల నిన్నంటి యెట్టు సేవసేతును
అప్పఁడ శ్రీవేంకటేశ అలమేలుమంగపతి
కప్పి నన్నేలితివి కాదన నెట్టువచ్చు ॥ఎంత॥

రేకు 69 సంఖ్య 399 సంపు 21 పుట 268

సీ. నీకు బంటును నేను నీ వేలికవు నాకుఁ
జెంతనుండఁగ నియమింతు నెట్లు ?
నానాఁటఁ బేర్కొని నంటున నెటుపిల్తు
నెఱుఁగక నీ వేళ లెట్లు దలఁతు ?
ఎదియైన నాశించి యెటు నిన్నడుగవచ్చు
సోదించి తలఁపెట్లు చూడవచ్చు
పడయంగ సంపదల్ పను లెట్లు గొనవచ్చు
మనసు గుర్తింపక మసలు టెట్లు ?

ఆ. ఎప్పుడేనివచ్చి యెదుట నిల్చుట యెట్లు ?
చేతనంటి సేవచేయు టెట్లు
ఎంత మందెమేళ మే మనఁగా వచ్చు
పనులు నీవె చెప్పవలయు నాకు.

భైరవి

కంటి మన్నిటిసత్వాలు కమలాక్ష యిఁక నీవే
యింటి వేలుపవై మమ్ము నీడేర్తువు గాకా ॥పల్లవి॥

తొల్లి లేదా జ్ఞానము తొడరి యాతుమలోన
అల్లన మోక్షము చూపవాయఁగాక
చల్లఁగ మనసెకాదా చవులెల్లాఁ జూపినది
వెల్లిగా బ్రహ్మానందము వెదకదు గాకా ॥కంటి॥

యిరవై యారుశాస్త్రము లివేకావా చదివేవి
హరి నిన్ను బోధింప వాయఁగాక
గరిమ నీలోకములే కావా చొచ్చివెళ్లేవి
విరక్తిఁజేసి కర్మము విడ్చదాయఁగాకా ॥కంటి॥

చెప్పుడు బుద్ధులే కావా చెవులలో నిండినవి
చిప్పిల నీ భక్తునిఁగాఁ జేయవుగాక
యిప్పుడే శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
యెప్పుడి నేనేకాదా యిఁకఁ బాయఁగాకా ॥కంటి॥

రేకు 56 సంఖ్య 311 సంపు 21 పుట 209

సీ. అన్నింటిసత్తువ లరసినారము నీవె
యీడేర్తుగాక మ మ్మిందిరేశ!
ఆత్మలోపల జ్ఞాన మడరదా తొల్లి? కా
సంత మోక్షము చూపదాయెఁ గాక
మనసేగదా చవుల్ మరపినట్టిది? యవ్వ
యానందము వెదక దాయెఁగాక
చదివెడి వీ యాఱుశాస్త్రమ్ములేగదా
అటు నిన్ను బోధింప వాయెఁగాక
విషయమ్ములు చొచ్చి వెడలెడి వివి కావె
యకట! కర్మము వీడదాయెఁగాక
గీ. ఎప్పు డాలించినన్ బుద్ధు లివియ గావె
భక్తుఁ గావించుటకుఁ బాలుపడవుగాక
యిప్పుడే వేంకటేశ! న న్నేలినాఁడ
వెప్పటి నరుండనే పాయ నింక నిన్ను.

టౌ శి

వెట్టిన నంతమాత్రాన నీవాఁడె వాఁడు
యెట్టైనాఁ గావకపోదు యీ సంబంధమునను ॥పల్లవి॥

చిలుకను రామ తమ్మా పలుకుమను నొక్కఁడు
పిలుచుఁ దిమ్మా యని నీ పేరిడివాని నొక్కఁడు
వెలయ గోవిందాయని వెలుగువడు నొక్కఁడు
అలసినవేళ హరి హరి యను నొక్కఁడు ॥వెట్టిన॥

సింగారానకు నొక్కఁడు చిన్ని తిరుమణివెట్టు
వెంగొంగనామము వెట్టు వెక్కిరింపుచు నొక్కఁడు
పంగనామముగఁ బెట్టు బహురూపగాఁ డొక్కఁడు
సంగాతానకుఁ బెట్టు వేసాలనామ మొక్కఁడు ॥వెట్టిన॥

సరుగ నీ గుడితోన సాగిలిపడు నొక్కఁడు
పరుస నూరకే తలవంచు సారె నొక్కఁడు
యిరవై శ్రీవేంకటేశ యిన్ని నీ మొక్కులు గానే
అరసి చేకొందువు నీ వంత సులభుఁడవు ॥వెట్టిన॥

రేకు 62 సంఖ్య 355 సంపు 21 పుట 289

సీ. రాచిల్క నసునను రామాయని యొకండు
పిలుచు తిమ్మయని నీపేరనొకఁడు
గోవింద యని వెలుగుపడు నొక్కఁడు హరీ
హరియని యొకడాఁడు నలసినప్డు
చిన తిరుమణిపెట్టు సింగారమున కొక్కఁ
డిడు కొంగనామంబు నింకొకండు
పంగనామముఁ బెట్టు బహురూపుఁ డొకఁడు వే
సాలనామము వెట్టు సరభినొకఁడు
గీ. పరఁగ నీగుడి సాగిలిపండు నొకఁడు
సరగ నూరకె తలవంచు సారె కొక్కఁ;
డంతమాత్రాన నావాఁడటంచు వానిఁ
బ్రోతు వీవెంత సులభుఁడవో ముకుంద !

క న్న డ గౌ ళ

నీ మహిమ దలఁచుకొని నీవే రక్షించుటగాక
స్వామివి మామీఁద నీవు సడివేయనేలా ॥పల్లవి॥

నే నొక్క యణుమాత్రము నీవు మహదాత్ముఁడవు
కావీలే నీముందర నాకథ యేమి
పూని చిత్రగుప్తులచే పుణ్యపాపము వ్రాయించి
అని లోకాల కెక్కించి ఆటఁడిఁ బెట్టనేలా ॥నీమహి॥

నేర నేఁ బరతంత్రుఁడ నీవు స్వతంత్రుఁడవు
యీ రీతివాఁడ నను నెంచ నేది
సారెకు రవిచంద్రులసాక్షిగా మా కిటు లెట్టి
కోరిపనులు సేయించి గొరబు సేయవేలా ॥నీమహి॥

యెందు నే లక్ష్యముగాను యిన్ని నీవు లక్ష్యము
పొందుగా ని న్నెంచే చోట భువి నే నెంతా
విందుగ నలమేల్మంగవిభుఁడ శ్రీవేంకటేశ
కందువ నా యాత్మ నింత గరిసించ నేలా ॥నీమహి॥

రేకు 62 సంఖ్య 856 సంపు 21 పుట 289

సీ. నీవు మహాత్ముఁవు నే నణుమాత్రుండ
నీముందు నాకథ యేమి చెప్ప
పూనిక చిత్రగుప్తులచేత వ్రాయించి
కర్మఫలంబులఁ గట్టనేల ?
నేఁ బరతంత్రుఁడ నీవు స్వతంత్రుఁడ
వీరీతివాని న న్నెంచనేల ?
భానుచంద్రులసాక్షిగాను నాచే పనుల్
సేయించి గొరబిటు చేయనేల ?

గీ. ఇన్నిటికి నీవు లక్ష్య మే నెందుఁ గాను;
వేఱె నామీఁద నొకసడి వేయకుండ
నీ మహిమ నెంచుకొని నన్ను నీవెగావు
శ్రీశ ! నా యాత్మ నిటు కరిసించనేల ?

## సాళంగనాట

వలసినట్టుసేయు నావల్లఁ గల గుణమిది
నలినాక్ష నీ తలఁపు నాకేమిఁ దెలియదు ॥పల్లవి॥

యెన్నఁగా నా పురాకృత మెఱుఁగఁగాని యొక్కట
నిన్ను నేఁ గొలిచితి ననే గర్వ మెఱుఁగుదు
మున్ను నేనుండే స్వభావము దలఁచఁగాని నీవు
మన్నించే యహంకారము మదిలోఁ దలఁతును ॥వలసి॥

నేరని నా చేఁతలు నే నెంతైనా నెంచఁ గాని
పేరిటివాఁడ ననేటి పెద్దఱిక మెంతును
మోరతోపున నా మర్మములు చెప్పుకొనఁగాని
సారె వైష్ణవుఁడ ననే సలిగ చెప్పుదును ॥వలసి॥

ఋమ్ముల నేఁ గొంచపడే దెవ్వరికిఁ జూపఁగాని
నమ్మి నీ మఱుఁగుచొచ్చిన బలిమి చూపుదు
పమ్మి న న్నింతసేసిన పాపముఁ బొగడఁగాని
నెమ్మది శ్రీవేంకటేశ నిన్నే పొగడుదును ॥వలసి॥

రేకు 61 సంఖ్య 151 సంపు 21 పుట 286

సీ. వలసినట్టులుసేయు కలగుణం బిది; నీదు
తలఁపు నా కేమియుఁ దెలియ దయ్య !
ఇంచుక నా పురాకృత మెఱుంగను గాని
నినుఁగొల్చు గర్వమ్ము నే నెఱుఁగుదు;
నా స్వభావ మెఱుంగ, నా దురహంకృతి
నీవు మన్నించుట నే నెఱుఁగుదు;
నేరని చేఁతలు నే నెంచ నీదు పే
రిటివాఁడనను పెద్దఱికము నెంతు;
మోరతోపున మర్మములు చెప్పికొన, చెప్పి
కొందు వైష్ణవుఁడను గొప్పతనము;

గీ. కొంచెపడు టెవ్వరికిఁ జూప గుండె వఱచి
చూపుదును నీదుమఱుఁగు నేఁ జొచ్చుబలిమి;
ఇంతసేసిన పాపమ్ము నెపుడు వొగడఁ
బొగడుదును నిన్ను నిత్యమ్ము భోగిశయన.

లలిత

ఎంతప్రతాపమో నీది యెంచి చూచితే
వింతలేల నిన్ను సేవించు టింతెకాక ॥పల్లవి॥

ముప్పిరి నీ సంకల్పము మంచి బ్రహ్మేంద్రాదులైన
తప్పించలేరు మతి దాటా లేరు
యెప్పుడైనా దైత్యులపై యెత్తిన నీ చేచక్రము
తిప్పలేరు నీ మహిమ తెలియా లేరు ॥ఎంత॥

ఆముక నీవు మన్నించే నంటే సనాదికర్మాలు
యేమిటా మాసప లేవు యిప్పించా లేవు
నేమించక లోకాలపై నీవు పరాకై వుండితే
ప్రేమం బెదరించ లేవు పెనగా లేవు ॥ఎంత॥

చేరి నీవు మమ్మేలితే చేసిన యపరాధాలు
మారుకొనలేవు మరి మలయా లేవు
గారవాన నలమేల్మంగపతి శ్రీవేంకటేశ
యీ రీతి నీచే కాక యితరులు లేరూ ॥ఎంత॥

రేకు 68 సంఖ్య 393 సంపు 21 పుట 264

సీ. నీదుసంకల్పంబు నీరజాసనముఖుల్
తప్పించఁగా లేరు దాఁటు లేరు
ఈవు దైత్యులమీఁద నెత్తిన చక్రమ్ము
త్రిప్ప లేరు మహిమ దెలియ లేరు
మన్నింతు నన నీవు మాన్పలే విప్పించ
గా లేవు సంచితకర్మతతులు
నేమించక జగాల నీవు పరాకైన
పెదరచలేవవి పెనఁగ లేవు

ఆ. మమ్ముఁ గరుణనేల మా యపరాధముల్
మారుకొనఁగ లేవు మలయ లేవు
ఏమి నీ ప్రతాప మెందు నీ కెనలేదు
వింతలేల? నిను భజింతు దేవ!

బౌళి

నాలోనే నీ వున్నాఁడవు న న్నేల భ్రమయించేవు
యీ లీల చూచి మఱపై యిటువలె నున్నది ॥పల్లవి॥

దైవమా ని న్నెఱుఁగుదు తప్పక కొలువనోప
భావించుకొందు ధర్మము పట్టఁగ నోప
కావలెనందు విరక్తి కడకూ నడపనోప
కావరానఁ బగలు చీఁకటి దవ్వేమిదివో ॥నాలోనే॥

యెఱుఁగుదు సుజ్ఞాన మిట్టే మదిలో నుండదు
వెఱతు సంసార మట్టే విడువలేను
మఱవను నీపై భక్తి మట్టుపెట్టరాదు బుద్ధి
తఱిలో నీటిలోనుండే దప్పిగానే యిదివో ॥నాలోనే॥

చదువుదు శాస్త్రములు సారమందు గ్రహించను
వెదకుదు మోక్షచింత విస్తరించను
యెదుట శ్రీవేంకటేశ యింతలో న న్నేలితివి
సదరానఁ బైఁడికి వాసనవచ్చె నిదివో ॥నాలోనే॥

రేకు 52 సంఖ్య 298 సంపు 21 పుట 197

సీ. ని న్నెఱుంగుదుహరి! నిచ్చ గొలువ నోప;
భావింతు ధర్మమ్ము, పట్టనోప;
కాంక్షించెద విరక్తి, కడకు నడపనోప;
పగటు చీఁకటిదవ్వు పొలసుండ-
ఎఱుఁగుదు సుజ్ఞాన, మిట్టి యుండదు మది;
వెఱతు సంసృతి, కట్టి విడువనోప;
మఱవ నీపైభక్తి, మట్టుపెట్టను బుద్ధి;
తఱి నీటిలోనుండి దప్పిగొందు-

గీ. చదివెదను శాస్త్రములు, వాని సారమెంచ;
వెదకెదను మోక్షచింతను, విస్తరించ;
నింతలో వేంకటేశ! న న్నేలితయ్య!
పరఁగ పైఁడికి వాసనవచ్చె నౌర!

లలిత

నే నన్నిటాఁ గూర్చిరుఁడ నీవే గతిగా వచ్చితి
మానక నన్నేలఁకొని మన్నించ వలెను ॥పల్లవి॥

నేరమి సేసినవాఁడు నెమ్మి యింటికి వచ్చితే
మారుకొన కన్నియును మఱపవలె
కాఁగులు వల్కినవాఁడు గక్కునఁ బంత మిచ్చితే
నేరుపుల నేస్తములే నెఱపఁగ వలెను ॥నేనన్నిటా॥

పగవాఁడైనవాఁడు బంటనని మొక్కితే
సొగసి లోఁగొని కృపఁజూడవలెను
వెగటున నాసదోసి వెఱపుమాలినవాఁడు
అగపడి యాజ్ఞపెట్టుమంటే మానవలెను ॥నేనన్నిటా॥

ధనమెత్తుకొన్నవాఁడు తానే వచ్చి పనివేళ
నని మొన నిల్చితేఁ జేకొనవలెను
వనరి యజ్ఞానమువాఁడ నిన్ను నుతించితి
ఘనుఁడ శ్రీవేంకటేశ కావవలె నన్నును ॥నేనన్నిటా॥

**రేకు 51 సంఖ్య 288 సంపు 21 పుట 194**

సీ. నేరమి గావించి నెమ్మి నిల్లొత్తిక్కిన
మార్కొన కన్నియు మఱవవలయు
కాఁకులు వల్కియుఁ గడుఁ బంతమిచ్చిన
నేర్పున నేస్తమే నెఱప వలయు
పగవాఁడు వచ్చి నీ బంటు నంచును మ్రొక్క
సొగసి లోఁగొని కృపఁ జూడవలయు
ద్రవ్య మెత్తినవాఁడు తా వచ్చి పనివేళ
నని మొన నిలువఁ జేకొనఁగ వలయు

ఆ. మఱియు నాసదోసి వెఱపుమాలినయాతఁ
డానపెట్టు మనఁగ మానవలయు
నీవె గతిగ వచ్చి నిను మెచ్చినాఁడను
కూళఁ గావుమయ్య! కొండలయ్య!

బౌళి

శంకము నీవు సాక్షి చక్రము నీవు సాక్షి
వంకలాడ భుజముల వ్రాసుకొంటి మిమ్ము ను ॥పల్లవి॥
నారాయణా యని యిట్టె నరకములు తరించితి
శ్రీరామా అని పొందితి జీవన్ముక్తి
దూరించి గోవిందా యని తోలితి పాపము లెల్ల
ధీరుఁడనై వటకెల్ల తిద్దుకొంటి నిదిగో ॥శంకము॥
దామోదరా అని తొల్లి దాఁటితి దుఃఖము లెల్ల
వామనా అని కర్మములు వంగఁ దొక్కితి
భూమిరమణా యని పుటుగులు గెలిచితి
వేమరు నితరులకు వెరవ నే నింకను ॥శంకము॥
హరి యచ్యుతా యని ఆపదల నణఁచితి
పురుషోత్తమా యని పుణ్యము లెల్లా మీటితి
అరుదైనా శ్రీవేంకటేశ యని లోకముల మించితి
తొరలి సంసారపుదూరు చక్కఁబెట్టితి ॥శంకము॥

రేకు 29 సంఖ్య 169 సంపు 21 పుట 113

సీ. శంఖచక్రములార! సాక్షులు మీరు మి
మ్మిరుభుజంబుల లిఖియించుకొంటి;
నారాయణా యని నరకముల్ గడచి జీ
వన్ముక్తుఁ డైతిని వామన యని
దామోదరా యని దాఁటితి దుఃఖముల్
తోలితి నఘము ప్రద్యుమ్న యనుచు
వాసుదేవా యని వంగఁద్రొక్కితి కర్మ
మనిరుద్ధ యని జన్మ మణఁచినాఁడ
నరసింహా యంచును వెఱపును వీడితి
శ్రీరామ యని కొంటి శ్రేయములను
గీ. ఆపదలఁ బాసితిని హరి! అచ్యుత! యని
పొందితిని పుణ్యములను గోవింద యంచు
లోకముల మించితిని శ్రితలోకకల్ప
వృక్షమా! శ్రీశ! తిరువేంకటేశ! యనుచు.

సా మం తం

ఇన్నిటికీ మూలము యిందిరానాయక నీవే
సన్నల నే నెటువలె సాధింతు నయ్యా ॥పల్లవి॥
యెందును బలవంతము యింతులచుట్టరికము
అందున కంటే వాలాయ మాహారవాంఛ
అందిన పిసిండితన మా రెంటికంటె నిష్ఠురి
కందువ నే నెవ్వరినిఁ గావ వీతొత్తునయ్యా ॥ఇన్ని॥
వీడని సమ్మంధము వెస దేహానకు నాకు
ఆడికూడిన సంగాత మహంకారము
తోడిలంకె యెపుడును దురభిమానములు
వాడికేయ నెవ్వరి నీవలకందునయ్యా ॥ఇన్ని॥
మిక్కిలినేస్తము తొల్లె మించులబంగారము
నిక్కముగా ననుబంధి నిర్దయత్వము
వొక్కటై కనుఁగొనుచు వున్నాఁడవు నాలో నీవే
యిక్కడ శ్రీవేంకటేశ యెవ్వరి రోఁతునయ్యా ॥ఇన్ని॥

రేకు 65 సంఖ్య 372 సంపు 21 పుట 250

సీ. చెలులచుట్టఱికమ్ము తలపంగ బలవంత;
మంతకు నెక్కు డాహారవాంఛ;
పిసిడితనమ్ము భావింప రెంటిని మీఱె-
చిత్తమ్మనుచు వీని తొత్తునైతి;
విడనిసంబంధంబు వెస మేనికిని నాకు;
కవగూడె మఱి యహంకార మొకటి;
తోడిలంకె యెపుడు దురభిమానమ్ములు;
బదులుసెప్పక వీనిబంటనైతి;
గీ. కలదు చిరకాలమైత్రి బంగారుతోడ;
నిక్కువముగ తదనుబంధి నిర్దయత్వ:
మీవు నాలోనఁ గనుచుంటి వెవరి రోతు
నెట్లు నీ వాఁడ నగుదునో వృషగిరీశ!

శ్రీ రా గం

ఎవ్వరివంకా నే మున్నది
నవ్వుచు నీశ్వర నను( గావ(గదే ॥పల్లవి॥
ప్రతిబంధములకు( బంత మిచ్చితిని
రతి నా తెరువి(క రాకు మని
గతిమాలి మాయకు కడు వీ(పొగ్గితి
మతి నను నేపక మన్నించు మనుచు ॥ఎవ్వరి॥
చెప్పితి( బ్రియములు చిత్రగుప్తునకు
తప్పక కవెలలు దాచుమని
ముప్పిరి మొక్కితి గుసుపనే మనసుకు
యెప్పుడు( గదలకు నేగికు మనుచు ॥ఎవ్వరి॥
పూరడించితిని నొడ(బరచి విద్రను
సారె నేమరించకు మనుచు
యీ రీతి శ్రీవేంకటేశ యలసితిని
చేరి నన్ను( గృప సేయ(గదే ॥ఎవ్వరి॥
రేకు 65 సంఖ్య 375 సంపు 21 పుట 252

సీ. ప్రతిబంధపటలికి( బంత మ్మొసంగితి
రతి నాదుతెరు వి(క రాకు మనుచు
గతిమాలి మాయకు కడు వీపు నొగ్గితి
మన్నించి యేచుట మాను మనుచు
చెప్పితి( బ్రియములు చిత్రగుప్తునకును
తప్పక కవిలెలు దాచు మనుచు
మొదటనే మ్రొక్కితి మొండిచిత్తమునకు
నెప్పుడు కదలకు మేగకు మని
గీ. ఊరడించితి నిదుర నే నొడ(బఱచుచు
సారె నేమరించకు మని సప్తశైల
నాయకా! యిట్టు లలసితి; నవ్వుకొనుచు(
గరుణతో నన్ను సతతంబు కావ(గదవే

లలిత

ఏమనిచెప్పుట మా యజ్ఞానము యెఱిఁగి యెఱిఁగి తెలియఁగలేము
శ్రీమాధవ నీ మఱుఁగు చొచ్చితిమి చిత్తగించి దయఁ జూడఁగదే ॥పల్లవి॥
నీవు రక్షకుఁడవై భువినుండఁగ నే గడియించే దిఁకనేమి
జీవాంతరాత్ముఁడవై యుండుదు వట చేకొని కావకమానేవా
వేవేలుగఁ బుట్టించఁ గర్తవట వెలయించఁగ నీ భారముగాదా
భావింపనేరక పట్టి స్వతంత్రము పయివేసికొనుచుఁ బరగేము ॥ఏమని॥
పలుతెఱఁగుల నీ నామము లుండఁగ పాపములకు వెఱవఁగ నేలా
జలిమి నీ ముద్రలు యంతటఁ జెల్లఁగ పైకొనునా యింక నరకములా
తలఁక నభయహస్తము నీ యెత్తఁగ దాసుల కిఁక నెక్కడిభీతి
నిలుపఁగ నేరక మనసువెంబడి నే నిచ్చనిచ్చలునుఁ గొరలేము ॥ఏమని॥
అది నీ రూపము తిరువారాధనమై యుండఁగ వెదకఁగ నేలా
పదింపుటాచార్యుఁడు గలుగఁగ నిహపరముల తోఁ వెదుగఁగ నేలా
వుదుటున పరములు శ్రీవేంకటేశుఁ డొసఁగఁగ నే కోరఁగ నేలా
తుద మొద లెంచర యిన్నాళ్ల నేమిటి దొరకొని యిఁక నుతియించేము
॥ఏమని॥

రేకు 45 సంఖ్య 257 సంపు 21 పుట 173

సీ. నీ నామములు భువి నిండియుండఁగ ఘోర
పాపమ్ములకు వెఱవంగ నేల ?
అతికృపతోడ నీ వభయహస్తము నెత్త
భయ మెక్కడిది దాసవర్గమునకు ?
అర్చింప నీ రూప మవసథంబున నుండ
వేఱులాపుల నింక వెదక నేల ?
ఆచార్యదేవుఁడే యాధారమై యొప్ప
నిహపరమ్ములతోవ నేల యడుగ ?
రక్షకత్వమ్మున రాజిల్ల నీవు నే
గడియించునది యేమి పుడమియందు ?
జీవాంతరాత్ముండవై వెలుఁగుదు వంట
వెలయించకుండ న న్విడుతు వటవె ?
గీ. కొల్లగ వరంబు లీ వీయఁ గోరనేల ?
వట్టి స్వాతంత్ర్యమున్ పయివైచికొనుచు
మనసువెంబడిఁ బొరలితిః మినకులేశ !
యిఁక నుతింతుః మేమఱినార మిన్నినాళ్లు.

శంకరాభరణం

కోరి ధర్మముచాలు కుక్కఁబట్టు మన్నరీతి
యీ రీతి నింతసేసితి వింత చాలదా ॥పల్లవి॥

చక్కఁగా నవ్వొక హీనజంతువుఁగాఁ బుట్టించక
తెక్కువ నరునిఁజేసి తింతచాలదా
దిక్కుల నిది చాలక దివ్యభోగముగోర
అక్కర నా కొక ఆసోదమా ॥కోరి॥

పాతకాలు సేసేటి పరులబంటుఁ జేయక
యీతల నీ బంటుఁ జేసి తిది చాలదా
ఆతల నీవద్ది సనకాదులపదవిగోర
ఆతుమలో నా కొక ఆసోదమా ॥కోరి॥

నరక మనుభవించ నన్ను నందు నిలుపక
యిరవై యిహ మిచ్చి తిది చాలదా
ధర శ్రీవేంకటపతి తగ నీకు శరణంటి
పరముగోరను యింకా నప్పటి నాసోదమా ॥కోరి॥

రేకు 24 సంఖ్య 195 సంపు 21 పుట 90

సీ. భువి నన్ను హీనజంతువుగఁ బుట్టింపక
నలిపితి నరునిగాఁ జాలదేమి ?
ఇయ్యది చాలక యిందిరాభోగమ్ముల
కక్కఱపడెద నే మద్భుతంబు !
పాపులౌ పరులకు బంటుసేయక నన్ను
నేలితి బంటుగాఁ జాలదేమి ?
అదియుఁ జాలక సనకాదిమౌనులపదం
బిచ్ఛింతుఁ జోద్య మింకేమి యుండు ?
గీ. అనుభవింపుము నరకమం చందుఁ ద్రోయ
కిహ మొసంగితి చాలదా యేమి ? నీకు :
శరణనుచుఁ గోరుచుంటిని పరముఁ నింత
కంటె వింతలు గలవె ? వేంకటనగేశ !

దేవగాంధారి

నీ దయాధర్మమునకు నీ చిత్త మిఁక
యీ దెస మానేర్పు లిఁక యెంచఁగలదా ॥పల్లవి॥
యీవల నా యపరాధ మెఱుకతో నీకుఁ జేసి
గావు మని మిమ్మన సంగతులా నాకు
కైవసమై నీకు వేఁగాదియుండి కొలువక
సేవించ చేయెత్తి మొక్క సిగ్గుగాదా నాకు ॥నీదయా॥
మన్నించిన నీ మన్నన మఱచి మత్తుఁడనై
యున్నిటా నీ వాఁడ నంటే యేమందువో
యెన్నిక ద్రోహినై యిప్పు డిచ్చకాలు సేయఁబోతే
నన్నుఁ జూచి పరులెల్లా నవ్వరా యింకాను ॥నీదయా॥
కొంత సంసారభక్తితో కోరి నీ భక్తుఁడ నైతి
నంతుల విజ్ఞాన మెటువలె నుండునో
యింతట శ్రీవేంకటేశ యిట్టె నన్ను రక్షించితి
వంతర్యామివి నీవు అది నా విన్నపము ॥నీదయా॥

రేకు 18 సంఖ్య 102 సంపు 21 పుట 68

సీ. ఈవల నపరాధ మెఱుకతోఁ గావించి
కావుమం చనఁగ సంగతియె నాకు?
కైవసమై వేళగాని నిన్గొల్వక
చేయెత్తి యిటు మ్రొక్క సిగ్గుగాదె?
మత్తుండనై నీదు మన్నన మఱచి నే
నీవాఁడ నన నేమి నీ వనెదవొ?
ఎన్నిక ద్రోహినై యిపు డిచ్చకాల్ సేయ
నవ్వరా పరులింక నన్నుఁ జూచి?
గీ. కొంత సంసారభక్తితోఁ గోరి నీదు
భక్తుఁడైతి విజ్ఞాన మేపగిది నుండు
నో! దయాధర్మమునకె నన్నోము వయ్య!
ఇదియె నా విన్నపంబయ్య! వృషగిరీశ!

## సాళంగనాట

నీవల్లఁ గరమలేదు నిజమూర్తివి
వావిరి సుఖించనేర్చే వారివారి పుణ్యమూ ॥పల్లవి॥

కొలిచే మనే వారికి కోరిన యేలికవు
తలిచే మనే వారికి దైవమవూ
సొలసే మనే వారికి చుట్టమవు నీవు
వలసినందు భావించే వారివారి పుణ్యము ॥నీవల్ల॥

తగిలేమనే వారికి ధనధాన్యమవు నీవు
పగటు కృషికులకు పాఁడిపంటవూ
తగిలిన యోగీంద్రులకు తత్త్వరహస్యము నీవు
వగలఁ దెలుసుకొనే వారివారిపుణ్యము ॥నీవల్ల॥

చదివేమనే వారికి సర్వశాస్త్రములు నీవు
మొదల నందరికిని మూలమవు
కదిసి శ్రీవేంకటేశ గతి నాకైతే నీవు
వదలక చేపట్టేవారివారి పుణ్యము ॥నీవల్ల॥

రేకు 17 సంఖ్య 97 సంపు 21 పుట 65

సీ. కొలిచెడువారికిఁ గోరిన విభుఁడవు;
తలఁచెడువారికి దైవతమవు;
సొలసెడువారికి వలపుచుట్టంబవు;
భావించువారల భాగ్య మంతె;
తగిలెడువారికి ధనధాన్యములు నీవ;
పాడిపంటవు కృషీవలుల కెపుడు;
చదువువారల కీవు సర్వశాస్త్రమ్ములు;
సుఖియించువారలసుకృత మంతె;
తె. తగులు యోగులకును తత్త్వరహస్యంబు;
వంతటికిని మూల మరయ నీవ;
వదలక భజియించువారి పుణ్యమ్మింతె
తిరుమలేశ ! నాకు దిక్కు నీవె.

గుండక్రియ

విస్తరించి చూడఁబోతే వెఱఁగయ్యీ నాకు నేఁడు
తవిలి పుట్టినినాఁడు తనువులెం దుండెనో ॥పల్లవి॥

జననిగర్భములోన సరి నే నుండేనాఁడు
యెనసి యాడనుండెనో యీ యాస
మునుప నంతకు తొల్లి మునిఁగి పరలోకము
కొనల నుండేడినాఁడు కోపము లెందుండెనో ॥వివరించి॥

పొత్తులలోపల నేను పొరలు పెట్టేనాఁడు
యిత్తల జవ్వనమద మెందుండెనో
నిత్తెము నిదురలోన నేఁ గలలు గనేనాఁడు
యిత్తి యీ కాఁపురము లివి యెందు నుండెనో ॥వివరించి॥

మానక పంచేంద్రియమత్తుఁడనై వున్ననాఁడు
యీ నేఁటి బ్రహ్మానంద మెందుండెనో
తానే శ్రీవేంకటేశుఁడు దయఁజూచెఁగాక నన్ను
అనుకొన్న కర్మము యేమంటాఁ దా నుండెనో ॥వివరించి॥

రేకు 8 సంఖ్య 49 సంపు 21 పుట 38

సీ. జననిగర్భములోన మునిఁగి యుండినవేళ
నీ దురంతాశ తా నేడనుండె ?
అంతకుమునుపు నే నాపరలోకము
కొనల నున్నపు డెందు కోపముండె ?
పొత్తులలోపలఁ బొరలుచుండెడి వేళ
నీ జవ్వనపుమద మెందునుండె ?
నిత్తెము నిదురలో నే కలల్ గనువేళ
నే పొంతనుండె నీ కాఁపురములు ?

గీ. ఏను పంచేంద్రియోన్మాది నైనవేళ
నెవటనుండె బ్రహ్మానంద ? మెంచ వెలుగు
కలుగు; వేంకటపతి దయగనఁగ నాను
కొనిన కర్మ మే మనుచు నుండెనో యెఱుఁగ.

సా మ ం త ం

పలుయోనులందు పుట్టి భ్రమసితిని
అలర నే నేజాతి ననుకొందునయ్యా ॥పల్లవి॥

వెనకజన్మముల నా వేడుకైన కాఁపురాల
యెనయు సతులు సుతు లెంద రెందరో
మునుకొని యీ జన్మమునఁ గొంద రున్నారు
మనసున నెవ్వరి మా వారందు నయ్యా ॥పలు॥

ఆదికాలమున నుండి ఆయాదేహాలు మోచి
ఆ దెస యేమేలు నా సొమ్మని వుంటినో
నాదించి యిప్పుడు గొన్ని నావియనుచు నున్నాఁడ
యేది సతమని వుందు యెఱిఁగించ వయ్యా ॥పలు॥

అన్నిటా నా బాముచూచి యింతలో శ్రీవేంకటేశ
యెన్నరాని విజ్ఞాన మిచ్చితి విట్టె
పన్నిన నా మనుపటి పాట్లెల్లా నెంచుకొంటె
నన్నుఁజూచి నాలోనే నవ్వువచ్చీ నయ్యా ॥పలు॥

రేకు 15 సంఖ్య 85 సంపు 21 పుట 57

సీ. పలుయోనులం బుట్టి భ్రమసితిః నేజాతి
వాఁడ నే నని పల్కువాఁడ నయ్య!
వెనుకజన్మముల నా వేఁడుకకాఁపురా
లందు సతీసుతు లెందఱయిరొ!
మునుకొని యీ జన్మమునఁ గొంద ఱున్నార
లెవరు మా వారని యెంతు నయ్య!
అదికాలమునుండి అయాశరీరాల
నే మేలు సొమ్మని యెంచినానొ
అవి నావి యివి నావి యని యిప్పు డనుచుందు
నెది సతమ్మని యుందు నెఱుకపఱచు
గీ. అమితకృపతోడ నా బాము లన్ని చూచి
యెన్నరాని విజ్ఞానమ్ము నిచ్చినాఁడ
విందిరేశ! నా తొలిపాట్లు నెంచుకొన్న
నన్నుఁ జూచి నాలోననే నవ్వువచ్చు.

### శంకరాభరణం

నీవే బోధించి నన్ను నీవే యాదేర్తుగాక
నావంక నేమిగలదు నమో నారాయణా ॥పల్లవి॥

పంచిన నాకర్మములు పనులే బోధించుఁగాక
పొంచిన శ్రీహరి నిన్ను బోధించీనా
తెంచరాని ఆసలివి తిమ్మటే బోధించుఁగాక
కంచపు నీ దివ్యనామకతలు బోధించీనా ॥నీవే॥

పొరలు యింద్రియములు భోగమే బోధించుఁగాక
పురుషోత్తముఁడ నిన్ను బోధించీనా
సరుస నా యాఁకలిది చవులే బోధించుఁగాక
నిరతి నీ కైంకర్యము నేఁడు బోధించీనా ॥నీవే॥

గాసిల్ల నామతి యహంకారమే బోధించుఁగాక
భాసతీక నిన్నుఁగాన బోధించీనా
యీసుదీర శ్రీవేంకటేశ నీకు నా గురుఁడు
దాసి బోధించుఁగాక తప్పఁగా బోధించునా ॥నీవే॥

రేకు 81 సంఖ్య 174 సంపు 21 పుట 116

సీ. పంచిన కర్మముల్ పనులనే బోధించు
నిన్ను బోధించునా నీరజాక్ష ?
తెగనియాశలు వట్టి తిమ్మటు బోధించు
బోధించునా నీదు పుణ్యకథలు ?
పొరలు నింద్రియములు భోగమ్ము బోధించు
బోధించునా నిన్ను భువనవంద్య !
తవిలి నా యాఁకలి చవులె బోధించును
బోధించునా నీదు భూరిసేవ ?
గీ. తా నహంకృతి బోధించు మాన దెపుడు
నిన్నుఁ జూడ బోధించునా నన్నుఁ మనసుఁ
నన్ను బోధించి రక్షింప నిన్నె వింతు
ఏడుమలలప్ప! నా వంక నేమిగలదు ?

వ రా ళి

ఆ మూరితియే యీ మూరుతి అందునిందు భేదములేదు
సోమార్క నేత్రుఁడ విశ్వరూపములు చూచినవారమే మును నేము ॥పల్లవి॥

బలిమితోడ వత్సాపహరణమున బ్రహ్మకు నీమాయ చూపితివి
విలసిల్లఁగ రణభూమిని నరునకు విశ్వరూప మటు చూపితివి
అలరిన నీ రూపు జలమధ్యంబున అక్రూరున కటు చూపితివి
చెలఁగి కుమారస్వామికి నారూపు శ్రీవేంకటగిరిఁ జూపితివి ॥ఆమూరితి॥

దైవికముగ దుర్యోధనుసభను ప్రతాపము నీ రూపు చూపితివి
ఆ విధముననే నీ రూప ముదంకునాశ్రమమున నటు చూపితివి
నీ విధమెఱుఁగని భీష్మకునకు మతి నిర్మలరూపము చూపితివి
శ్రీవేంకటగిరి నా రూపంబే చేరి పరుషలకుఁ జూపితివి ॥ఆ మూరితి॥

పుట్టినపుడే వసుదేవునకు చతుర్భుజముల నీ రూపు చూపితివి
జట్టిగ గొల్లెతలకు రూపము రాసక్రీడలలోఁ జూపితివి
యిట్టే నారదునకు ద్వారకలో యింటింట నీరూపు జూపితివి
పట్టుగ శ్రీవేంకటేశ్వర ఆ రూపమె మా కిప్పుడు చూపితివి
॥ఆ మూరితి॥

రేకు 77 సంఖ్య 441 సంపు 21 పుట 296

సీ. నీ మాయఁ జూపితి నిఖిలమ్ము సృజియించు
నజునకు వత్సాపహరణవేళ;
రణరంగమందు ఫల్గునునకు నీ విశ్వ
రూపంబు వింతగఁ జూపినావు;
యమునాస్రవంతితోయముల నక్రూరున
కేపారు నీరూపుఁ జూపినావు;
కార్తికేయునకు వేంకటమహీధరమందు
చొక్కమౌ నీరూపుఁ జూపినావు;
కురురాజుసభలో నకుంఠవిక్రమముతో
దీపించు నీ రూపుఁ జూపినావు;

తనివి సనంగ నుదంకునాశ్రమమున
సుంధరరూపమ్ముఁ జూపినావు;
ప్రీతి నిండారంగ భీష్మకునకు నీదు
శోభనరూపంబుఁ జూపినావు;
వసుదేవునకు చతుర్బాహుశోభితము నీ
రూపు పుట్టినయప్డె చూపినావు;
రాసకేళుల గోపరమణీమణుల కెల్ల
సొబగైన నీ రూపుఁ జూపినావు;
నారదమౌనికి ద్వారక నింటింట
తీపారు నీ రూపు చూపినావు;

గీ. స్వామి నీ విశ్వరూపమ్ము లేము మున్ను
చూచి నట్టివ; భేదమ్ము సుంత లేదు
ఆ స్వరూపమ్మె యిపుడు శేషాద్రియందు
పరసలకుఁ జూపుచుంటివి పరమపురుష!

గు జ్జ రి

విన్నప మిదియే వేవేలకు గోవిందా
సన్నుతించెదను నావలనఁగలుగు సర్వాపరాధము లెంచకుమీ ॥పల్లవి॥
యెఱుఁగమినాది యెఱుక నీపని యేమరి సంసారినైన యిన్నాళ్లను
మఱతును నేను మఱవవు నీవు మదమున సిరు లుప్పతిల్లఁగా
కొఱగాను నేను కొఱగలవునీవు కొమ్మలవలపులఁ దగిలితిఁ గనక
మఱి నీవేగతి రక్షింపుము నామర్మము నీచేతనున్నది సుమ్మీ ॥విన్నప॥
నేరమి నాది నేరుపు నీది నేఁ బుట్టుగులకు లోనైనయపుడే
కోరుదు నేను కోరవు నీవు గొనకొని యాపదలు పైకొనఁగా
దూరుదు నేను దూరవు నీవు తొరలి పురాకృతకర్మము లప్పుడు
యే రీతినైనా నీవే దిక్కింక యిదె నీకు శరణుచొచ్చితిఁజుమ్మీ ॥విన్నప॥
తలఁచమి నాది తలఁపు నీవి యిటు తగ నంతర్యామివి గతకాలము
కొలుచుట నాది కొలువుగొనుట నీది కూరిమితో నే నీకు మొక్కఁగా
ఫలము నాది నాఫలదుఁడవు నీవు పరికింపఁగా శ్రీవేంకటేశ్వర
బలువుఁడవు నీవు నన్ను నేలు నా పాలిదైవమవు నీవే సుమ్మీ ॥విన్నప॥

రేకు 19-19 సంఖ్య 459 సంపు 21 పుట 308

సీ. ఎఱుఁగమి నాయది యెఱుకయే నీయది;
మానుగ సంసారినైన యప్పుడె
మఱతును నే నీవు మఱవవు; మదమున
కుప్పలుగా సిరు లుప్పతిలిన
కొఱగాను నే; నీవు కొఱయగాదు వెప్పుడు
మగువలవలపులఁ దగిలి నపుడు;
నేరమి నాయది నేరుపు నీయది
నేను పుట్టులకు లోనైన యపుడె;
కోరుదునే నీవు కోరవు గొనకొని
యాపదల్ పైకొన్నయట్టి తఱిని
దూఱుదునే నీవు దూఱవు తొరలి పు
రాకృతకర్మముల్ సోఁకినపుడు;
గీ. కొలుచుటయ నాది నీయది కొలువు గొనుట;
ఫలదుఁడవు నీవు నాయది ఫలము; నీకు
మ్రొక్కి శరణంటి మఱి నీవె దిక్కు నాకు
దయను బాలింపు నాపాలి దైవ మీవె.

బౌళి

గోవింద కేశవ నీకు కుయ్యో మొఱ్ఱో
వోఁపం బీపాలఁజిక్క దోహో నా మనసు ॥పల్లవి॥

వొకటిపైఁ గాంక్షించు వొకటిపై వేసారు
వొకవేళ దుర్మాన మొడిగట్టును
వికలుఁడై యంతలోనే విషయపుబారిఁ జిక్కి
అకటా యిన్నిటాఁ దుమురాయఁటో నా మనసు ॥గోవింద॥

తలపోసు నొకవేళ తమకించు నొకవేళ
వొలుకుఁ గోపము చల మొకవేళ
కలఁగించు నొకవేళ గర్వించు నొకవేళ
పొలపి యిన్నిటా పీదిఁబోయఁటో నా మనసూ ॥గోవింద॥

సంతసించు నొకవేళ జయమందు నొకవేళ
పంతమాడు నొక మట్టుపడినవేళ
యింతలో నీవు శ్రీవేంకటేశ కాపకయుండితే
రంతుల నేమిఁ జెప్పరాదువో నా మనసూ ॥గోవింద॥

రేకు 14 సంఖ్య 76 సంపు 21 పుట 51

సీ. ఒకదానిఁ గాంక్షించు నొకటికి వేసారు
నొకటు దుర్మానమ్మునకుఁ గడంగు
వికలత నంతలో విషయవాసనఁ జిక్కి
నిన్నిట తుమురాయె నీ మనంబు;
తలపోయు నొకవేళ దమకించు నొకవేళ
నొలుకు కోపము చల మొక్కవేళ
కలఁగించు నొకవేళ గర్వించు నొకవేళ
నిటు వీథపాలాయె నీమనంబు;

గీ. సంతసంబందు నొకవేళ; జయము నొందు
నొక్కవేళ; పంతములాడు నొక్కవేళ
పాపపుమనంబు క్షణము నీపాలఁ జిక్క
దేమి సెప్పుదు కావుమా! స్వామి! నమ్మ.

బౌ॥

దైవమా నన్నిందులో తగు మానిసిఁగాఁ జేసి
యీవల రక్షించే మేలు యిది చాలదా ॥పల్లవి॥

అవ్వలఁ దిరిగెపెములై అంగలార్చే జీవులలో
యెవ్వరిఁబోలుదు నే నెంచి చూచితే
రవ్వగాఁ గ్రిమికీటాలై రమియించే జంతువులలో
యెవ్విధి నే సరిగాక యెంతవాఁడ నేను ॥దైవమా॥

పాపముసేసి నరకబాధలఁబడే వారిలో
యేపున నన్నుఁ జూచితే యేనేమి బాఁతి
పైపై నజ్ఞానపు పశుపక్షిమృగాలలో
తోపునూకుడే కాక దొరనా నేను ॥దైవమా॥

యేమిటివాఁడనై నిన్ను ఇంకా నేఁ గొసరుదు
పామరుని నన్నింత పాలించితి
యేమని కొనియాడుదు యే నిన్ను శ్రీవేంకటేశ
ఆ మంచి నీ దాసులలో అరుహమా నేను ॥దైవమా॥

రేకు 8 సంఖ్య 44 సంపు 21 పుట 29

సీ. దీనాతిదీనులై తిరిగెపె మెత్తెడు జీవు
లందఱిలోన నే నెందు మిన్న ?
క్రిమికీటకమ్ములై రమియించు జంతువు
లందు నా యాధిక్య మెందుఁగలదు ?
నరకబాధలు సెందు దురితకర్ములలోన
నే నొకండను గాక యెక్కుడెందు ?
పశుపక్షిమృగములవలె తోపునూకుడు
గాక నాకుంగల ఘనత యెందు ?

గీ. ఎందు మొనగాఁడనై అది యిది యటంచు
నిన్నుఁ గొసరుదు ? పామరు నన్ను నింత
యేలితివి చాలదే ? శేషశైలనాథ !
అర్హుఁడనె నీదుదాసుల యడుగు లొత్త ?

మంగళకౌశిక

దేవ నావలన గుణము తెలిసి కాచే ననేటి
యీ వెఱ్ఱితనము మాని యిట్టే నన్నుఁ గావవే ॥పల్లవి॥
నేరుపే నాకుఁగలిగితే నెట్టన నింద్రియముల
బారిఁబడి బంటనై పంపు సేతునా
ఆ రీతి నేనే వివేకినైతే హేయపుమేను
కోరి బ్రహ్మ మని నమ్మి కొంకక గర్వింతునా ॥దేవ॥
నాలో బుద్ధిగలిగితే నలిఁ గామక్రోధములు
యీ లీల నా సొమ్ము లని యెన్నుకొందునా
తాలిమి నాయందు మంచితనములు గలిగితే
మూలనున్న నా కర్మములే కట్టివేసునా ॥దేవ॥
చిత్తమే కైవసమైతే చేరి సుఖదుఃఖముల
మత్తుఁడనై మఱచి యేమరి వుందునా
అత్తిన శ్రీవేంకటేశ అంతర్యామివి నీవు
తత్తరపు నా పస నీ వెఱుఁగవా ॥దేవ॥

రేకు 2 సంఖ్య 12 సంపు 21 పుట 8

సీ. నా గుణమ్ము లెఱింగి ననుఁగాతు ననియెడి
వెఱ్ఱితనము మాని వేగఁబ్రోవు
నేరుపు నాకున్న దూరముగా నుండ
కిందిృయమ్ములయాజ్ఞ లేల విందు ?
నే వివేకినయిన నీచదేహము బ్రహ్మ
మంచు భావించి దర్పించఁ గలనె ?
మతియున్న నాకుఁ గామక్రోధములు నాదు
సొమ్ములుగా నెఱనమ్మఁగలనె ?
నాయందు మంచితనంబు గల్గిన నన్ను
గట్టివేయఁగలదె కర్మచయము ?
గీ. చిత్తమే కైవసంబైనఁ జిగురుకొనెడు
ఖేదమోదంబులన్ నేను క్రిందుమీఁదు
లయ్యెదనె ? నీవు నిఖిలజీవాంతరాత్మ
వెఱుఁగవే నాదుపస సప్తగిరినివాస !

దే సా క్షి

నీ యుపకారమే మాకు నిఁ చే దింతేకాక
యేమిదా నీ యుదారత్వ మేమని నుతింతును ॥పల్లవి॥
నీ కరుణ నాకే పనికివచ్చుఁగాక మఱి
యీకడ నా భక్తి నీకు నెందు కెక్కును
కైకొని నాకు నీ రక్షకత్వము ఫలించుఁగాక
నీకు నా సేవల వంక నిండే దేమి ॥నీయు॥
నీవు నన్ను వెదకి మన్నించేదే యెక్కువగాక
భావించి నేఁ దలఁచే లాభము నీ కేమి
దేవ నీవు చనవిచ్చేదే నాకు గుఱిగాక
పూవుల నేఁ బూజించఁగ పొందేది నీ కేమి ॥నీయు॥
యిట్టే నీవు నాకు వరమిచ్చేదే ఘనతగాక
నెట్టన నేఁ గొలువఁగ నీ కయ్యేదెంతా
గుట్టున శ్రీవేంకటేశ కోరి నీకు శరణంటి
పట్టిన వినయమేకాక వచ్చేది నీ కేమి ॥నీయుప॥

రేకు 66 సంఖ్య 381 సంపు 21 పుట 256

సీ. పనికివచ్చును నాకు ఘనమైన నీ కృప
యిటు నాదుభక్తి నీ కెందుకెక్కు ?
నీవె న న్వెదకి మన్నించు టెక్కువగాక
నీ కేమిలాభము నేను దలఁప ?
నీకు నాసేవల నిండునదేమి ? నీ
రక్షకత్వము నాకు రాణగాక
నీవు పొందెడిదేమి నేఁ బూలఁ బూజింప ?
చనవిచ్చుటే దొడ్డతనముగాక
గీ. వరము లిచ్చుటె నాకు నీబిరుదుగాక
నేఁ గొలువ నీకుఁ జేకురు బాగదెంత ?
కోరి శరణంటి నీకు పంకేరుహాక్ష !
పట్టి వినయమ్ముగా కేమివచ్చు నీకు ?

సాళంగనాట

ఆదినారాయణ నాకు నభయ మీవె
కాదని తప్పు లెంచక కరుణానిధీ ॥పల్లవి॥

తుదకెక్క నింద్రియపుదొంగలకుఁ దా విచ్చితి
యెదుటికి రాఁగా నీ వేమందువో
మదించి నాలో నుండఁగా మఱచితి నే నిన్ను
యిదె కాను కియ్యఁగా నీ వేమందువో ॥ఆది॥

పక్కన నీ యాజ్ఞదోసి పాపములెల్లాఁ జేసితి
యిక్కడనే మొక్కఁగా నీ వేమందువో
దిక్కు నీ వుండఁగాఁ బరదేవతలఁ గొలిచితి
నెక్కొని రక్షించుమంటే నీ విఁక నే మందువో ॥ఆది॥

తొట్టి కామక్రోధాలతో దూరులెల్లాఁ గట్టుకొంటి
యిట్టె ముద్రమోచే నంటే నే మందువో
నెట్టన శ్రీవేంకటేశ నీకు నలమేల్మంగకు
గట్టిగా నే లెంకనైతి కరుణించే మందువో ॥ఆది॥

రేకు 18-15 సంఖ్య 447 సంపు 21 పుట 801

సీ. ఇంద్రియచోరుల కెలమి దావిచ్చితి
నేమందువో యెట్టయెదుట నిలువ
మదినున్న నిన్నేను మఱచితి మత్తెక్కి
యేమందువో కాన్క నే నొసంగ
భవదాజ్ఞ ద్రోసి పాపము లెల్లఁ జేసితి
నేమందువో మ్రొక్కు లిడఁగ నేను
కొలిచితి పరదేవతలను నీ వుండఁగా
నేమందువో బ్రోవుమీ యనంగ

గీ. కామినై క్రోధినై దూఱు గట్టుకొంటి
నేమియందువో ముద్రల నేను దాల్ప;
నీకు నలమేలుమంగకు నేను లెంక
నైతి హరి? కరుణించితి నందువేమొ

బౌళిరామక్రియ

ఇంతమాత్రము మా నేమ మిందు నీ కేమి గూడీని
చెంత ధర్మమునకు రక్షించేవు నీవు నన్ను ॥పల్లవి॥

పిడికెడుబియ్యమే పెద్దరికంబగు చెలిమి
తొడిబడ సంధ్య మూడుదోసిళ్ల నీళ్లు
నుడిగే జపము పేళ్లనూటయెనిమి దెంచేది
తడుపుకొనేది తీర్థస్నానము లన్నియును ॥ఇంత॥

పూరక యాఁకలిగొని వుండేది మా వ్రతములు
నీరసపుటాహారాలు నిష్ఠ లెల్లాను
వూరఁదోఁటలపువ్వు లొగి దేవపూజలు
గోరమైన బతుకులు కోరేటి తపములు ॥ఇంత॥

బలుసాకుతిలలు దర్భలు పితృపూజలు
పలుకకుందేది మా బలు మోనము
యిలపై శ్రీవేంకటేశ యిందు నిన్ను మెప్పించేమా
కలిగినది మాకు నీక మణి కాకా ॥ఇంత॥

రేకు 77 సంఖ్య 444 సంపు 21 పుట 298

సీ. పిడికెడు బియ్యమే పెద్దటికపుఁజెల్మి;
లలి సంధ్య మూఁడుదోసిళుల నీళ్లు;
నూటయెన్మిది పేళ్లు నుడువుటయే జపం;
బుఱక యాఁకలితోడనుంట వ్రతము;
పుణ్యతీర్థస్నానములు బొందితడుపులే;
నీరసాహారాలు నిష్ఠ లెల్ల
ఊరఁదోఁటలపువ్వు లొగి దేవపూజలు;
ఘోరంపుబ్రతుకులు గొనుతపములు;

గీ. పలుక కుండుట మౌనము; తిలలు దర్భ
లోఁజ బలుసాకు మాపితృపూజనములు;
ఇంతమాత్రము మా నేమ మెందుకెక్కు ?
ధర్మమున కీవు కాత్రువు దాఘజనుల.

మ ల హ రి

మఱవఁగ నియ్యదు రేఁచును మాయాప్రపంచ మిదివో
తెఱఁగిఁక నేదో తెలియదు దేహము మోచినను ॥పల్లవి॥

యెక్కడి మనోరథంబులు యెన్నో తలఁపునఁ బారుమ
తక్కక భుజించి యేకాంతంబున నున్నపుడు
చొక్కపుచుట్టరికంబులు చుట్టుక యింటికి వచ్చును
గక్కన సంసారబంధము కట్టుకొనినయంతా ॥మఱవ॥

పెనగొని పంతపుమాటలు పెక్కులు నోరను వెడలును
గొనకొని నలుగురిలోపలఁ గూచుండినవేళ
వనితలు వద్దనె వుండిన రావులు తానేకూడును
మన సొడఁబడి తనలోఁ గామము మిక్కుటమైనా ॥మఱవ॥

చేతులఁ బెనగొని కర్మము చేఁతలు యేమోసేయించు
యేతుల రాజ్యమదంబున నెనసిన సమయమునా
యీతల శ్రీవేంకటేశ్వర యేలితి విటు నను నీవే
కౌతుకముగ శరణాగతి కామను మ మ్మెపుడు ॥మఱవ॥

రేకు 76 సంఖ్య 439 సంపు 21 పుట 295

సీ. కమ్మగ మెనవి యేకాంతమం దున్నప్డు
తలఁపునఁ బాఱు కోర్కులు మఱెన్నొ;
సంసారబంధమ్ము సరి కట్టుకొనినంతఁ
జుట్టఱికా లిల్లు చుట్టుకొనును;
కోరి నల్వురిలోనఁ గూరుచుండినవేళ
పంతపుమాటలు బయలువెడలు;
వనితలగోష్ఠిలో వావులు నమరకూడు
చునసొడఁబఱిచి కామమ్ము రేఁగ;

గీ. దొరతనంబునఁ గండకావరము గ్రమ్మ
కర్మ లెన్నియొ పెనఁగొను కరయుగమ్ము
శరణుఁజొచ్చిన మమ్ములఁ గరుణతోడ
గాచినాఁడవు శ్రీవేంకటాద్రిరమణ!

గుజ్జరి

ఎక్కడ బోయెనో జాతస్మరత్వము యేమిసేయఁగలవాఁడను నేను
దిక్కు నీవే హరి నన్నుఁ గాచుటకు దేవదేవ యిఁక బోధింపవే ॥పల్లవి॥
తిరముగ జన్మాంతరమున సంపాదించిన సుజ్ఞానంబున
స్మరించి యీ పుట్టుగునఁ గడమ నే సాధించెద నని యంటినా
అరయఁ దల్లిగర్భంబున వెడలినయపుడే అన్నియు మఱచితిని
ధరలోపల నే విడువక దాఁపిన మరులుఁబాలు నను ముంకుఁజేసెను
॥ఎక్కడ॥
అంతట నేఁ బెద్దపెరిగి బుద్ధెఱిఁగి అటు నీమాయాప్రపంచమునను
చెంతల బహువిధసృష్టిలోఁ దగిలి చిక్కువడుచు నే భ్రమసితిని
చింతించి నే మఱిపెక్కులు చదువుచు చిత్తములో బహుసంశయములఁ బడి
అంతట సంతట జరగి జరగి కడు నజ్ఞానముపాలైతిని ॥ఎక్కడ॥
ముదిసినపిమ్మట లోభమోహములు ముంచుకొనఁగ నటు లోలుఁడ నైతి
వదలక భువిపై బ్రహ్మదేవుఁ డటు వ్రాసినవ్రాతలు నిజమాయె
చెదరక యలమేల్మంగ విన్నపముచేకొని శ్రీవేంకటేశ కాచితివి
బ్రదికితి నిఁక నాచార్యునియానతి ఫలియించెను నాభాగ్యమువలన
॥ఎక్కడ॥

రేకు 76 సంఖ్య 487 సంపు 21 పుట 294

జన్మాంతరార్జిత జ్ఞానస్మృతిం జేసి
సాధింతుఁ గడమ నీ జన్మనంచు
నెంతునా ? పుట్టినయంతలో నన్నియు
మఱచితి; మురుఁబాలు ముంకుఁజేసె;
అంతటఁ బెరిగి యావంత బుద్ధి నెఱింగి
సృష్టిమాయలలోనఁ జిక్కి చిక్కి
చదువులు పెక్కులు చదివి సంశయములఁ
బడుచు నజ్ఞానమ్ము పాలయితిని
గీ. ముదియగా లోభమోహముల్ ముంచుకొనియె
నజుఁడు వ్రాసిన వ్రాతలు నిజము లాయె
నేమి చేయఁగలాఁడ ? దిక్కెవ్వ ? నాకుఁ
బ్రోవఁగదవయ్య ! బోధించి దేవదేవ !

శ్రీరాగం

ఇంతసేయకుండితే నే నేడ నుందును
యెంతపుణ్యమో నీకు యేమిచెప్పే దింకను ॥పల్లవి॥
అట్టె నన్నుద్ధరించినయదె నీ ప్రతాపము
వొట్టి సంపన్నుఁజేసె నీ వుదారత్వము
గుట్టున వెనకవేసుకొనెను నీ పంతము
యిట్టి నా భాగ్యము నేఁడు యేమిచెప్పే దింకను ॥ఇంత॥
నరకము వెళ్లఁదీసె నన్ను నీ సాహసము
సరగ జ్ఞానిఁజేసె నీ చాతుర్యము
మరిగించుకొనె నన్ను మఱి నీ వాత్సల్యము
యిరవాయె నా వేడుక యేమిచెప్పే దింకను ॥ఇంత॥
నన్ను లోకపూజ్యుఁ జేసె నాఁడే నీ దొరతనము
విన్నపము లాలించే నీ విచారము
మన్నించె శ్రీవేంకటేశ మమ్ము నీ పట్టపుదేవి
యిన్నిటా బ్రదికించితి వేమిచెప్పే దింకను ॥ఇంత॥
రేకు 78 సంఖ్య 421 సంపు 21 పుట 283

సీ. ఇంతసేయకయున్న నే నేడనుండుదు
నెంతపుణ్యమొ నీకు నేమిసెప్పుదు
నన్నుద్ధరించెఁ గ్రిన్నన నీ ప్రతాపమ్ము
భవదుదారతయె సంపన్నుఁ జేసె
వెనుక వేసికొనియె వెన్న నీదుపంతమ్ము
నీ సాహసము పాపె నిరయభీతి
నీదుచాతుర్యంబు నెమ్మి జ్ఞాని నొనర్చె
నీ వత్సలత గూర్చె నిందుభక్తి
గీ. లోకపూజ్యుఁ గావించె నీ యేకవిభుత
మమ్ము మన్నించె నీ పట్టమహిషి మంగ
విన్నపము లాలకించెడి వేంకటేశ!
యిన్నిటన్ బ్రదికించితి వేమి సెప్పుదు.

సాళంగనాట

వెదకి వెదకి చొప్పు లెత్తుచును విచారించిరి నిన్నాళ్లు
యిదివో కంటిని శ్రీవేంకటగిరి యెదుటనే నీ శ్రీపాదములు ॥పల్లవి॥

ఘనతులసీకాననంబులో కాఁపురముసేతు వనఁగాను
అనిశమ్ముఁ బద్మవనంబునను ఆడుచునుండుదు వనఁగాను
నిను నీ దాసులు పాడేచోట్ల నెలవై యాలింతు వనఁగాను
యినమండలమున నుండుదు వనఁగా యీ మాట విని నేను ॥వెదకి॥

పైకొని క్షీరాంబుధిలో నెప్పుడు పవళించివుందు వనఁగాను
వైకుంఠంబున వెలుఁగొందుచు సర్వము భావించే వనఁగాను
దాకొని జీవులలో నెప్పుడు నంతర్యామివై వుందు వనఁగాను
లోకము నీవై వుండుదు వనఁగా లోలత నీమాట విని నేను ॥వెదకి॥

పరమయోగీంద్రులు తలపోయుచునున్న భావముతో నుండువనఁగాను
పరిపరివిధముల పుణ్యకర్మము పాయక చరింతు వనఁగాను
గరిమల నెప్పుడు అలమేల్మంగ కౌఁగిటిలోవాఁడ వనఁగాను
యిరవుగ శ్రీవేంకటేశుఁడ వనఁగా యీ మాట విని నేను ॥వెదకి॥

రేకు 72 సంఖ్య 411 సంపు 21 పుట 276

సీ. అరవిందవనముల నాడుచుండుదు వన
బృందావనిని గాపురింతు వనఁగ
రవిమండలమ్మున నివసింతు వన దాస
బృందగానమ్ములు విందు వనఁగ
అమృతాబ్ధి పవళింతు వన వికుంఠమునందు
వెలసి సర్వమ్ము భావింతు వనఁగ
జీవాంతరాత్మవై చెలఁగుదు వనఁగ ప్రి
పంచరూపుండవై పరఁగుదు వనఁ
బరమయోగీంద్రుల భావన వనఁ బుణ్య
కర్మముల్ వాయక గ్రాలుదు వన

గీ. మంగకౌఁగిటిలోపలిమాను వనఁగ
నీశ్వరేశుండు శ్రీవేంకటేశుఁడ వన
వినుచు నీ మాట యిన్నాళ్లు వెదకి వెదకి
కంటి నీ పాదయుగళి వేంగడమునెదుట.

గుర్జరి

ఎక్కడి వుపాయములు తే మున్నది
మొక్కె నీ కొక్కనికే మూలము నీవే ॥పల్లవి॥
పరులను శిక్షించి పనిగొనియెదవా
సిరుల నా శరీరము శిక్షించ లేను
పరుస లోకమింతాను వసముచేసుకొనేనా
పరగ నా మతి స్వస్థపరచుకోలేను ॥ఎక్కడి॥
నిక్కము నన్యదేహము నే ననుభవించేనా
పక్కన నా యాత్మ ననుభవించలేను
అక్కడా నిక్కడా ధన మడిగి కూరపెట్టేనా
ఇక్కటా నా విజ్ఞాన మార్జించలేను ॥ఎక్కడి॥
బట్టబాయిట నే దేవపట్టములు సాధించేనా
యిట్టే తపోరాజ్య మేలఁగ లేను
నెట్టన శ్రీవేంకటేశ నీవు నన్ను నేలితివి
పుట్టుగు లందేనా నీపై బుద్ధి మానలేను ॥ఎక్కడి॥

రేకు 55 సంఖ్య 816 సంపు 21 పుట 218

సీ. ఎక్కడియుపమల నేమియున్నది హరీ!
మొక్కెద నీ కొకనికే మూల మీవె
పరులను శిక్షించి పనిగొనఁగలనె నా
జేనెడుతనువు శిక్షింపలేను
వశముచేసికొనఁగ వలఁతినే జగము? నా
మతిను స్వస్థపఱచుకొనఁగ లేను;
అన్యశరీరమ్ము ననుభవింపఁ గలనె?
యనుభవింపంగలే నాత్మ నెపుడు!
అక్క డిక్కడ ధన మడిగి కూర్పఁగలనె?
యించుకజ్ఞాన మార్జించ లేను;
ఆ. బట్టబయల వేల్పుపట్టముల్ సాధింపఁ
గలనె? యెట్టితపము సలుపలేను;
నీవు కరుణఁజూప నిల్చియు నే బుద్ధి
మానలేను; జన్మ మరలఁగాను;

భూపాళం

జగన్నాథా నీ కొక్కనికి శరణు చొచ్చితిమి కావఁగదే
అగపడి మాలో నున్నాఁడ వనుచు నానతియిచ్చెను మా గురుఁడు ॥పల్లవి॥
కలదు లోకాలోకయదృష్ట మందుట కనుఁగొనలే రెవ్వరును
తొలుత జనించిన జన్మము లెంతురు తెలియ నశక్యములు
యెలమిని స్వర్గము గలదట మింకర నెక్కడనున్నదొ మిన్నులపై
వెలుపల నిట్టి విశేషంబులు నే వెతకఁగ నా తరమా ॥జగ॥
పొదుగుకొన్న దిదే కర్మ మెయందురు పొడచూపుటదే దెక్కడను
యెదిటిది మాయాకల్పితమే యట యెట్లు గురుతుపడు పోకును
కదిసి చరాచరములకు నెప్పుడును కాచుకొన్న దీ విధియని చెప్పెరు
విదితము లైనవి యెక్క డెక్కడని వెతకఁగ నా తరమా ॥జగ॥
అనుభవించువాఁ డాత్ముఁడే యందురు అణురూపం బని తలఁచఁగ రాదు
తనువు సాధనము సర్వేశుని కట తగులిదె కంటిమి దృష్టముగా
ననయంబును శ్రీవేంకటేశ్వరా యలమేల్మంగవిభుఁడా
నినుఁ గొలిచితి నిన్నిటికి సెలవుగా నీమహిమ తెలుఁగఁగ నా తరమా
॥జగ॥

రేకు 70 సంఖ్య 408 సంపు 21 పుట 271

సీ. కల దదృష్టం బందు కనఁజాల రెవ్వరు;
తొలుతటిజన్మముల్ తెలియరావు,
మిన్నులపై నెడనున్నదో స్వర్గమ్ము
వింత లిట్టివి నాకు వెదకఁ దరమె ?
పొదుగుకర్మం బందు పొడసూప దెచ్చటు;
యెదుటిది మాయయం దేమి గుఱుతు ?
కాచుకొన్నది విధి గదిసి చరాచర
మ్ములనెల్లెడు వెదకఁగ దరమె నాకు ?
గీ. అనుభవించువాఁ డాత్ముఁడే యణువుగాఁగ
తలఁపరా దందురు; ధర్మసాధనము దేహ
మందు [illegible]
నీదుమహిమలు తెలియంగ నాకు తరమె?

కాంబోది

ఏమిసేసే దీనికను యట్టు నిన్నుఁ దలఁచేది
నీ మతకమ్మేకాఁబోలు నీరజనాభా ॥పల్లవి॥

ఉఱక మనుజులకు నొక్కొక్కవేళ గుణము
మఱపుఁ దెలివి సేసు మరులఁగాదు
మఱియు నెంచిచూచితే మనసు నొక్కొక్కవేళ
గుఱిగడవఁగఁబారు గుఱ్ఱముఁగాదు ॥ఏమి॥

పన్నుక నొక్కొక్కవేళ పరులపై మచ్చరము
తన్నుఁ దానేవచ్చి పట్టు దయ్యముఁగాదు
తిన్ననై బత్తెముగొని దీపన మొక్కొక్కవేళ
వన్నెకెక్కిన యప్పులవాఁడుఁ దాఁగాఁదు ॥ఏమి॥

ముంచుకొనుమోహము మొనసి యొక్కొక్కవేళ
పొంచి ముందువెనకల మంచుఁగాదు
యెంచఁగ శ్రీవేంకటేశ యిందరికి దిక్కు నీవే
నించితి నీకృప అది నీ కద్దముగాదు ॥ఏమి॥

రేకు 64 సంఖ్య 865 సంపు 21 పుట 245

సీ. ఏమిసేయుదు నింక నెటు నిన్నుఁ దలఁచెద
నీమాయ కాఁబోలు నీరజాక్ష !
ఒక్కొక్కతఱి గుణం బుఱక మానవులకు
మఱపు తెలివిసేయు మరులుగాదు,
ఊహింపఁ జిత్త మొక్కొకవేళ గుఱి గడ
వంగఁ బర్వెత్తు నశ్వంబుగాదు:
ఒక్కొక్కసమయమం దొరులపై మత్సరం
బావహించెడిని దయ్యంబుగాదు;
దీపనం బడఁగు బత్తెమున నొక్కొకవేళ
చూడంగ నప్పులవాఁడు గాఁడు;
ఆ. ముంచు మోహ మిట్టు మొనసి యొక్కొకవేళ
పొంచి ముందువెన్క-ఁ ముంచుగాదు:
ఎంత నీదుకరుణ లేది యడముగాదు;
దిక్కు నీవె మాకుఁ దిరుమలేశ !

సాళంగనాట

ఎక్కడి పురాకృతము యేమి సేసిని
యెక్కడా బలువు నీబం ట్లెట్టుండినాఁ జెల్లును ॥పల్లవి॥
 నీవల్లఁ బుట్టెను బ్రహ్మ నీవు సేసినదే మాయ
 భావించి నీకుక్షిలోనే బ్రహ్మాండాలూ
 కావింప నీ వేలికవు కమ్మనినట్టేఁ బనులు
 దైవమా యిది యెఱిఁగి నీ దాసుఁడ నే నైతిని ॥ఎక్కడి॥
భూమి నీదేవులు నీవు పుట్టించిన దమృతము
శ్రీమంతుఁడ విన్నిటా నీసేసిన ట్టవును
యేమిటివాఁడు యముఁడు యెక్కడి మృత్యువు మరి
సామజవరద నీ శరణుచొచ్చితిని ॥ఎక్కడి॥
 ఏడఁజూచినా నీ దాసు లెక్కడాఁ జెడుట లేదు
 యీడులేదు శ్రీవేంకటేశ నీకును
 యేడవిధి యేడస్వర్గ మెక్కడిది నరకము
 జాడతో నీముద్ర నా భుజముల ధరించితి ॥ఎక్కడి॥

రేకు 1 సంఖ్య 7 సంపు 21 పుట 5

సీ. నీవల్ల బ్రహ్మ జనించె; నీ కుక్షిలోఁ
 గల వజాండములు; నీ కల్పితంబు
మాయ, నీ చెప్పినమాడ్కి జరుగు; లోక
 పతి వీవె కాన సేవకుఁడ నైతి;
భూమి నీ దేవేరి; పుట్టించినది సుధ;
 శ్రీమంతుఁడవు నీకుఁ జెల్లు నన్ని;
ఎక్కడి మిత్తి? తా నేటివాఁడు యముండు?
 శరణుఁ జొచ్చితి కరివరద! నిన్నె;
గీ. కీడు లేదు నీ దాసుల కేడఁగనిన
 ఈడు లేదు నీ కెందు; నింకేడ స్వర్గ
 నరకములు? విధి యేడ? విన్నాణ మొప్ప
 నాదుభుజములఁ దాల్చితి నీదుముద్ర.

నాట

వేవేలు విన్నపాలేల వేగినంతాను
నీవి దయాధర్మములు నీచిత్త మిఁకను ॥పల్లవి॥

అరసి చూడక నే శతాపరాధములు చేసి
శరణు నీకుఁ జొచ్చితి సర్వేశ్వరా
సరి శరణాగతరక్షకబిరు దది నీది
నిరతి నాభాగ్యము నీచిత్త మిఁకను ॥వేవేలు॥

అహరహమును సహస్రాపరాధములు చేసి
వహికెక్కి నీ లెంకవాఁడ నైతిని
బహుగతి భక్తపరిపాలన బిరుదు నీది
నిహితపు నాగతి నీ చిత్త మిఁకను ॥వేవేలు॥

సన్నిధి శ్రీవేంకటేశ సర్వాపరాధముల్ చేసి
అన్నిటికి శలవు నీయచ్చు మోచితి
వున్నతి నార్తత్రాణవుద్యోగబిరుదు నీది
నిన్ను నన్ను విచారించు నీచిత్త మిఁకను ॥వేవేలు॥

రేకు 17 సంఖ్య 96 సంపు 21 పుట 64

సీ. అనవరతమ్ము శతాపరాధమ్ములు
చేసి నీ శరణుఁ జొచ్చితిని దేవ!
శరణాగతత్రాణబిరుదమ్ము నీయది
నాదుభాగ్య మ్మింక నీదుచిత్త;
మహరహమ్మును సహస్రాపరాధమ్ముల
వహి కెక్కి నీ లెంకవాఁడ నైతి
భక్తపాలనకళాపారంగతుఁడ వీవు
నీదుచిత్త మ్మింక నాదునియతి;
గీ. స్వామి! సర్వాపరాధముల్ సలిపి సలిపి
యన్నిటికిని సెలవుగ నీయచ్చు దాల్చి
నాఁడ వేఁడ నెందాక విన్నపము లేల?
ఆర్తరక్షణశక్తి నీయదిగదయ్య

సా రం గ నా ట

ఏలినవాఁడవు గన యెప్పుడు రక్షించేవే
వేళతోఁ గొలువని వెల్లా వెసనోర్చుకొనవే ॥పల్లవి॥

అంత నూరకే ముదిసి యపచారమౌనో యని
దండములెట్టనోపక దగ్గరి రాను
చండిపోరి ముదిమి మాన్పఁగవలెనని కాదు
దండమువెట్టని నా తప్పు సహించుకోవే ॥ఏలిన॥

నిలుచుండ సత్వలేక నేరమి వచ్చునో యని
కొలువుసేయక మఱఁగున నుండిని
చలపట్టి నిన్ను నిట్టి సత్వ యిమ్మని కాదు
కొలువని నేరమి కెగ్గులుగాఁ బట్టకువే ॥ఏలిన॥

పాటరంజకములేక పక్కన నవ్వేవో యని
మాటలనే పొగడితి మాపటిదాఁకా
నీటున శ్రీవేంకటేశ నే వేసరించుట గాదు
పాడించి పాడని నా యపరాధ మెంచకువే ॥ఏలిన॥

రేకు 56 సంఖ్య 320 సంపు 11 పుట 215

1. ఊరక ముదియుట ఘోరాపచారమౌ
నని మ్రొక్కనోపక నినుఁ గదియను;
చండిపోరి ముదిమి సమయింపుమని వేఁడ
దండము పెట్టని తప్పు సైఁపు;
నిలుచుండ లివలేక నేరము వచ్చునో
యని కొల్వు సేయక మఱఁగి యుంటి;
సత్తువ నిమ్మని చలపట్టి నిను వేఁడ
కొలువనేరమి కెగ్గు దలఁప వలదు;

8. పక్కుమని నవ్వెదవు పాటఁ బాడ ననుచు,
మాటలనె నిన్నుఁ బొగడితి మాపుదాఁక;
వేసరించుటగాదు శ్రీవేంకటేశ!
పాటఁబాడని నా తప్పు పాటిగొనకు.

టౌ ?

నన్ను నేనే ఆహహా నవ్వుకొనవలదా
యిన్ని వెలుతుల నేను యెదురి నాడేదట ॥పల్లవి॥

చేరి దిగంబరి యట చీరలదిండ్లటా
సారెను విరతి యట సంసార మటా
పేరు మౌనవ్రితియట బిరుదువాదము లటా
యీ రీతి నే దొరనట యింపరి వేఁడేదటా ॥నన్ను॥

చప్పిదయ్యఁగా రట వుప్పు పెరికలు నట
గొప్పయిన తపసి నట కొలువూ నట
అప్పటి నిరాహారి నట ఆరంభము లట
చిప్పిలి మనసు ముడిసింగారా లట ॥నన్ను॥

పెంపు జితేంద్రియుఁ డట పెండ్లిశోభన మట
ముంపున మోక్షార్థి యట లంపట మట
యింపుల శ్రీవేంకటేశ యిన్నిభావములఁ బొంది
తెంపున నీ శరణని తెలిసితి నటా ॥నన్ను॥

రేకు 12 సంఖ్య 72 సంపు 21 పుట 49

సీ. నను నేనె వహ్వారె! నవ్వుకొనవలదా ?
యెదిరి నాడెద వెల్తు లెన్నొ యున్న
చెప్ప దిగంబరిఁ; జీరల దిండ్లంట
సారెకు విరతి, సంసార మంట
పేరు మౌనవ్రితి, బిరుదవాదము లంట
దొరనంట యిందటఁ డిరియుదు నఁట
చప్పఁడయ్యఁట మఱి యుప్పు పెటిక లంట
గొప్పతాపసి నంట కొలువు నంట
అటు నిరాహారి, మహారంభములు నంట
వారక ముదులసింగార మంట

గీ. అరయ లంపటు మంట మోక్షార్థి నంట
పెండ్లిశోభన మఁట జితవిషయి నంట
యిన్ని భావమ్ములం బొంది వృషగిరీశ!
తెంపునన్ నీకు శరణని తెలిసితి నఁట!

౨౬౪

ఎందలివాఁడనో యెఱుఁగను
కందువ నీవే కావవే దేవ ॥పల్లవి॥

తలఁతు నూరకే దైవము నొకపరి
తలఁతును సంసారధర్మము నొకపరి
వెలయఁగ సాలీఁడు వేసిన కండెయై
పొలసీఁ గాలము పొద్దుకుఁ బొద్దు ॥ఎంగలి॥

ఒకపరి యెక్కుదు పుబ్బునఁ బొడవునకు
వొకపరి దిగుదును వూరకే కిందికి
యెకదిగఁగ కృషికుఁ డెత్తు యేఁతమై
అకటా కర్మము లాడించీని ॥ఎందలి॥

ఆవల నన్నిట నహంకరించితి
శ్రీవేంకటేశ్వర సేవించితి నిన్ను
చేవలేక యిటు చెఱకునఁ బంటై
భావం బిటువలె పరగెను నేఁడు ॥ఎందలి॥

రేకు 12 సంఖ్య 68 సంపు 21 పుట 42

సీ. తలఁతు నూరకె దైవతము నొక్కతఱి; నొక్క
మాఱు సంసారధర్మము దలంతు
వెలయంగ సాలీఁడు వేసిన కండెయై
ప్రొద్దుకుఁ బ్రొద్దుగాఁ బొలిసెఁ గాల;
మొకపరి నెక్కుదు నుబ్బునఁ బొడవున
కొకపరి క్రింది కూరకయె దిగుదు;
నెక్కంగ దిగఁగ రైతెత్తిన యేతమై
యాడించెఁ గర్మమ్ము లకట! నన్ను

గీ. ఎఱుఁగ నెందలివాఁడనో వృషగిరీశ!
అన్నిటు నహంకరించితి; నవల నిన్నుఁ
జిత్తమార సేవించితిఁ; జెఱకునందుఁ
బండగుచు భావ మిటువలెఁ బరఁగె నేఁడు.

కీర్తనం

ఎంతపుణ్యమో నీకు హీనుని రక్షించితివి
యింత సేసితివి భాగ్య మేమి చెప్పే నింకను ॥పల్లవి॥

సరుగ నానోర నీవు సంకీర్తన విన్నపుడే
అరసి మోక్షమిత్తు వని నే నమ్మితి
పరులబంటుగాఁ జేయక యప్పటి నన్నేలినపుడే
నరకమందుఁ బెట్టవు నమ్మితి నేను ॥ఎంత॥

కిమ్ముల నీక విన నీ కీర్తి గట్టినపుడె
నెమ్మి రక్షింతు వనుచు నే నమ్మితి
పమ్మి నా మదిలో నీ రూపము చూపినపుడే
క్రమ్మరఁ బుట్ట నను గక్కన నే నమ్మితి ॥ఎంత॥

యిట్టె యోగక్షేమము వహించుకొని యున్నపుడె
నెట్టుకొనె నీ కృపని నే నమ్మితి
గట్టి శ్రీవేంకటేశ లోకదృష్టాంత మైనప్పుడే
వొట్టి సకలకర్మము లూడెనని నమ్మితి ॥ఎంత॥

రేకు 55 సంఖ్య 315 సంపు 21 పుట 212

సీ. నానోర సంకీర్తనలు విన్నపుడె నీవు
నా కిత్తువని ముక్తి నమ్మినాఁడ
పరులబంటుగ నిలుపక యేలినప్పుడె
నరకమ్ము లేదని నమ్మినాఁడ
నెట్టన నీ కీర్తి గట్టినయప్పుడే
నెమ్మిఁ బోషింతు వటంచు నమ్మినాఁడ
మదిలోన నీ రూపు మరల చూపినప్పుడే
నాకు లేదని పుట్టు నమ్మినాఁడ

గీ. యోగమున్ క్షేమము వహించి యున్న యపుడె
క్రమ్మికొనె నీదుకృప యంచు నమ్మినాఁడ
అచ్యుతా! లోకదృష్టాంతమైన యపుడె
నాదుకర్మముల్ విడెనంచు నమ్మినాఁడ.

దేశాక్షి

వేదమూర్తి నీ నిహ్వాస మట విమలనారసింహా
నాదప్రియ సకలలోకపతి నమో నమో నరసింహా ॥పల్లవి॥

ఘోరపాతకనిర్హరణా కుటిలదైత్యదమనా
నారాయణ రమాధినాయక నగధర నరసింహా
నీ రూపం బింత యంత యని నిజము దెలియరాదు
యీ రీతిఁ ద్రివిక్రమాకృతి నేదితి నరసింహా ॥వేద॥

గోవిందా గుణగుణరహితా కోటిసూర్యతేజా
శ్రీవల్లభ పురాణపురుషా శితనఖ నరసింహా
దేవ మిము బ్రహ్మాదులకును తెలియ నలవిగాదు
భావించఁగ బ్రహ్లాదునెదుటఁ బరగితి నరసింహా ॥వేద॥

దాసపరికరసులభ తపనచంద్రనేత్రా
వాసవసురముఖమునిసేవిత వందిత నరసింహా
భాసురముగ శ్రీవేంకటగిరిఁ బాయనిదైవమ పటుగానా
వోసర కిపు డేగితి విట్ల నహోబల నరసింహా ॥వేద॥

రేకు 28 సంఖ్య 181 సంపు 21 పుట 87

సీ. ఘోరపాపహరణ ! కుటిలదైత్యదమన !
నారాయణ ! రమేశ ! నారసింహ !
నీ రూప మింతని నేరరాదు త్రివిక్ర
మాకృతిఁ బొలిచితి వాదిపురుష !
గోవింద ! శితనఖ ! కోటిభాస్కరతేజ !
నగధర ! లోకేశ ! నారసింహ !
బ్రహ్మాదులకు నిన్నుఁ బట్ట శక్యముగాదు
ప్రహ్లాదు నెదుటఁ జూపట్టితీవు
ఆ. దాససులభ ! సోమతపననేత్ర ! మునీంద్ర
వాసవాదిదేవవంద్య ! నృహరి !
భాసురము వృషాద్రిఁబాయని దైవమా !
నాథలోల ! వంద్యనఖముల దేవ !

బౌళి

కాదని తోయఁగ నెంతటివారలు ఘనసంసారులు నరులును సురలును
నీ దాసులతో సంగతిసేయఁగ నిర్మలచిత్తం బయ్యీఁగాక ॥పల్లవి॥

హరి నీ మాయ విజృంభించు నట నడఁచే మన నెవ్వరితరము
దరిగాని నీకె మొక్కఁగ తానే మన్నించీఁగాక
నిరతి నీ యాజ్ఞ జగతిఁ జెల్లునట నెట్టన నిది గడచేవా రెవ్వరు
ధరణిలో నీ వారమని యాముకొనఁగ తప్పులుపట్టక కాచీఁగాకా ॥కాదని॥

ధాత నీ సుతుఁడు పుట్టించువాఁడట తగదని తోయగ నెవ్వఁడోపునిఁక
అతుమలో నిను ధ్యానముసేయఁగ నతఁడే మొగమోడీఁగాక
ఘాతల మదనుఁడు మదమురేఁచునట కాదని గెలువఁగఁ గలరా యెవ్వరు
రాతిరిఁ బగలును నిన్నె జపించఁగ రతిఁ గైవస మయ్యీఁగాక ॥కాదని॥

నీ కల్పిత మగు కర్మ మంటునట నెటి విడిపించఁగ సమర్థు లెవ్వరు
చేకొని నీవేగతి యని యుండఁగ చిక్కులఁబెట్టక చనుఁగాక
యీ కడ శ్రీవేంకటేశ్వర నీవే యెందుఁ జూచినా నంతరాత్మ పట
పైకొని నిన్నే నమ్మివుండఁగాఁ బ్రిసన్నుఁడవు నీవయ్యేవుగాక ॥కాదని॥

రేకు 47 సంఖ్య 267 సంపు 21 పుట 181

సీ. అడరెడు నీమాయ నణఁపంగ శక్యమే
నీకు మ్రొక్కంగ మన్నించుఁగాక!
అంతటఁజెలు నీ యాజ్ఞదాఁటు వశంబె?
నీ వాఁడ నవఁ గరుణించుఁగాక!
ధాతసృష్టిఁ జెఱుపఁ దరమె? నిన్ ధ్యానించ
వాఁడె తప్పక మొగమోడుఁగాక!
కాముని గెలువంగఁ గలవా రెవరు? నిన్ను
బడి జపియింప లోఁబడునుగాక!

గీ. కర్మ ముడుపంగఁగా; దీవె గతి యటంచు
నుండఁ జిక్కులఁబెట్టక యుండుఁగాక!
అఖిలజీవాంతరాత్మ ని న్నహివగేశ
నేదను నమ్మఁ బ్రసన్నుఁ డయ్యెదవుగాక!

### శంకరాభరణం

చూడ నొక్కఁడవుగాని సుద్దు లెన్నైనాఁ గలవు
వేడుకలు దైవారె వెలఁదు లిందరికి ॥పల్లవి॥

వొక్కని రూపమే కాదా వూరివారెల్లాఁ జూచితే
పెక్కులై మనసులోఁ బెనగొనేది
వుక్కున నీ వాడిన మాటొక్కటి కాదా యిందరి
వెక్కసపు వీనులలో వింతవింత లైనది ॥చూడ॥

చేసిన నీ సన్నే కాదా చెలులమర్మములకు
నాసకొలుపుచు మోహ మంటించినది
పోసరించి నీ మోవితీపులే కావా గొల్లెతల
వాసుల నోరు యూరించి వలలఁ బెట్టినవి ॥చూడ॥

సెలవి నవ్వే కాదా చిమ్మిరేచి యింతులకు
పులకలు మేనులఁ బొదమించేది
వెలయ నన్నేలితి శ్రీవేంకటేశ యిదె కాదా
కలయిక లిందరికి కాంక్షలు రేచినవి ॥చూడ॥

రేకు 56 సంఖ్య 321 సంపు 21 పుట 216

సీ. నీ రూపమే గదా యూరివారలు చూడ
పెక్కులై మనసులోఁ బెనఁగొనినది
నీ మాటయే గదా నెలకొని యిందఱి
వీనులలో వింత వింతయినది
నీ సన్నయే గదా నెలఁతల మర్మాల
కంటించినది మోహ మాసగొలిపి
నీ మోవితీపెగా వేమారు రుచిగొల్పి
వలలఁబెట్టినది వ్రేపల్లెసకుల
గీ. సెలవినవ్వు నీ నగవెకా చెలులమేన
పొడమగాఁ జేసినది సౌందర్యపులకపటలి
చూడ నొక్కఁడవే గాని సుద్దు లెన్నొ
కలవు నిన్నుఁగూర్చి తెలుప వేంకటనగేంద్ర!

మాళవిగౌళ

భావింప నీ వొక్కఁడవే బహురూపాల నుండుదువు
దేవదేవ నీ మహిమ దెలియఁగ వశమా ॥పల్లవి॥

నిన్నుఁ దలఁచేవారిలో నిజరూపుతో నుండుదువు
అన్ని జంతువులలోన నంతరాత్మవై వుండుదువు
పన్ని పంచభూతములలోపల నాధారమై వుండుదువు
వున్న మూఢులలో మాయ నొనగూడి వుండుదువు ॥భావింప॥

సరుస తరువులలో చైతన్యమవై వుండుదువు
గరిమె రాక్షసులలోన కానరాక వుండుదువు
సురలందు యీశ్వరసూచనతో నుండుదువు
అరయ ముక్తులలోన ఆనందమవై వుండుదువు ॥భావింప॥

జగము లన్నిటిలోన సాక్షివై వుండుదువు
తగిలి వేదములలోన అర్థమై వుండుదు
జిగిమించ సర్వదాను శ్రీవేంకటగిరి నుండుదు
సగుణమై దాసులకు సాకారమవై వుండుదువు ॥భావింప॥

రేకు 60 సంఖ్య 846 సంపు 21 పుట 282

సీ. భావింప నొకఁడవే బహురూపముల నుందు
దేవ ! నీ మహిమమ్ము దెలియ వశమె?
నిన్నెంచువారిలో నిజరూపమున నుందు;
వంతరాత్మగ నుందు జంతుకోటి;
పంచభూతములలోపల నుందు వాధార
మై; మాయతో నుందు మందులందు:
తరువులలోనఁ జైతన్యమై యుందు; రా
క్షసులందు నుందువు గానరాక;
సురలందు నీశ్వరసూచనతో నుందు;
వానందమై ముక్తులందు నుందు;
గీ. సాక్షిమాత్రుండవై యుందు జగములందు;
నర్థమైయుందు వేదమ్ములందు; శేష
శైలమందు సాకారమై సగుణ మగుచు
నుందు శ్రితసులభుండవై యిందిరేశ!

నాట

చెల్లునయ్యా యీ మాట మాకు శ్రీహరి
యెల్లవారికి నిది విన నింపౌఁ గాదో ॥పల్లవి॥
చేచేత నిన్ను ధ్యానము సేయుకంటెఁ బెద్దలెల్లా
యేచి నీ గుణానుభవమే యెక్కు డందురు
పూచినశాఖలతోడఁ బొదలు వృక్షముకంటెను
కాచిపండినఫలము ఘనమౌఁ గాదో ॥చెలు॥
యిన్నిటాను నీ కంటేను యెంచిచూచి పెద్దలెల్లా
చెన్నుగా నీ దాసులే విశేష మందురు
మిన్నక వనములలో మెఱయుఁ గోవిలకంటెను
వున్నతంబైన నాద మొప్పిదమౌఁ గాదో ॥చెలు॥
మనసార నీనామముతోడి మంత్రముకంటెఁ బెద్దలెల్లా
మునుప నాచార్యుఁడే ముఖ్య మందురు
వొనరి శ్రీవేంకటేశ వుర్వి నిక్షేపముకంటె
కనిపించే యంజనమే వెగ్గలమౌఁ గాదో ॥చెల్లు॥

రేకు 60 సంఖ్య 341 సంపు 21 పుట 229

సీ. నిన్ను ధ్యానించుటకన్న నెందటొ పెద్ద
లధికమందురు భవద్గుణానుభవము
పూచినశాఖలఁ బొదలు వృక్షముకంటె
కాచిపండినపండు ఘనముగాదొ ?
ఇన్నిట నీకంటె నెంచిచూచిన పెద్ద
లిలను నీ దాసులే యెక్కు డందురు
మిన్నక వనములో మెఱయు కోయిలకంటె
దానినాదం బొప్పిదమ్ము గాదొ ?
గీ. విమలనామమ్ముతోడి మంత్రమునకంటె
మొదల నాచార్యుఁడే కడు ముఖ్యమందు;
రుర్వి నిక్షేపమునకంటె నురగశయన !
కనఁగఁజేయునంజనము వెగ్గలము గాదొ !

# శ్రీనివాసశేజుషు

బౌళి

తపముల బడలఁగ తమకేల మునులకు
నెపమిదె సాధించ నియ్యేడకు నింకను ॥పల్లవి॥

అడుకులుఁ వెట్టి నీచే నందెను సిరు లొకఁడు
కడుగంపఁ గమ్మి దాఁచి కైవల్య మందె నొకఁడు
కుడువఁ గూడుఁదెచ్చి కొందరు నీ వారైరి
వడి నిట్టే యఱికించవచ్చుఁబో నిన్నింకను ॥తప॥

నీ తల పువ్వులుచుట్టి నిత్యుఁడాయె నొకఁడు
కాతరాన గంధమిచ్చి కలసె నిన్నొకతె
చేత బలుసాకువెట్టి సిరులు గనె నొకఁడు
యీతల నిన్ను చెల్లించే దేమి దొడ్డ యింకను ॥తప॥

మందగోపికలకడ మాటాడి మించె నొకఁడు
కందువ నీకు దాసుఁడై కరుణఁబొందె నొకఁడు
యిందరు వరము లంది రిదె శ్రీవేంకటేశుఁడ
సందడి నిన్ను సేవించే సరవిదె యింకను ॥తప॥

రేకు 19 సంఖ్య 108 సంపు 21 పుట 72

సీ. అడుకులు చేనిడి యందె సిరు లొకండు
కైవల్య మొకఁడొందె గంప గమ్మి
కూడు కుడువదెచ్చి కొందఱు నీవార
లైరి నిన్ లోఁగొన నగు నెట్లైన
నీ తల పూలిడి నిత్యుఁ డాయె నొకండు
గంద మొక్కతె యిచ్చి కలసె నిన్ను
బలుసాకు తినఁబెట్టి పడసె రాజ్య మొకండు
స్వామి! నిన్మెప్పించు టేమిదొడ్డ ?

గీ. గొల్లెతలకడ మాటాడి కొరలె నొకఁడు
దాసుఁడై నీకృపం గాంచి తనరె నొక్కఁ
డెంద ఱెందఱొ వరములు పొందినారు
జగతిలో నిన్ను సేవించు సరణి యిదియె.

## శ్రీ ని ఖా వ తే జ ము

### షాడి

రామచంద్రా రామభద్రా రఘువీరా
నీ మహిమ దెలిసేరా నేఁటివారు ॥పల్లవి॥

అరయ జటాయువున కట్టె మోక్ష మిచ్చితివి
హరునివిల్లు విరిచి అలరితివి
యిరవై రాతికిఁ బ్రాణ మిచ్చితి వింతటి నిన్ను
నరుఁ డంటా నుండిరిగా నాఁటివారు ॥రామ॥

నెమ్మది సరయువులో నించితి వైకుంఠము
పమ్మి మారుతికి బ్రహ్మపట్ట మిచ్చితి
దుమ్ములుగ రాక్షసులఁ దుత్తుమురు సేసితివి
నమ్మిరిగా రాజవంటా నాఁటివారు ॥రామ॥

యెందునుఁ జెడని పట్ట మిచ్చితి విభీషణుని
కంది పరశురాముని నంగవించితి
యిందునే శ్రీవేంకటేశ యెఱుఁగక దశరథ
నందనుఁడే యనిరిగా నాఁటివారు ॥రామ॥

రేకు 4 సంఖ్య 28 సంపు 21 పుట 16

సీ. శిలకు ప్రాణం బిడి చెలువ గావించితి
హరుని విల్లువిఱచి యలరినావు
పక్షి కిచ్చితివి కైవల్య, మింతటి నిన్ను
నరుఁడని తలఁచిరి నాటివారు
సాక్షాద్వైకుంఠమ్ము సరయూనదిన్ నించి;
తజుపట్టు మొసఁగితి వనిలజునకు;
అసురులఁ ద్రుంచితి; వంతటి నిన్నిఁక
నమ్మిరి రాజుగా నాటివారు

గీ. లంక కభిషిక్తుఁ జేసితి లెంక; పరశు
రాము తృళ్ళడగించితి రామచంద్ర!
నిక్క మెఱుఁగక దేవుని నిను దశరథ
నందనుం డనినారలు నాఁటివారు.

# శ్రీ నివా స తే జ ము

## లలిత

ఎంతటివాఁడవు నిన్ను నేమని నుతింతును
చింతలు నీ కమరకుండఁగా విచారించే నేను ॥పల్లవి॥

పాలసముద్రములోనఁ బవళించివుండే నీకు
బాలుఁడ వై తేనే వెన్న బాఁతాయెనా
కాల మెల్లను శ్రీకాంతకౌఁగిటనుండే నీకు
గోలవైతే గొల్లెతలఁగూడ వేడుకాయెనా ॥ఎంతటి॥

పరమపదమునందు బ్రహ్మమై వుండే నీకు
పెరిగి రేపల్లెనాడఁ బ్రియమాయెనా
సురల నెల్లాఁ గావ సులభుఁడవైన నీకు
గరిమెతోఁడఁ బసులఁగావ వేడుకాయెనా ॥ఎంతటి॥

యేపొద్దు నిత్యముక్తుల నెనసివుండే నీకు
గోపాలులతోఁ గూడుండఁ గోరి కాయెనా
బాపురే యలమేల్మంగపతి శ్రీవేంకటేశ్వర
యేపొద్దు నిట్టి లీలలె యితవాయెనా ॥ఎంతటి॥

రేకు 72 సంఖ్య 412 సంపు 21 పుట 277

సీ. పాలసంద్రములోనఁ బవళించు నీ కంత
బ్రాఁతియాయెనె వెన్న పరఁజుకొనఁగ ?
కాల మెల్లను సిరికౌఁగిటనుండు నీ
కితవాయెనేమి గొల్లెతలపొందు ?
పరమపదమునందు బ్రహ్మంబ వగు నీకు
కోర్కెగల్గెనె యాడ గొల్లవాడ ?
సురల నందఱఁగావ సులభుండ వగు నీకు
వాంఛ జనించెనా పసులఁ గావ ?

గీ. నిత్యముక్తులు సేవింప నెగడు నీకు
వేడుకాయెనె వ్రేలతోఁ గూడిమాడ ?
నేమని నుతింతు స్వామి ! నీ వెంతవాఁడ
విట్టి లీలలె యెపుడు నీ కిష్టమాయె.

సాళంగనాట

కాలమందే నీ దాసులై కడు ధీర లౌట గాక
యీ లాగున మోసపోతి నేమిటా నే మున్నది ॥పల్లవి॥

పొనిఁగి యింద్రునినైనాఁ బొరీదు కోపము
మునుకొని రుద్రునైనా ముంచుఁ గోపము
వెనుకొని బ్రహ్మనైనా విడువదు కోపము
మనికియైన దేవత్వమహిమ యే మున్నది ॥కాల॥

వడి విశ్వామిత్రునంతవానికి రేఁగెఁ గోపము
కెడపి దుర్వాసునిఁ జిక్కించెఁ గోపము
యెడనెడ మునులను యేమరించుఁ గోపము
బడిఁ దపసులబల్మి పలుక నేమున్నది ॥కాల॥

కచ్చుపెట్టి ధర్మజునిఁ గనలించెఁ గోపము
కొచ్చి కార్తవీర్యుఁ బురికొల్పెఁ గోపము
నిచ్చలు శ్రీవేంకటేశ నీవే శాంత మిచ్చితిగా
కిచ్చల రాజ్యపదవి యెంచ నేమున్నది ॥కాల॥

రేకు 58 సంఖ్య 304 సంపు 21 పుట 205

సీ. మొనసి యింద్రునయినఁ బోనీదు కోపమ్ము
పొంచి రుద్రునిగూడ ముంచుఁ గినుక
వెనుకొని యజునేని విడువదు కోపమ్ము
తెలుప నేమున్నది దేవమహిమ ?
అంతటిగాధేయు నలమెను కోపమ్ము
కెరలి దుర్వాసుఁ జిక్కించెఁ గినుక
ఏమరించును గోప మెడనెడ మౌనులఁ
బలుక నేముండెఁ దాపసుల బలిమి ?

గీ. కార్తవీర్యునిఁ బురికొల్పెఁ గడఁగి ధర్మ
రాజుఁ గనలించెఁ గోపమ్ము రాజ్యపదవి
నెంచ నేమున్నది ? వృషాచలేంద్ర ! శాంత
మీయవలె నీవె యెఖిలు నేలిగలడు !

శుద్ధవసంతం

చెల్లుబడి కల్లలట చేఁత లివి పీవియట
ఒల్లిదుఁడ హరి మమ్ము భ్రమదెలుప వయ్యా ॥పల్లవి॥
వొకసస్యమునఁ బంట వొకకోటి కొండ లట
వొకపశువునందు పా ల్వారేదట
అకట కొందరవి అంతలో చవిగొనిన
సకలంబు దీరునట సటకు నిజమేది ॥చెల్లు॥
అన్నంబు గొనెడిదట యెప్పటినాఁకలియట
తిన్నవై కొంతదడవు తృప్తినటా
కన్నులనే నిద్రలట కదఁగి మేల్కనుటయట
యున్నిటింతులజగము యెట్ల నమ్మేదది ॥చెల్లు॥
కాయమట ప్రియమట కాంతలట పురుషులట
రాయిడింపులె మతికి రతిసుఖమటా
యే యెడల శ్రీవేంకటేశ నీమాయ లివి
పాయునట నీదాసపరికరములకును ॥చెల్లు॥

రేకు 88 సంఖ్య 188 సంపు 21 పుట 125

సీ. ఒకసస్యమునఁ బంట యొకకోటిగిరు లంట
యొకపశువున క్షీర మదధు లంట
అకటకటా! కొంద అవియంత చవిగొన్న
చల్లఁగ నవియెల్లఁ జెల్లునంట;
అన్నంబు గొనునంత అప్పటాఁకలియంట
తినఁగఁ గొంతతడవు తృప్తియంట
కనులనే నిదురంట కదఁగి మేల్కొనుటంట
కల్లజగము నమ్మఁగలుగు టెట్లు?
గీ. కాయమంట ప్రాయమంట నరులకాంతలంట
రాయిడింపులె మతికి రతిసుఖ మంట
యేయెడల వేంకటేశ! నీ మాయలివ్వి
పాయునంట భవద్దాసపరికరమునకు

కుంతలవరాళి

మానరాదు నీ కింక మముఁ గావవలెను
పేనిపట్టి నీకు నీవే బిరుదులై వున్నవి ॥పల్లవి॥

సరవి నిన్ను భక్తరక్షకుఁ డని నారదుఁడు
పరువడి లోకములఁ బాడిపాడి చాటినాఁడు
సరగ నీ యర్థములకు శాసనాలై వేదములు
మొరయుచు బ్రహ్మనాల్గుమొగముల నున్నవి ॥మాన॥

శరణాగతవజ్రపంజరుఁ డని వాల్మీకి
సురలకు రామకథ చూపి చెప్పె గుఱిగాను
పొరి నీ సుద్దు లివే పురాణపత్రికలై
పెరుగుచు వ్యాసుల పెట్టెలలో నున్నవి ॥మాన॥

తారకబ్రహ్మ మవని తగఁ గాశిలో శివుఁడు
రేరుపరచి ప్రాణుల కెప్పుడుఁ జెప్పుచున్నాఁడు
యీ రీతి శ్రీవేంకటేశ యిందుకు సాక్షులు నీ వరాలు
ఆరూఢి గరుడగంభ మందె నేఁ డున్నవి ॥మాన॥

రేకు 72 సంఖ్య 416 సంపు 21 పుట 280

సీ. నిను భక్తరక్షకుఁ డని నారదుఁడు సర్వ
జగములలోఁ బాడి చాటినాఁడు
శరణార్థివజ్రపంజరుఁ డని వాల్మీకి
శ్రీరామకథ చూపి చెప్పినాఁడు
ఎనలేని నీ సుద్దు లివె పురాణమ్ములై
పెరుగుచున్నవి వ్యాసుపెట్టెలందు
తారకబ్రహ్మంబు తగ నీవెయని కాశి
నొడువు చున్నాఁడు ప్రాణులకు శివుఁడు
గీ. సరగ నీ యర్థములకు శాసనము లగుచు
మొరయుచున్నవి శ్రుతు లజ్ఞమోములందు
నిందులకు సాక్షు లగుచు నీ విడువరాలు
గరుడకంబమునందనే కలవు నేఁడు

శుద్ధవసంతం

మఱఁది యనుచు ధర్మజుఁడు భీమసునట
యెఱుకతోడి వివేక మెవ్వరియందు దున్నది ॥పల్లవి॥

గరుడవాహన మెక్కి ఘనబాణుని నరికి
తిరిగినా నమ్మరైరి దేవుఁడ వని
నరకాసురునిఁ జంపి నాతులఁ బదారువేల
వెరసి పెండ్లాడినది వివేకించరైరి ॥మఱఁది॥

బలుశంఖచక్రములు పట్టి బాలకులఁ దెచ్చి
తెలిపినా నమ్మరైరి దేవుఁడ వని
సొలసి విశ్వరూపము చూపి అగ్రపూజగొని
కెలయ నీ మహిమలు వివేకించ రైరి ॥మఱఁది॥

పక్కన ద్రౌపదిఁ గాచి బ్రహ్మచే మొక్కించుకొని
దిక్కైనా నమ్మరైరి దేవుఁడ వని
దక్క శ్రీవేంకటేశ యిందరికి వరము లిచ్చి
వెక్కసమైతివి నాఁడు వివేకించ రైరి ॥మఱఁది॥

రేకు 3 సంఖ్య 18 సంపు 21 పుట 12

సీ. భీమ చెందునంటు మఱంది ధర్మసుతుండె
పరమవివేక మెవ్వరికిఁ గలదు ?
గరుడవాహనమెక్కి ఘనుని బాణునిఁ జెండి
తిరుగ నమ్మరయిరి దేవుఁడ వని;
నరకునిఁజంపి కాంతలఁ బదార్వేల వ
రించు టించుక వివేకించ రయిరి;
బలుశంఖచక్రముల్ పట్టి బాలురఁ దెచ్చి
తెలుప నమ్మరయిరి దేవుఁడ వని;
విశ్వరూపముఁ జూపి వేమహిమలు-ప్రద
ర్శించు టింతయు వివేకించ రయిరి;

గీ. బ్రహ్మచే మ్రొక్కులంది ద్రౌపదిని గాచి
దిక్కయిన నమ్మరయి రీవు దేవుఁడ వని;
ఇందఱికి వరమ్ముల నిచ్చి యందివేశ !
మించితివి నాఁడు నిను వివేకించ రయిరి.

రా మ క్రి య

కంబములో వెడలితివి కరివాఖ గాచితివి-
పంచి యిన్నిటా నీకిది పనియటే శ్రీపతి ॥పల్లవి॥

యెవ్వఁడూ మొఱవెట్టునో యిట్టె రక్షించే ననుచు
యెవ్వఁడూ నను( బేర్కొనునో యింతటాఁ బలికే ననుచు
యెవ్వఁడూ మదిఁ దలఁచునో యిక్కడఁ బొడచూపే ననుచు
వువ్విళ్లూరఁ గాచుకొని వుందువటే శ్రీహరి ॥కంబము॥

ఆపన్నుఁడు శరణంటే నడ్డము వచ్చే ననుచు
యేపొద్దు ధ్యానించువానికి యెదుటనుండే ననుచు
పైపైఁ బూజించేవానికి పాదములు చాఁచే ననుచు
వోపి యెప్పుడు గాచుకొని వుందువటే శ్రీహరి ॥కంబము॥

అడిగి పొగడేవానికి నప్పుడే నొసఁగే ననుచు
విడిముడి నీ దాసునికి చెప్పినట్టు సేసే ననుచు
బడినే శ్రీవేంకటేశ భక్తి సేసేవానికిని
వుడివోక గాచుకొని వుందువటే శ్రీహరి ॥కంబము॥

రేకు 68 సంఖ్య 359 సంపు 21 పుట 241

• ఎవ్వఁడు మొఱలిడ నిట్టె కాచెద, నన్నుఁ
బేర్కొనఁ బలికెదఁ బ్రీతి నంచు
నెడఁదఁ దలంచినఁ బొడసూపెద నటంచు
నువ్విళులూరుచు నుందు వటవె ?
ఆపత్తి శరణన్న నడ్డుపడెదఁ బూజ
సలుపువానికిఁ గాళ్లు చాతు నంచు
నడిగి పొగడువాని కపుడె యిచ్చెద నని
యోర్మి కాచుకొని నీ వుందు వటవె ?
గీ. చెప్పినట్లు సేవకునకుఁ జేసెద నని
వేచియుందు వఁటే ? కరిఁ బ్రోచి తుక్కు
కంబమునఁ బుట్టి భక్తునిఁ గరుణనేలి
తిది పనియఁటే ముకుంద ! నీ కెల్లవేళ.

## శ్రీ యశ్రీ ట

ఏల లోకులకుఁ జూపే వింద్రాదులఁ బితరుల
యీ లీల నిన్నుఁ బూజించే దెక్కడు గొల్లబోలును ॥పల్లవి॥

యిక్కువ గొల్లలుచేసే యింద్రయాగము మాన్పి
నిక్కి కొండకుఁజేయించి నీవే భుజించితివి
వెక్కసమై కిరీటిగావించే శివపూజ మాన్పి
గక్కన మోఁకాలఁ బూజ గావింపించుకొంటివి ॥ఏల॥

ముంచి మీఁదుగాఁ జేసిన మునుల యజ్ఞాన్నములు
కొంచక నీవు దెప్పించుకొంటి వా సతులచేత
పొంచి దూర్వాసడిగిన భోజనము లటు మాన్పి
అంచెఁ బాండవుల బలుసాకునాఁ దృప్తైతివి ॥ఏల॥

సారె గోపికలిండ్ల జన్నెవట్టినది మాన్పి
నేరుపుతోఁ బాలు వెన్న నీవే యారగించితివి
ధారుణిలో వేదోక్త ధర్మము నీవే నిలిపి
కారణ మింతకు శ్రీవేంకటేశ నీ వైతివి ॥ఏల॥

రేకు 60 సంఖ్య 342 సంపు 21 పుట 280

సీ. ఎలమి గొల్లలుసేయు నింద్రయాగము మాన్పి
కొండకుఁ జేయించి కుడిచి తీవె;
చెలఁగి క్రీడియొనర్చు శితికంఠుపూజ మా
న్పించి మోకాలఁ జేయించుకొంటి;
మునుల యజ్ఞాన్నముల్ ముందుగాఁ గొన వారి
వెలఁదులచేతఁ దెప్పించుకొంటి;
మౌనికి బోనముల్ మాన్పి కౌంతేయుల
బలుసాకుతోఁ దృప్తిపడితి వెంతొ;

గీ. వనిత లిండ్లలో జన్నె పట్టినది మాన్పి
యారగించితి వెన్నలు నావుపాలు;
నిన్నుఁ బూజింతు రొక్కకే నిగమధర్మ
మనుచు లోకులకుం జాటు ఫణినగేంద్ర!

తో ॥

పురుషోత్తమా అన్నిటిలో పూసలలో దారమవూ
వెర వెఱఁగి నిన్నెపొద్దును సేవించఁగవలెఁ గాని ॥పల్లవి॥

కదలును గాలి నీవు కదల్చించితే
పొదలును సస్యములు నీవు పొదలించితే
వెదకితే కీలు నీవే విశ్వంబునకు
పదిలముగా నిను వెదకి పట్టఁగవలెఁ గాని ॥పురు॥

కాలముఁ గర్మములో నీవు కానరాక వుండి
నేలయు మిన్నును నీవే పాలింపుచున్నాఁడవూ
నీ లీలలైన బొమ్మలాట లివి నీచేతనాడిని
కోలుముందుగా నీ సాకారము కోరి చూడవలెఁగాని ॥పురు॥

యిత్తువు వరములు నీవే యిటు శ్రీవేంకటగిరిని
మొత్తమై యలమేల్మంగతో మద మలరఁగాను
బత్తితో నినుఁ గొలిచినవారికి పరుసవేదివి నీవే
కొత్తలుగా నిన్నే నమ్మి కొలిచి బ్రిదుకవలెఁగాని ॥పురు॥

రేకు 67 సంఖ్య 385 సంపు 21 పుట 259

సీ. కదలింపఁగా నీవు కదలు వాయువు; నీవు
పొదలింపఁగా సస్యములును పొదలు
వెదకినచో నీవె విశ్వంబునకుఁ గీలు
పదిలమ్ముగాఁ బట్టవలయుఁ గాని
కాలగర్భములోఁ గనరాక నీవుండి
యేలుచున్నాఁడవు నేల మిన్ను
బొమ్మలఁబోలె జీవులనెల్ల నాడింతు
వటు నీదురూ పరయవలెఁ గాని

గీ. ఇత్తువు వరాలు వృషగిరిఁ జిత్త మలర
బత్తి నినుఁగొల్చువారికిఁ బరుస మీవు।
పొలుతు వన్నిటఁ బూసలఁ బోఁగుమాడ్కి
వై పెఱఁగి నిన్ను సేవింపవలయుఁ గాని.

నాట

ఎక్కడ దాఁగఁగ వచ్చు నింక నీకును
వెక్కస నీ దాసులెల్లా బ్రదికిరి యిఁకను ॥పల్లవి॥
పంతాన నెక్కడాఁ జిక్కుపడనియట్టివాఁడవు
చింతల నీ కథలలోఁ జిక్కుకొంటివి
యెంతైనా నీ మహిమల నెంచరానివాఁడవు
దొంతర సహస్రనామాదుల నెన్నికైతివి ॥ఎక్కడ॥
సరుగ నెవ్వరిచేత సాధింపరానివాఁడవు
వొరసి నీ భక్తిచే సాధ్యుండ వైతివి
సురలకు నీ గుఱుతు చూపరానివాఁడవు
బిరుదులచే గుఱుతు పెట్టించుకొంటివి ॥ఎక్కడ॥
వేదములచే నీ రూపు వెదకరానివాఁడవు
పోదితో శ్రీవేంకటాద్రిఁ బొడచూపేవు
యేదెస నీ వొక్కఁడవే యేలికైనవాఁడవు
మేదిని యలమేల్మంగ మెడఁగట్టుకొంటివి ॥ఎక్కడ॥

రేకు 68 సంఖ్య 839 సంపు 21 పుట 262

సీ. చిక్కుపడనివాఁడ వెక్కడ నీకథా
చింతనమ్ములలోనఁ జిక్కుకొంటి;
నరగ నెవ్వరికి నసాధ్యుండ వగునీవు
సాధ్యుండవైతి ప్రశస్తభక్తి;
సురలకేనియు గుర్తుదొరకవు మఱి గుర్తు
పెట్టించుకొంటివి బిరుదములను;
వేదాల నీరూపువెదకరానిది కాని
పొడసూపితివి శేషభూధరమున;
గీ. ఎన్నగారానిమహిమల కీవె కుదురు;
పన్నుగ సహస్రనామాల నెన్నికైతి;
వేలికవు నీ వొకండవే యెందు చూడఁ
గలవు మంగాంబికను మెడఁగట్టికొంటి.

నాట

వెదకితే నీ వంటివేల్పు లెవ్వ రున్నారు
అదన నీ దాసుఁడైన యతఁడే పుణ్యుఁ డయ్యా ॥పల్లవి॥
యేలేది పరమపద మీశ్వరుఁడ విందరికి
మేలిమి శ్రీభూమీసమేతుఁడవు
పాలింతువు లోకమెల్ల బ్రహ్మంతవాఁడు కొడుకు
వాలాయించి నిన్నుఁ గొల్చువాఁడే ధన్యుఁ డయ్యా ॥వెదకి॥
పండేది పాలజలధి పంపుసేసేది చక్రము
నిండువన్నెపైఁడికోక నీ మేనిది
వుండుదు పందరిలోన యోగమాయ నీ మహిమ
అండ నిన్ను నమ్మినవాఁ డన్నిటాఁ బూజ్యుఁ డయ్యా ॥వెదకి॥
సురలు నీ యాజ్ఞవారు సూర్యచంద్రులు కన్నులు
బిరుదుచెక్కులు చూపే వేదములు
పురమున నలమేల్మంగ యొప్పెను శ్రీవేంకటేశ
గరిమ నీ శరణన్నఘనుఁడే నేర్పరయ్యా ॥వెదకి॥

రేకు 59 సంఖ్య 388 సంపు 21 పుట 227

. వెదకిన నీవంటివేల్పు లెవ్వరు ? నీదు
దాసుఁడైన యతఁడె ధన్యుఁ డయ్యా !
ఏలునది వైకుంఠ; మీశుండ వందఱి
కిందిరాభూసతీసుందరుఁడవు;
పాలింతు జగమెల్ల; బ్రహ్మ నీ కొడుకు; ని
న్నర్చించువాఁడు పుణ్యాత్ముఁ డయ్యా !
చక్రమ్ము నీ పంపు సలుపు; నీ శయనమ్ము
వార్ధి; నీ మేనిది పైఁడికోక
ఉందు పందరిలోన; యోగమాయయె నీదు
మహిమ; నిన్నమ్మినవాఁడు మాన్యుఁ డయ్యా !
గీ. సురలు తలదాల్చి నీ యాజ్ఞ నెఱపువారు;
సూర్యచంద్రులు కన్నులు; శ్రుతులు నీదు
బిరుదుచెక్కములు; మఱఁగ కాఁపుర మురమ్ము;
నీ శరణుఁ జొచ్చినాతఁడె నిపుణుఁ డయ్యా !

# తాళ్ళపాక పెదతిరుమలాచార్యుల అధ్యాత్మసంకీర్తనల

## అకారాది సూచిక

పదకవితాపితామహుఁడు తాళ్లపాక అన్నమాచార్యుల మను
మఁడు, తాళ్లపాక పెదతిరుమలాచార్యుల కొమారుఁడు

అష్టభాషాచక్రవర్తి అయిన
తాళ్లపాక చినతిరుమలాచార్యులవారు శ్రీవేంకటనాథునకు
విన్నపము చేసిన

# అధ్యాత్మ సంకీర్తనలు.

[ క్రీ. శ. 1493 - 1553 ]

రామక్రియ

భవరోగవైద్యుఁడైన బలువెజ్జు
సవరని పైఁడిపక్షి సకినగాఁడు పల్లవి॥

తల్లిపద్ద నోరిలోన తగ లోకములు చూపి
వెల్లవిరి నింద్రజాలవిద్యవాఁడు
చెల్లుబడి నొక్కకొండ చేలఁబట్టి యెత్తినాఁడు
బల్లిముఁడు వాఁడివో బారివిద్యవాఁడు ॥భవ॥

మునుపె సకలభూతములకు నేలికయై
మనసెల్లా నెరిగిన మంత్రవాది
చనవున జలధిలో సంప దిందిరనికిఁ జూపె
అనుసరి వాఁడివో అంజనగాఁడు ॥భవ॥

పట్టరాని కాళింగుపడిగెలమీఁదు మెట్టి
పట్టినాఁడు వాఁడువో పాములవాఁడు
అట్టె శ్రీవెంకటనాథుఁ డమరుల నెల్లనుఁ జే
పట్టి దైత్యులఁ జంపించె పాళగాఁడు ॥భవ॥

రేకు 4 సంఖ్య 22 సంపు 16 పుట 18

సీ. భవరోగములనెల్లఁ బాపెడు బలువెజ్జు
మొకరి పయిఁడిపక్షి సకినగాఁడు
జననికి తననోట జగములు సూపిన
సవతుగానని యైంద్రజాలికుండు;
పెకలించి యొకకొండ పెడకేలఁ దాల్చిన
వెక్కసంబగు బారివిద్యవాఁడు
ఎల్లభూతములకు నేలినవాఁడయి
మనసు నెఱింగిన మంత్రవాది
చనవున వఁట్రికి సంపద కడలిలో
కనఁజేయు నంజనకాఁడు వీఁడు

గీ. మీఱి కాళింగుపడగలమీఁద మెట్టి
పట్టి తఱిమిన పాములవాఁడు వేంక
టాద్రిపతి యమరులఁబ్రోచి యసురకోటి
వాలుమగఁటిమి గెడపెడు పాళెగాఁడు.

మలహరి

సంకెలేక తలఁచిన జాణలకు
సంకీర్తనమె పో సర్వశాంతి ॥పల్లవి॥
భవహర మగు శ్రీపతి నామమె
జవకట్టి తలఁచితే జన్మశాంతి
తవిలి హరిపూజ తాఁ జేయుటె
కువలయమున నిదిగో గృహశాంతి ॥సంకె॥
అంది ధ్రువవరదుఁడ యనినదె
కందువైన సర్వగ్రహశాంతి
యిందు రవి నయనుని నెరుఁగుటె
చందమైన దిదివో నక్షత్రశాంతి ॥సంకె॥
భావించి యనంతునిఁ బలుకుటె
కావించిన దిదివో కాలశాంతి
శ్రీవెంకటనాథునిఁ జేరుటె
దేవమానవులకును దేహశాంతి ॥సంకె॥

రేకు 4 సంఖ్య 20 సంపు 16 పుట 11

సీ. జాణల కెవ్వేళ శంకలేక యొనర్చు
సంకీర్తనమ్మెపో సర్వశాంతి
భవహరంబైన శ్రీపతిభవ్యనామంబె
జవకట్టి తలఁచిన జన్మశాంతి
తవిలి శ్రీహరిపూజ తాను గావించుటే
తలపోయ గృహశాంతి ధాత్రియందు
ధ్రువవరదా యని తొడరి వాకొనుటయే
సకలగ్రహమ్ముల శాంతి సుమ్ము
ఇందుభాస్కరనేత్రు నెఱిఁగి సేవించుటే
చందమైనట్టి నక్షత్రశాంతి
ఆ. అనుదిన మ్మనంతు నచ్యుతుఁ బలుకుటే
కడఁగి తాను సల్పు కాలశాంతి
నమ్మి వేంకటాద్రినాయకుఁ జేరుటే
దేవమానవులకు దేహశాంతి.

మలహరి

వింతువిధానమువలె నీవు గలిగుంతఁగాను
పంతినయోగికిఁ బూర్ణభావవె మంచిది ॥పల్లవి॥

కలకాలము భూమిఁ గతలె వింటిమిగాని
నల నహుషాదు లున్నారా యేమి
యిఁలో నితరులెల్లా నేమిలెక్క యిందుకుఁగా
యెలయింపువిషయాల యేమరఁగఁ దగునా ॥నిందు॥

చేపట్టి పురాణాలు చెప్పఁగా వింటిమిగాని
బాపురె దుర్యోధనుసంపద యేది
కాపాడ నిప్పటివారికలిమి యెంచఁగ నేది
యీ పాటిపనికిఁగా నిది గోరఁ దగునా ? ॥నిందు॥

మళ్లిమళ్లి భూమిలోన మాటలే వింటిమిగాని
తొల్లిటి బలాఢ్యుల సత్త్వ లేవి
వెల్లవిరై యెప్పుడూ శ్రీవెంకటనాథ నీదాసు
లెల్లకాలముఁ జెడని యీ బలిమె నిజము ॥నిందు॥

రేకు 5 సంఖ్య 29 సంపు 16 పుట 17

సీ. కలకాల మిలలోనఁ గతలె వింటిమిగాని
నల నహుషాదు లున్నార యేమి?
ఇతరు లేమి లెక్క? యెలయింపువిషయాల
నేమరగాఁ దగ దింమకేని;
చెప్ప పురాణాలు చెవుల వింటిమిగాని
వసుధ రారాజుసంపత్తి యేది ?
నేఁటివారిసిరు లేపాటి ? యీ పాటి
పనికిగా నివి కోరుకొనఁగఁ దగునె?
గీ. మాటలను వింటిమే గాని మరల మరల
తొల్లిఁటి బలిమికాంద్రసత్త్వ లవేవి ?
వెల్లవిరిగ నీ సేవకు లెల్లప్రొద్దు
చెడని యీ బల్మియె నిజంబు శ్రీనివాస!

దేసాళం

వట్టి విచారము లేల వగపు లేల
నెట్టన శ్రీహరిఁజేర నేరవలెఁ గాక ॥పల్లవి॥

కాలమేమి సేసీని కర్మమేమి సేసీని
యేలిన శ్రీరమణుఁడె యెదనుండఁగా
అలించిన ధ్రువునిని ఆజామిళునిని
కాలమేమి సేసె నయ్య కర్మమేమిసేసెను ॥వట్టి॥

పాపమేమి సేసీని పగయేమి సేసీని
కాపాడె దేవుఁడె దగ్గర నుండఁగా
యేపున ఘంటాకర్ణుని యెలమిఁ బ్రహ్లాదుని
పాప మేమిసేసెనయ్య పగయేమి సేసెను ॥వట్టి॥

కులమేమి సేసీని గుణమేమి సేసీని
నలువైన శ్రీవెంకటనాథుఁ డుండఁగా
అలరి వాల్మీకికి అలనాఁ డహల్యకు
కులమేమిసేసె నయ్య గుణమేమి సేసెను ॥వట్టి॥

రేకు 8 సంఖ్య 48 సంపు 16 పుట 25

సీ. వట్టివిచారముల్ వగపు లేటికి ? తాను
నెట్టన హరిఁజేర నేరవలయు
కాల మేమి యొనర్చుఁ గర్మ మేమి యొనర్చు
నేలిన శ్రీపతి యెడఁద నుండ ?
ధ్రువుని నజామిళుఁ దొడరి యే మొనరించెఁ
గాల ? మే మొనరించెఁ గర్మచయము ?
పాప మేమి యొనర్చుఁ? బగయేమి యొనరించు ?
కాపాడువేల్పు దగ్గఱనె యుండ ?
ఏచి ఘంటాకర్ణు నెలమి ప్రహ్లాదుని
నేమిచేసెను పాప? మిట్టి పగయు ?
గీ. ఏమిచేయు కులము? గుణ మేమి చేయు
నలువుగా వేంకటాచలనాథుఁ డుండ
నలరి వాల్మీకికి నహల్య కాత్మ దలఁప
నేమిచేసె కులము? గుణ మేమిచేసె ?

దేవగాంధారి

నిమిష మొదతెగక హరి నిన్నుఁ దలఁచి
మమత నీమీఁదనే మరిపి బదుకుటగాక ॥పల్లవి॥

నిదురచేఁ గొన్నాళ్ళు నేరములఁ గొన్నాళ్ల
ముదిమిచేఁ గొన్నాళ్లు మోసపోయి
కదిసి కోరిసను గతకాలంబు వచ్చునె
మది మదనె వుండి యేమరక బదుకుటగాక ॥నిమి॥

కదుఁ దనయులకుఁ గొంత కాంతలకు నొకకొంత
పెదయాసలకుఁ గొంత వెట్టిసేసి
అదరి కావలెనని నందు సుఖమున్నదా
వెదక నీ సేవలే సేసి బదుకుటగాక ॥నిమి॥

ధనమువెంటాఁ దగిలి ధాన్యంబునకుఁ దగిలి
తనవారిఁ దగిలి కాతరుఁ డైనను
కనుకలిగి శ్రీవెంకటనాథ కాతువె
కొనసాగి నిన్ను నే కొలిచి బదుకుటగాక ॥నిమి॥

రేకు 10 సంఖ్య 59 సంపు 16 పుట 38

సీ. నిదురచేఁ గొన్నాళ్లు నేరాలఁ గొన్నాళ్లు
ముదిమిచేఁ గొన్నాళ్లు మోసపోయి
కదిసి కోరిన గతకాలంబు వచ్చునే ?
యేమరక బ్రిదుకు టింతెగాక
తనయులకై కొంత తరుణులకై కొంత
వెడయాసలకుఁ గొంత వెట్టిసేసి
కావలెనన్నచోఁ గలదె సుఖం బిందు
బ్రిదుకుటగాక నీ పాదసేవ
గీ. ధనమువెంటఁ దవిలి ధాన్యమునకుఁ దగిలి
తవిలి తనవారి మివుల కాతరుఁ డయినను
కనుగలిగి కాతు నీవె వేంకటగిరీశ!
నిన్నుఁ గొలిచి బ్రిదుకుటగాక యనవరతము.

బో ॥

తన కోరిక లేఁటికి నారఁడె యిన్నియుఁ గల్పించఁగ
అనువుగ నిందుకు యిద్దరియత్నంబులు వలెనా ॥పల్లవి॥
అద్దముచూచెటియాతఁ డలరుచు నవ్విన నవ్వును
అద్దములోపలినీడయు నా రీతినె కాదా
గద్దరియగు శ్రీవిభు సంకల్పంబుననె జగముల
సుద్దులు దుఃఖము సుఖమును సూటిఁబడెఁ గానా ॥తన॥
నాఁటక మాడించునతఁడు నయమునఁ గదలింపంగా
నాఁటకమందలి బొమ్మలు నానాగతిఁ జెలఁగున్
ఆటలఁ జేతన్యాత్మకుఁడగు దేవునిచేష్టలనె
పాటిగఁ బాపముఁ బుణ్యము బహుళంబగుఁ గానా ॥తన॥
అరదము నడపెటి సారథి యటునిటు వాగెలు వట్టిన
అరదముగుఱ్ఱములు మెలఁగు నాయాముఖములను
నరులను శ్రీవెంకటగిరినాథుఁడె తగఁ బ్రేరింపఁగ
గరవము లేమియుఁ గలిమియుఁ గలిగుండుఁ గానా ॥తన॥

రేకు 8 సంఖ్య 17 సంపు 16 పుట 10

సీ. అద్దమ్ముఁ జూచువాఁ డలరుచు నవ్విన
నద్దంపునీడయు నటులె నవ్వు;
గద్దరి శౌరిసంకల్పమ్మున జగాల
సుఖదుఃఖములు రెండు సూటివడును;
నయమునఁ గదలింప నాటక మందలి
బొమ్మలు పలువిధమ్ములఁ జెలంగు;
అఖిలచైతన్యాత్ముఁ డగు దేవుచేష్టల
పాపమ్ము పుణ్యమ్ము బహుళ మగును
గీ. సారథి ధరింప వాగెలు వారువములు
మెలఁగు నెట్లు లాయాముఖమ్ములను, నట్లె
వృషనగాధీశ్వరుండు ప్రేరింప నరులఁ
గలిమి లేమియు గరువము పొలయుచుండు.

దే వ గా ం ధా రి

నేరి చెప్పేదు బ్రిదికె నేరక యెవ్వేడు చెడె
భారకుఁ డందరికి శ్రీపతి యింతేకాక ॥పల్లవి॥
వొక్కరి నేరము లైతె నూరకె వెదకఁజూచే
నక్కటా నా గుణదోషా లవి యెంచను
వొక్కటై విచారించితే వొరులేమి తానేమి
అక్కడ నిక్కడ గురి హరియింతె కాక ॥నేరి॥
దట్టించి వొక్కరినైతె తప్పు లెంచఁజూచేను
అట్టె నా యపరాధాల కొజ్జ యేదో
నెట్టనఁ దలపోసితే నేనేమి పరులేమి
గట్టిగా స్వతంత్రుఁడు శ్రీకాంతుఁ డింతెకాకా ॥నేరి॥
వూరకె వొక్కరి నైతె వొచ్చములు వట్టేను
కారుకమ్మినట్టి నా కల్ల లెంచను
గారవించి శ్రీవెంకటనాథుఁడు నన్ను
సారెకు రక్షించఁగాను జయ మాయఁగాకా ॥నేరి॥

రేకు 4 సంఖ్య 24 సంపు 16 పుట 14

సీ. ఎవఁడు నేర్చి బ్రదికె నెవఁడు నేరక చెడె
నఖిలభారకుఁడు మురారి గాక
ఒకరినేరములైన నూరక వెదకుదు
చెలఁగు నా గుణదోషములు గణింప;
సరిగా విచారింప నొరులేమి తానేమి
అక్క డిక్కడ గుఱి హరియె గాక
దట్టించి యొక్కరితప్పు లెంచఁగఁ జూతు
నట్టె నాతప్పుల కొజ్జ యేదొ ?
నెట్టనఁ దలపోయ నేనేమి పరులేమి
యీశ్వరుండె స్వతంత్రుఁ డింతె గాక
గీ. ఒచ్చెములు పట్టెదనుగాక యొకరినైన
కారుగ్రమ్మినయట్టి నా కల్ల లెంచ
గారవమ్మున వేంకటగ్రావనాథుఁ
డనిశముం బ్రోవఁగా జయ మాయెఁ గాక !

గౌళ

నిచ్చలూఁ జెడవియట్టి నీకె తెలుసుఁగాక
యిచ్చల మావంటివా రేమెరుగుదు రయ్యా ॥పల్లవి॥

బాలుఁడు వృద్ధనియెటి పరిభాష లన్నియును
మూలమూలలను దేహమునకె కాక
యీలో నెంచిచూచితే నెన్నటివాఁడు
కోలుముందై పెరిగీనో కొంచె మయ్యీనో ॥నిచ్చ॥

మంచిది చెడ్డ దనెటి మాట లెల్లా భువిలోన
యెంచిచూడ మనుజుల కింతెకాక
నించి సర్వపూర్ణుఁడవై నీవులేని చోటేది
తుంచరాదు పెంచరాదు తొల్లె కలవు ॥నిచ్చ॥

వాఁడు వీఁ డనియెటి వచనాలు జగములో
పోఁడిమి జీవులయందె పొసంగెఁ గాక
వేడినా కొసరినాను విశ్వవ్యాపకుఁడవై
నాఁడు నేఁడు శ్రీవెంకటనాథుఁడవె కలవూ ॥నిచ్చ॥

రేకు 5 సంఖ్య 26 సంపు 16 పుట 15

సీ. నిచ్చలు చెడనట్టి నీకే తెలియుఁగాక
యిచ్చల మముబోంట్ల కేమి తెలియు ?
బాలుండు వృద్ధను పరిభాష లన్నియు
మూలమూలల దేహమునకె గాక
భావించి చూడ నీప్రాణి యెన్నటివాఁడు
గొనకొని పెరుగునో కొంచె మగునో ?
మంచిది చెడుగను మాట లీ భువిలోన
నెంచంగ మనుజుల కింతెగాక
నిఖిలపూర్ణుండవు నీవు లేని స్థలంబు
త్రుంచఁ బెంచఁగ రాదు తొల్లె కలవు;
గీ. వాఁడు వీఁడను వచనాలు వసుధయందు
జీవులందుఁ దలంపఁగఁ జెల్లెఁగాక
వేఁడినం గొసరిన నీవు విశ్వమందు
నాడు నేఁడును నిండి యున్నావు స్వామి !

నా రా య ణ దే సా క్షి

ఐనదేది కాని దందులో నేది
నానారూపి శ్రీనాథుఁడె కాకా ॥పల్లవి॥

యెవ్వరి దూషించే మెవ్వరి భూషించే
మెవ్వరు స్వతంత్రు లిందులో
అవ్వల నివ్వల నంతరాత్ముఁడైన
య వ్వనజాక్షుని నసుటగాకా ॥ఐన॥

యెందుకుఁ గోపించే మెందుకు మెచ్చే
మెందుఁగద్దు మే లిందులో
అందు నిందుఁ దానె యల్లుకొన్న
నందనందనునే నమ్ముటగాకా ॥ఐన॥

యే చోటు మంచిది యే చోటు చెడ్డది
యే చోటు సతమౌ నిందులో
కాచేటి శ్రీవెంకటనాథుఁడె
చేచేతఁ గాచాచై చెల్లించేఁ గాకా ॥ఐన॥

రేకు 5 సంఖ్య 27 సంపు 61 పుట 15

సీ. ఎవ్వరి దూషింతు మెవ్వరి భూషింతు
మెవ్వారలు స్వతంత్రు లిందులోన
నవ్వల నివ్వల నంతరాత్ముం డైన
య వ్వనజాతాక్షు నసుటగాక
ఎందుకుఁ గోపింతు మెందుకు మెచ్చెద
మే మేలు దలపంగ నిందుఁ గలదో
అందు నిందునఁ దానె యల్లుకొన్న ముకుందు
నుల్లమ్ములో నమ్మియుంట గాక
గీ. మంచి చోటేది చెడుచోటు మఱియు నేది
ఎద్ది సతమైనచోటు తా నిందులోన
ఐనదేది కానిది యేది అఖిలమ్మాపుఁ
డెంచ వేంకటవిభుఁడె చెల్లించుఁగాక !

## శ్రీ ని వా స శ త క ము

ఆ హి రి నా ట

ఇందరు నేల దూరేరు హితవే నీవుసేయఁగా
ముందుముందె తమ్ముఁ గర్మములు సేయుమంటివా ॥పల్లవి॥

తెలిసి నిన్నుఁ గొలువ దేహ మిచ్చితివి గాక
బలిసిన మాయలలోఁ బడుమంటివా
పలసి నిన్నుఁ దలఁచ మన సిచ్చితివిగాక
కొలఁగట్టి విషయాలఁ గోరు మంటివా ॥ఇంద॥

నగుతా నిన్నుఁ బొగడ నాలు కిచ్చితివి గాక
అగడుగా నూరమాట లాడుమంటివా
సొగసి నిన్నుఁజూడఁగాఁ జూపు లిచ్చితివి గాక
వగవగలతో నూరివారిఁ జూడు మంటివా ॥ఇంద॥

శ్రీవెంకటనాథ నిన్నుఁ జేరు మనంటివి గాక
జీవులను మనుజులాఁ జేరు మంటివా
భావించి నీదాసులనె భజించు మంటివిగాక
పావతి లంపటాలతోఁ దడఁబడు మంటివా ॥ఇంద॥

రేకు 7 సంఖ్య 40 సంపు 16 పుట 28

ఏలదూటెద రింద హితవీవు సేయఁగా
కావింపు మంటివా కర్మములను ?
తెలసి నిన్నుఁగొలువ దేహ మిచ్చితిగాక
మటి పడుమంటివా మాయలందు ?
తులసి నిన్నుఁదలంప మన సిచ్చితివిగాక
వెన కోరుమంటివా విషయములను
నగుచు నిన్నుఁబొగడ నాలు కిచ్చితిగాక
ఆడుమంటివె దురాలాపములను ?
సొగసి నిన్జూడంగ చూపు లిచ్చితిగాక
చూడుమంటివె ఊరివాడవారి ?

గీ. చేరుమంటివిగాక నిన్ శ్రీనివాస !
చేరుమంటివె నీతపుజీవకోటి ?
అలరి నీ దాసుల భజింపు మంటిగాక
అంటివా ? లంపటాల మిట్టాడు మనుచు.

లలిత

అందరు వికార మందుదురె
నిందలేని నీవు నీదాసులుదక్క ॥పల్లవి॥

సతుల సుతులఁ జూచి జగములో వారెల్లా
మతిలోన భ్రమయక మానరు
రతి కెక్కఁగా హేయరాగరహితుఁడవై
సతతము గలిగిన స్వామివి నీవు దక్క ॥అంద॥

ధనధాన్యములు చూచి తగినజీవులు వాని
వెనువెంటఁ దిరుగక విడువరు
పనిపూని యాశాపాశదూరుఁడవై
ఘనత గలుగు శ్రీకాంతుఁడ నీవు దక్క ॥అంద॥

యిల్లు ముంగిలి చూచి యీ దేహులు వాని
నొల్ల మనుచు రోసి వుడుగరు
వెల్లవిరిగ శ్రీవెంకటనాథుఁడవై
తెల్లమైనయట్టి దేవుఁడవు దక్క ॥అంద॥

రేకు 8 సంఖ్య 44 సంపు 16 పుట 44

సీ. సతుల సుతులఁ జూచి జగములో వారెల్ల
మతిలోన భ్రమయక మానఁబోరు
రతి కెక్కఁగా హేయరాగరహితుఁడవై
యెపుడుగల్గిన స్వామి వీవుదక్క
ధనధాన్యములు చూచి తగినజీవులు వాని
వెనువెంటఁ దిరుగక విడువఁబోరు
మునుకొని యాశావిమోహదూరుండవై
యెసఁగు శ్రీకాంతుఁడ వీవుదక్క

గీ. ఇల్లు ముంగిలి కనుఁగొని యీ శరీరు
లొల్ల మని యుల్లములరోసి యుడుగఁబోరు
వెల్లివిరిగ శ్రీవేంకటవిభుఁడ వగుచు
నీడులేనట్టి దేవుఁడ వీవుదక్క

నాట

ఇందరిఁ జూచి చూచి యెఱఁగ వద్దా
బందెపసులకు మెర వన్నిందనేలా ॥పల్లవి॥

యినుమునఁ జేసిరా యెవ్వరిదేహమైనా
పొనిఁగి పోతేఁబోవు పోకుంటే మాను
పనివడి యిందుకుఁగాఁ బాటువడ నేమిటికి
మొనసి దోసపంటికి యినుపకట్టేలా ॥ఇంద॥

మంచిరాతఁజేసిరా మనుజుని మేనేమి
నించి చెడితేఁజెడు నిల్చితే నిల్చు
పొంచిపొంచి యిందుకుఁగా పొడిఁబడ నేఁటికి
పంచ పీరుబుగ్గ రాతిబరణిఁ బెట్టనేలా ॥ఇంద॥

చేఁగమానఁ జేసిరా చెల్లఁబో నరుల నెల్లా
యీఁగి కుంగితేఁ గుంగు హెచ్చితే హెచ్చు
నాఁగువార శ్రీవెంకటనాథుఁడు మన్నించఁగాను
దాఁగి జీలుగుబెండుకు తరము వెట్టనేలా ॥ఇంద॥

రేకు 10 సంఖ్య 68 సంపు 16 పుట 82

సీ. ఇనుమునఁ జేసిరా యెవరిదేహంబైన
ఉండినసుండు లేకున్నఁ బోవు
పనివడి యిందుకై పాటువడఁగనేల
తొసపంటికేల ఆయసపుకట్టు?
మనుజుని మేనేమి మఱి రాతఁజేసిరా
చెడినను జెడు నిలిచినను నిలుచు
ఇందుకై పొడిఁబడవేల? రాతిబరణి
నేటికి పెట్టంగ నీటిబుగ్గ?
గీ. చేసిరాయేమి నరులను చేవమ్రాన
హెచ్చినన్ హెచ్చు క్రుంగిన నిట్టె క్రుంగు!
నిచ్చలు వృషాద్రివిభుఁడు మన్నించ జీల్గు
బెండువకు పూన్కి తటిమెనఁ బెట్టనేల?

దే సా ళం

ఎఱుక గలిగితేను యీతఁడె దిక్కు
మఱి నిమిష మీతని మానివుండఁ దగునా ॥పల్లవి॥

యెవ్వరిసొమ్ము గుడిచి యెవ్వరిగుణాలవెంట
కొౢవ్వుదీరఁ బారాడి కొలిచేది
యివ్వలఁ బుట్టించి పెంచి యేలినదేవుఁ డుండఁగా
అవ్వలివ్వలి వారిని ఆసపడఁదగునా ॥ఎఱు॥

తా నెవ్వరికిఁ బుట్టి తలఁకక వూరివారి
నానందాన అయ్య లమ్మ లనుకొనేది
పానిపట్టి సర్వవిధబంధుఁడు విష్ణుఁ డుండఁగా
మానిసిచుట్టరికాలు మరుఁగఁగఁ జెల్లునా ॥ఎఱు॥

యెందువంకనో యీ దేహి యేమిటినో పొగడుచు
విందువలె నెవ్వరిని వెట్టిఁ జేసేది
కందువైన శ్రీవెంకటనాథుఁడు గావఁగా
సందుసుకికోరికల సటఁబడఁ జెల్లునా ॥ఎఱు॥

రేకు 10 సంఖ్య 55 సంపు 16 పుట 81

సీ. ఒకరిసొము గుడిచి యొరుగుణముల వెంట
కొౢవుఁదీఱఁగఁ బాఱి కొలుచు టెటు ?
పుట్టించి కృపఁబెంచి బ్రోచు దేవుం డుండ
వారి వీరిని అనపడఁగఁ దగునె ?
తా నొక్కరికిఁ బుట్టి తగ నూరివారల
నయ్య లమ్మ లటంచు ననుట యెట్లు ?
బహువిధబంధుండు పద్మాక్షుఁ డుండఁగ
నరులచుట్టఱికాలు మరఁగఁ దగునె ?

గీ. ఎందువంకనో యీ దేహి విందువోలె
వేరివేరినొ పొగడుచు వీటిడి యగు
అందమై కావ శ్రీవేంకటాద్రివిభుఁడు
సందుసుడి కోరికల నేల సటఁబడంగ ?

లలిత

పచ్చిగాఁ దెలియకుంటె బహుముఖమై తోఁచు
అచ్చమై యిన్నియును శ్రీహరికల్పితములే ॥పల్లవి॥

కొందరు పుట్టుదురూ, కొందరు దీవింతురు
చందపుసంసారము జాడ లివి
కందువ రేయిఁ బగలుఁ గాలము నడచినట్టె
అందరిలోఁ గలుగు శ్రీహరికల్పితములే ॥పచ్చి॥

కొన్నిటిపై కోపము కొన్నిటిపై వేడుక
వున్నతి దేహధారుల వోజ లివి
పన్ని కాయ పండు దొండపంటియందె తోఁచినట్టు
అన్నియుఁ బుట్టించిన శ్రీహరికల్పితములే ॥పచ్చి॥

కొంతచోట మనుజులు కొంతచోట దేవతలు
అంతా శ్రీవెంకటనాథు నాజ్ఞ యిది
చెంత చప్పనయుఁ దీపు చెఱకందె వుండినట్టు
కాంతుఁడైన శ్రీహరికల్పితములే ॥పచ్చి॥

రేకు 3 సంఖ్య 18 సంపు 16 పుట 7

సీ. కొందఱు శపియింతుర్రి కొందఱు దీవింత్రు
సరవి సంసారపుజాడ లివ్వి
కాలము నడచెడుగతి రేయి పవలుగా
కలిగెడు నివి హరికల్పితములె;
కొన్నిటిపైఁ గిన్క కొన్నిటిపై వేడ్క
యొగి దేహధారుల యోజ లివ్వి
దొండపండున కాయ పండు తోఁచినయట్లు
కడఁక నిన్నియు హరికల్పితములె

గీ. కొన్నితావుల మనుజులు కొన్నియెడల
నమరు లలమేలుమంగేశునాజ్ఞ లివ్వి
చప్పనయుఁ దీపు చెఱకందె యొప్పనట్లు
కనఁగ నిన్నియు శ్రీహరికల్పితములె,

మలహరి

హరి! మొరవెట్టితె అన్ని పనులు లెస్సవును
సరవి నెన్నాళ్లని జాలిఁబడవచ్చును ॥పల్లవి॥

యేమిసేయు నీ జీవుఁ డీ యరివర్గాలతోడ
బూమెల నెన్నాళ్లని పోరాడీని
చూమరలఁ జూడఁజూడ జుట్టాలవలె వుండి
దోమటి పంచేంద్రియాలు దోడుగాక పోయను ॥హరి॥

యెక్కడ చొచ్చి జీవుఁ డీ కర్మఋణములు
పెక్కువిధములఁ బిరువీకుసేయఁగా
వొక్కొక్కనాఁటి వడ్డె వోడగీఁగాని తల
తిక్కగొన్న పాపములు దీరకె పోయను ॥హరి॥

యెవ్వరు దిక్కీ జీవుని కెంతని యీఁదఁగలఁడు
యివ్వల సంసారమనె యీ వారిధి
నవ్వుతా శ్రీవెంకటనాథుని మఱఁగు చొచ్చి
యివ్వేగఁ దా దటచేరి యిన్నియు గెలిచెను ॥హరి॥

రేకు 2 సంఖ్య 3 సంపు 16 పుట 4

సీ. అక్కటా! యీజీవుఁ డరివర్గములతోడ
బూమెలనెన్నాళ్లు పోరఁగలఁడు?
చూడఁజూడఁగఁ దనచుట్టాలవలెనుండి
పంచేంద్రియములు తోడ్పడకపోయె
కర్మప్రఋణములు గాసివెట్టుచునుండ
నెక్కడి కీజీవుఁ డేగఁగలఁడు?
ఒకొక్కనాఁటికి నొడుగుచుండఁగ వడ్డి
తలతిక్కపాపముల్ తొలఁగవయ్యె
గీ. ఎవ్వ రీజీవునకు గతి? యిటు భవాబ్ధి
నెంతయని యీఁదఁగలఁడు! తా వృషగిరీశు
మఱుఁగుఁజొచ్చి యాస్వామికి మొఱలిడంగ
పనులు లెస్సగుఁ, మఱి జాలిఁబడఁగ నేల!

లలిత

పండించితేఁ గలుగునా పరమాత్మునిదాస్యము
నిండుమతి నుండితేను నెరవేరుఁగాక ॥పల్లవి॥

బాధకు నోపనివాఁడు పాపము సేయనేల
పోదిసేయఁ దొలుతేమి బుద్ధి లేదా
సాదువలె నుండితేను సర్వేశ్వరుఁడె తన్ను
వాదులాట లెల్ల మాన్పి వహించుకోఁడే ॥పండి॥

దండుగ కోపనివాఁడు తప్పులు సేయఁగ నేల
వుండరాదా తా నుండె వొడికానను
కొండవంటియాసతోడ కోరక తా నుండితేను
తండుముండై లంపటాలు తగిలీనా తనకు ॥పండి॥

వళుకు కోపనివాఁడు వచ్చి పూఁటవడనేల
వొలిసినట్లు తనంత నుండరాదా
కలకాలము శ్రీవెంకటనాథుఁ గొలిచితె
అలరి యభయ మిచ్చి అట్టె కావ నోపఁడా ॥పండి॥

రేకు 5 సంఖ్య 80 సంపు 16 పుట 17

సీ. బాధకోపనివాఁడు పాపకృత్యము లేల
పోఁదిసేయఁగఁ దొల్త బుద్ధిలేదె ?
సాదుగ నుండిన సర్వేశ్వరుఁడె తన్ను
వహియించుకొనలేఁడె వాదు లుడిపి
దండుగ కోర్వని దాఁటి తప్పులు వీడి
యొడికాన నొకచోట నుండరాదె ?
కొనలేని యాసతో కోరకయుండిన
తనకు లంపటములు తగులుకొనునె ?

గీ. వళుకు కోపనట్టిఁడు పూటవడఁగ నేల
వలసినట్లు తనంతటు మెలఁగ రాదె
ఎల్లకాలము శ్రీవేంకటేశుఁ గొలువ
నట్టె కావంగ నోపఁడా అభయ మిచ్చి.

సా మ ం త ం

అల్లము బెల్లమౌనా అన్నలాల
యెల్లకాలమును గుణమేల మానీనయ్యా ॥పల్లవి॥

నిక్కము గొండలనీరు నేలకు వేగమె పొడు
యెక్కువనేలపై నీరు యెక్కదందుకు
మిక్కిలి ప్రకృతిలోన మెలగెటి వానికి
చొక్కమైన జ్ఞాన మెట్టు సొగసీ నయ్యా ॥అల్ల॥

అచ్చపుఁబాలలోన తోడంటితేనె పెరుగౌను
పచ్చి సేసినఁ బెరుగు పాలు గాదు
పచ్చి పచ్చి యెఱఁగనివానికిఁ దెలుప వచ్చు
కుచ్చితుని నెటువలె గుణిఁ జేసే దయ్యా ॥అల్ల॥

చందనపువాసనలు సంగడిమాఁకుల నంటు
అందలివాసన లిందు నంట వెన్నఁడు
కందువైన శ్రీవెంకటనాథునిదాసు
లెందుండినా నితరము లేల తోఁచీనయ్యా ॥అల్ల॥

రేకు 8 సంఖ్య 10 సంపు 16 పుట 9

సీ. ఇలకు జాల్వాఱు కొండలనీర; మెక్కదు
నేలమీఁదిజలంబు శైలములకు;
మిక్కిలి ప్రకృతిలో మెలఁగెడువానికి
చొక్కమౌ జ్ఞానంబు సొగియు నయ్య
అచ్చపుఁబాల తోడంటినఁ బెరుఁగగు
నేలీలఁ బెరుఁగది పాలుగాదు
ఎఱుఁగనివానికి నెఱుఁగఁ జెప్పఁగ వచ్చు
గుణిసేయఁ బోలదు కుత్సితాత్ము;

గీ. చందనపుఁదావి నికటవృక్షముల నంటు
నందలిపరిమళము లిందు నంట వెపుడు
వలనుగా వేంకటావలవాసు దాసు
లెందు లారున్న నితరము లేల తోఁచు?

# శ్రీనివాసశతకము

## లలిత

తచ్చి చూచితేఁజాలు దైవమే కలఁడుగాక
హెచ్చిన మాయలఁ బడనేల మాకు నిఁకను ॥పల్లవి॥

సారెసారె నే నెంత సంపదలు గోరినాను
పోరచి నీ దేహమెకా భోగించేది
యీ రీతి మనసు దా నెన్నటికిఁ దనిసీని
గారవాన హరి నిన్నుఁ గన్నదె దక్కేను ॥తచ్చి॥

పలుమారు చావులేని బదుకు కాసపడేది
యిలలో సంసారమెకా యేఁ జేసేది
కలిగినయాస యే కాలమున ముదుసును
అలరి విష్ణునిశరణన్నదె సిలిచె ॥తచ్చి॥

వేడుకతో ఘనమైన విద్యలు నేరిచినాను
జోడుగా నిందరికిని చూపు దింతేకా
పీడని తలఁపుతో శ్రీవెంకటనాథునిఁ గొల్చి
యీడేరి బదుకుటె యెన్ని కింతే కాకా ॥తచ్చి॥

రేకు 6 సంఖ్య ౨౮ సంపు 16 పుట 20

సీ. త్రిచ్చిచూచినఁ జాలు దైవతమ్ము గలఁడు
మాయలఁబడనేల మరల మరల
సారెసారెకు నెన్ని సంపదల్ గోరిన
పుడమి నీ తనుభోగమునకుఁ గాదె ?
తనియు నెన్నటికి నీ మనసు ? గారవమున
నచ్యుతుఁ గనుఁగొన్న యదియె దక్కు;
మృతిలేనియట్టి జీవితము నాసించుట
కావించుటకుఁ గాదె కాఁపురములు ?
ఏ కాలమున నహో! యీ యాస ముదియుట ?
అబ్జాక్షు శరణన్న యదియె నిలుచు;
గీ. ఎన్నివిద్యలునేర్చిన నిందఱకును
వింతగాఁ జూపుటకుఁ గాదె ? వేడ్కమీఱ
పరమభక్తి వృషాచలపతి భజించి
తలఁపు లీడేటి బ్రదుకుట తగును మనకు.

ల లి త

ఏలికైయైన హరి నేల మరవఁగ వలె
తొలుమాలి మరియాల భంగపడవలెను ॥పల్లవి॥

యిరుకుమానిసంది నేఁటికిఁ జొరవలె
తిరుగలేక యేల తిమక వలె
యెరవులవిషయాల నేల పొరలవలె
కొరగాని పాపాలగొడ వేల వలెను ॥ఏలి॥

మిగుల వురులలోన మెడయాల పెట్టవలె
తగిలించుకొని యేల పొగులవలె
యెగసక్కెపుఁగోరిక లేల కోరవలె
జిగురువంటిబందాలఁ జిక్క నేలవలెను ॥ఏలి॥

పారేబండికింద పాదమేల చాఁచవలె
జారుపడి మరియాల జడియవలె
మీరి శ్రీవెంకటనాథు మిక్కిలి వేడుకఁగొల్చి
పోరుమాలి వుండకేల పొడిఁబడవలెను ॥ఏలి॥

రేకు 9 సంఖ్య 49 సంపు 16 పుట 28

సీ. ఇఱుకు పెంటిముసంది నేఁటికిఁ జొరవలెఁ
దిరుగఁజాలక యేల తినుకవలయు ?
యెరవులవిషయాల నేల పొరలవలె ?
కొఱగాని పాపాల గొడవ యేల ?
మిగులనురులలోన మెడ పెట్టఁగా నేల ?
తగిలించుకొని యేల పొగులవలయు ?
ఎకసెక్కియపుకోర్కు లేల కోరఁగ వలె
జిగురుబంధాలలోఁ జిక్క నేల ?

ఆ. పాఱుబండికి క్రింద పదము చాఁచగ నేల
జాఱిపడి మఱేల జడియవలయు ?
ఏలికైన వేంకటేశు మఱవనేల ?
భంగపడఁగనేల పొ్రిలుమాలి ?

లలిత

కారము సీదిగాన పట్టి విన్నవించేఁగాక
ఆరితేరి ఒక్కరిగే దది యెన్నఁ డయ్యా ॥పల్లవి॥
వీలని సంసారపువెట్టి నేఁ జేయఁగాను
యేలిన నిన్నుఁ గొలిచే దెన్నఁడయ్యా
కాల మెల్లా విషయాల గాడినె కట్టుండఁగాను
ఆలించి నీ సేవ సేసే దది యెన్నఁడయ్యా ॥కార॥
కట్టబయలు మాయలబారిఁ బడి వుండఁగాను
యిట్టె నిన్నుఁ దలఁచే దెన్నఁడయ్యా
వుట్టిపడే కోరికల వువ్విళ్లూరఁగాను
అట్టె నిన్నుఁ బొగడే దది యెన్నఁడయ్యా ॥కార॥
సొలసి నాలుక సూరసుద్దులె తడవఁగాను
యిలపై నిన్ను నుతించే దెన్నఁడయ్యా
కలిగి నన్నును శ్రీవెంకటనాథ కాచితివి
వలియించెఁ దపము యీ బాగు లెన్నఁడయ్యా ॥కార॥

రేకు 6 సంఖ్య 36 సంపు 16 పుట 21

సీ. విడని సంసారపువెట్టి నేఁ జేయంగ
నేలిక నినుఁగొల్చు టెన్నఁడయ్య!
కాలమెల్లను విషయాలఁ గట్టువడంగ
మన్నన సేవించు టెన్నఁడయ్య!
వారక మాయలబారి నేఁ బడియుండ
నిట్టె నిన్నుఁ దలంచు టెన్నఁడయ్య!
విరియుకోరికల నువ్విళ్లూరుచుండ, నే
నిన్ను నుతించుట యెన్నఁడయ్య!
గీ. ఊరిసుద్దులె తడవంగ నోరితోడ
నిన్ను లక్ష్మీశుఁ బొగడుట యెన్నఁడయ్య!
కాచినాఁడవు గాని వేంకటనగేశ!
యేను బుద్ధియెఱుంగుట యెన్నఁడయ్య!

రా మ క్రి య

పీవు గలిగినఁజాలు నిక్కము అన్నీఁ గలవు
అవల మాయాచార్యుఁ డానతిచ్చె నయ్యా ॥పల్లవి॥

యే లోకమున నున్న యెడయని సొమ్ము నీవె
తాలిమి యెందుఁబోని ధనము నీవె
కాలముకడా తరగని ధాన్యము నీవని
ఆలించి మాఁ పరుఁ డిట్టె ఆనతిచ్చె నయ్యా ॥నీవు॥

యెందెందుం దిరిగిన యేలికవు నీవె
నిందలేనియట్టి తోడునీడవు నీవె
ముందువెనకల నిల్లు ముంగిలియు నీవె యని
అందముగ దేశికుఁడె ఆనతిచ్చె నయ్యా ॥నీవు॥

యెన్నఁడుఁ గలఁగనట్టి హితుఁడవు నీవె
పన్నినట్టి వుండె నిచ్చపంటా నీవె
నన్నుఁ గావే శ్రీవెంకటనాథుఁడ వని తాళ్లపా
కన్నమయ్యం గారె నాకు నానతిచ్చె రయ్యా ॥నీవు॥

రేకు 8 సంఖ్య 46 సంపు 16 పుట 26

సీ. ఏ లోకమున నున్న యెడయని సొమ్మీవె
తాల్మి వేడకుఁబోని ధనము నీవె
కల్పాంతములు తఱుఁగని ధాన్య మీవని
యాచార్యుఁ డతికృప నానతిచ్చె;
ఎందెందుఁ దిరిగిన నేలువాఁడవు నీవె
నిందపొందని తోడునీడ వీవె
ముందువెన్కల నిల్లు ముంగిలి వీవని
యందమ్ముగా గురుఁ డానతిచ్చె;
గీ. ఎన్నఁడు లభింపరానట్టి హితుఁడ వీవె
పన్నినట్టుండు నిచ్చలపంటవీవె
నన్నుఁ గాచెడు వేంకటనాథుఁడ వని
యన్నమాచార్యులే నాకు నానతిచ్చె.

సా ళం గ నా ట

అప్పని వరప్రసాది అన్నమయ్య
అప్పసము మాకె కలఁ డన్నమయ్య ॥పల్లవి॥

అంతటికి నేలికైన ఆదినారాయణుఁ దన
యంతరంగాన నిలిపి నన్నమయ్య
సంతసానఁ జెలువొందె సనకసనందనాదు
లంతటివాఁడు తాళ్లపా కన్నమయ్య ॥అప్ప॥

బిరుదుటెక్కెములుగాఁ బెక్కు సంకీర్తనములు
హరిమీఁద విన్నవించె నన్నమయ్య
విరివిగలిగినట్టి వేదముల యర్థమెల్లా
అరసి తెలిపినాఁడు అన్నమయ్య ॥అప్ప॥

అందమైన రామానుజాచార్యమతమున
అందుకొని నిలిచినాఁ డన్నమయ్య
విందువలె మాకును శ్రీవెంకటనాథుని నిచ్చె
అందరిలోఁ దాళ్లపాక అన్నమయ్య ॥అప్ప॥

రేకు 4 సంఖ్య 28 సంపు 16 పుట 18

సీ. అంతటి కేలిక యాదినారాయణు
నాత్మ నిల్పినయాతఁ డన్నమయ్య
సనక సనందన సన్మౌను లంతవాఁ
డరుదైన తాళ్లపా కన్నమయ్య
బిరుదు టెక్కెములుగాఁ బెక్కు సంకీర్తనల్
హరిమీఁదఁ బాడినాఁ డన్నమయ్య
విరివిగల్గినయట్టి వేదార్థముల నెల్ల
వరసి తెల్పినయాతఁ డన్నమయ్య

గీ. అందమైనట్టి రామానుజార్యమతము
నందుకొని నిల్పినట్టివాఁ డన్నమయ్య
విందువలె మాకు వేంకటవిభు నొసంగె
అప్పనివరప్రసాది మా అన్నమయ్య.

దే సా ళం

ఎట్టి హితోపదేశకుఁ డెటువంటి దయాళువు
అట్టి తాళ్లపాకన్నమాచార్యులు ॥పల్లవి॥

పచ్చితామసుల మమ్ముఁ బరమసాత్త్వికులఁగా
యిచ్చటనె సేసినాఁడు యెంత చిత్రము
యిచ్చగించి మా కులాన నెన్నఁడులేని వైష్ణవ
మచ్చముగాఁ గృపసేసె నన్నమాచార్యుఁడు ॥ఎట్టి॥

ముదిరిన పాపకర్మములు సేసినట్టి మమ్ము
యెదుటఁ బుణ్యులఁజేసె నెంత సోద్యము
కదిసి యే జన్మానఁ గానని సంకీర్తన
మదన నుపదేశించె నన్నమాచార్యుఁడు ॥ఎట్టి॥

గడుసుఁదనపు మమ్ముఁ గడు వివేకులఁ జేసి
యిడుమ లెల్లాఁ బాపె నే మరుదు
నడుమనె యెన్నఁడుఁ గానని శ్రీవెంకటనాథు
నడియాలముగ నిచ్చె నన్నమాచార్యుఁడు ॥ఎట్టి॥

రేకు 9 సంఖ్య 52 సంపు 16 పుట 29

సీ. ఎంత దయాళువో యెంత హితోపదే
శకుఁడొ మా అన్నమాచార్యవరుఁడు
పచ్చితామసులను పరమసాత్త్వికులుగా
నిచ్చట మముఁజేసె నెంతవాఁడొ!
ఏనాఁడు కులమున లేని శ్రీవైష్ణవ
మచ్చముగా నిచ్చె నన్నమయ్య
ముదిరినపాపముల్ మున్నొనర్చిన మమ్ము
నెదుటఁ బుణ్యులఁజేసె నెంతవాఁడొ!
కదిసి యే జన్మానఁ గనని సంకీర్తన
మదన బోధించె మా కన్నమయ్య

ఆ. గడుసుఁదనపుమమ్ముఁ గడు వివేకులఁ జేసి
యిడుమ లెల్లఁ బాపె నెంతవాఁడొ!
నడుమ నెపుడు గనని నాగాద్రినిలయు మా
కండగాఁగ నిచ్చె నన్నమయ్య.

# తాళ్లపాక చినతిరుమలాచార్యుల అధ్యాత్మసంకీర్తనల
# అ కా రా ది సూ చి క



# సవరణల పట్టిక

[గ్రంథనామముతో గూడ పంక్తులలెక్క]

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 1 | 25 | యనిళ | ననిళ |
| 2 | 11 | పంబిన | పంబిన |
| 9 | 19 | కలిలె | కవిలె |
| 40 | 16 | సవసు | సరసు |
| 45 | 5 | కొరయడు | కొదయడు |
| 46 | 20 | పొసిలిరి | పొలసిరి |
| 54 | 32 | వ్యర్థముం | వ్యర్థముగ |
| 56 | 15 | ముమ్ము | మత్ము |
| 65 | 12 | యిదే | యిందే |
| 66 | 11 | యనంత | యనంతక |
| 80 | 11 | పొంనే | పొంతనే |
| 81 | 8 | గాదదేవి | గాదవేది |
| 87 | 8 | గావలె | గావవలె |
| 99 | 14 | నంచు | నందు |
| 101 | 25 | తల | తత |
| 102 | 31 | కిన | కిని |
| 121 | 19వ పంక్తి చివరనున్న 'మా' 18వ పంక్తిచివర చేర్చుకొనవలెను | | |
| 174 | 18 | పుదాణ | పురాణ |
| 176 | 25 | యవియె | పీయవియె |
| 185 | 18 | నసు నసు | నసు మసు |
| 188 | 4 | సేంవిచు | సేవించు |
| 198 | 18 | విక్రిను | నిద్రిమ |
| | 20 | వేళగాని | వేగాచి |
| 214 | 21 | ఆక్మ | ఆన్మి |
| 215 | 25 | ఉరమె | దలమె |
| 221 | 21 | బ్రొద్దుగా | బ్రొద్దుకు |
| 235 | 4 | పంచి | పంబి |
| 238 | 7 | యెంతానా | యెంతైనా |